# Nirvachana Kumarasambhavam

A True Rendering in Telugu Verse of the Original Work of Kalidasa's Kumarasambhavam

BY

**T. V. SURYA PRASADA RAO**

**SIDDHANTAM.**

Madras:

PRINTED AT THE ANANDA PRESS.

1913.

 **Price Re. 1.**]

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

శ్రీకాళిదాసమహాకవికుమారసంభవమునకు సరియగు

# నిర్వచనకుమారసంభవము.



ఇది

శ్రీమద్దేవీభాగవతాంధ్రీకరణధురంధర
శ్రీమత్త్రిపురానతిమ్మయరాట్కవీంద్రపుత్త్రుండును
నిర్వచనరఘువంశాదిగ్రంథకర్తయు
నగు
వేంకటసూర్యప్రసాదరాయకవిచే
నాంధ్రీకృతము.

మొదటి కూర్పు: ౧౦౦౦ ప్రతులు.

మద్రాసు

ఆనంద ముద్రాలయమున ముద్రితము.

దీనివెల] 1913. [రూ. ౧

# ఉపోద్ఘాతము.

క. విద్యలకు నెల్ల కవితా
విద్యయు భాషలకుఁ దెలుఁగువిధమున మఱి స
ర్వద్యుసదులకు న్నీవలె
విద్యానేత్రీ ! మహాకవిస్తుతిపాత్రీ !

"శ్లో. పురా కవీనాం గణనాప్రసఙ్గే కనిష్ఠికాధిష్ఠితకాళిదాసా,
అద్యాపి తత్తుల్యకవే రభావా దనామికా సార్థవతీ బభూవ."

అనియు,

"శ్లో. కాళిదాసకవితా నవం వయో మాహిషం దధి సశర్కరం పయః,
ఐణమాంస మబలా చ కోమలా సంభవన్తు మమ సర్వజన్మని."

అనియు,

"శ్లో. నిసర్గామలవాక్యస్య కాళిదాసస్య సూక్తిషు,
ప్రీతి ర్మధురసార్ద్రాసు మఞ్జరీష్వివ జాయతే."

అనియు,

"శ్లో. సాకూతమధురకోమలవిలాసినీకణ్ఠకూజితప్రాయే,
శిక్షాసమయేఽపి ముదే రతలీలా కాళిదాసోక్తిః."

అనియు,

"శ్లో. కాళిదాసగిరాం సారం, కాళిదాస స్సరస్వతీ,
చతుర్ముఖోఽథవా సాక్షా ద్విదు ర్నాన్యేతు మాదృశః."

అనియు, వేయేల? "కవికులగురుఁడగు కాళిదాసు కవితాకామిని విలాసమే" అనియు మహామహులచే నుతింపఁబడిన కాళిదాసునిగూర్చి కాని యామహాకవిసార్వభౌముని గ్రంథములంగూర్చికాని వ్రాయఁబూనుటకంటె సాహసపుఁబని వేఱొం డుండ దనుట నిర్వివాదాంశము. ఆ

మహామహునిచే రచింపఁబడిన గ్రంథములలో నొకం డగు కుమారసంభవము ప్రస్తుతవిషయ మగుటం జేసి యద్దానిం గుఱిచి కొండొక వ్రాయకటీక వ్రాయుచున్నాను.

ఈనిర్వచనకుమారసంభనప్రబంధమునకు మూలభూతమగు కుమారసంభవమహాకావ్యము శివపురాణము లలితోపాఖ్యానము మున్నగు పురాణములం జదివినవారికిఁ దన్మూలక మని తోఁపక మానదు.

అట్టియాతనికుమారసంభవమహాకావ్యము సంస్కృతభాషాపరిచితి లేనివారి కనాస్వాద్యమయి యున్నది. సంస్కృతభాషం జదివినవా రయినను బాల్యమునం దందలి కొన్ని సర్గములే చదువుచుండుదురు గాని గ్రంథమంతయుఁ జదువరు. ఆకావ్యము మనయాంధ్రభాషలో నింతవఱకును నెవ్వరును నిట్టు వ్రాసియున్నట్టు గనుపట్టదు. శ్రీనాథకవిసార్వభౌముఁ డందలికొండొక భాగమును దనహరవిలాసములోఁ దెలిఁగించియున్నాఁడు గాని యదియుఁ దనయిచ్ఛకు వచ్చినమచ్చున స్వతంత్రించి రచించినట్టు గనుపట్టుచున్నది. మఱియుఁ గవులచరిత్రలో వక్కలంక వీరభద్రకవి యక్కావ్యముం దెలిఁగించినట్టుగాఁ జూపట్టుచున్నది గాని యం దుదాహరింపఁబడినపద్యములే తక్కఁ దక్కినగ్రంథ మెక్కడను జిక్కుటలేదు. ఉన్నను; ఆయుదాహృతము లయినపద్యములవలన గ్రంథ మంతయు స్వతంత్రించి తెలిఁగింపఁబడిన ట్టూహింప నగుచున్నది. మఱియు శ్రీవేంకటగిరిసంస్థానములో నెవరోయొకబట్టుకవి తెలిఁగించియున్నట్టుగా వినవచ్చుచున్నది గాని యది యింతవఱకును నేత్రగోచరము గాలేదు.

కాఁగా నింతవఱకుఁ గుమారసంభవమును యథామాతృకముగాఁ దెలిఁగించుటలో నీకవిచంద్రుఁడే మొదటివాఁ డని చెప్పక తప్పదు.

హిమవద్వర్ణనము, పార్వతీజననము, తపస్సుకై శివుఁడు హిమగిరికరుదెంచుట, గిరిజ శంకరునికిఁ బరిచర్య సేయుట, తారకాసురపీడితు లయి యింద్రాదిదేవతలు దమయవస్థను బ్రహ్మదేవునిసన్నిధిని విన్నపించుకొనుట, పరమేష్ఠిచెప్పినయుపాయము, సహస్రాక్షుఁడు ఫాలాక్షుతపస్సు చెఱుచుటకై మన్మథుని రావించి నియోగించుట, పశుపతితపోవనమునఁ బు

వృచాపునివ్యాపారము, కామదహనము, రతివిలాపము, ఆకాశవాణి
రతిదేవి నూఱడించుట, హైమవతి మృత్యుంజయునిగూర్చి తపస్సుచే
యుట, వటువేషముతో మహానటునిరాక, పార్వతీపరమేశ్వరసంవాదము,
శూలి ప్రత్యక్షమగుట, చంద్రశేఖరుఁడు పార్వతి నడుగుటకై సప్తర్షు
లను గొండలరాయునియొద్దకుఁ బంపుట, గిరిసుతాగిరీశులవివాహము, మీ
నకేతనునిపునరుజ్జీవనము, ఉమామహేశ్వరులవిహారము, సూర్యాస్తమ
యాదివర్ణనము, అగ్నిభట్టారకుఁడు పావురమై దేవదేవునియొద్దకు వచ్చు
ట, శంభుఁడు పావకునియందుఁ దనతేజస్సును సంక్రమింపఁజేయుట,
పురందరునియాజ్ఞచే వైశ్వానరుఁడా తేజమును గంగయందు విడుచుట,
అది స్నానార్థ మేఁగినషట్కృత్తికలయందును సంక్రమించుట, వారు
దానిని శరవణమున విడుచుట, కుమారస్వామిజననము, కుమారుని ద
మకు సేనానిగ నిమ్మని వాసవుఁడు శర్వుని వేఁడఁబోవుట, గుహునిసైనా
పత్యాభిషేకము, కుమారపురస్సరముగా దేవతలు తారకాసురునిపై
దాడి వెడలుట, రాక్షసులయుద్ధసన్నాహము, దేవాసురయుద్ధము, తారక
వధ, ఇంద్రునిపట్టాభిషేకము ననుసందర్భముల నొప్పారి యనేకరసవద్వ
ర్ణనభరితంబుగఁ గవితాసామ్రాజ్యపట్టభద్రుండగు కాళిదాసునిచేఁ బదు
నేడుసర్గములుగా రచింపఁబడినయితివృత్తముగల యమ్మహాకావ్యము నీ
విద్వత్కవిచంద్రుఁ డాఱాశ్వాసములు గల యీ " నిర్వచనకుమారసం
భవ " మను ప్రబంధమునుగా రచించెను.

ఇప్ప్రబంధపుఁబీఠికలోని 29 - వ పద్యము మొదలు 50 - వ పద్య
ములవఱకును గల సందర్భముచేఁ గవియే తనవంశాదికముంగూర్చి వివరిం
చికొనియుండుటంజేసి యిందు వేఱుగా వివరింప నవసరము లేదు. మఱి
యుఁ బీఠికలోని 6 - వ పద్యమువలన నీకవియొక్కవిద్యాగురునిసంగతి
స్పష్టము. 7 - వ 42 - వ పద్యములవలన నీకవయితతండ్రియగు తమ్మయ
రాట్కవిచంద్రుఁడు దేవీభాగవతమును దెలిఁగించినట్లు దెలియఁగలదు.
శ్రీదేవీభాగవతమును దెలుఁగు గావించినవారిలో నిక్కవిచంద్రునితండ్రి
యే మొదటివాఁడు. ఇతఁడు పీఠికలోని 18-వ పద్యములోఁ దనయింటిపే

రును, దండ్రి పేరును, దన పేరును సందముగాఁ బొందుపఱిచియున్నాఁడు. ఇక్కవికిఁ దిక్కనసోమయాజికవిత్వమునం దెక్కువమక్కువ యున్నట్టు పీఠికలోని 19-వ పద్యమువల్లఁ దెల్లమగుచున్నది. మఱియుఁ దిక్కనసోమయాజివలెనే రసోచితముగాఁ గవిత్వము చెప్పవలయు నను నిచ్ఛ యొడమినట్టుగా 20-వ పద్యములో నిక్కవి వ్రాసికొనెను. నిక్కముగ నాలోచింపఁగా నిక్కవికవిత్వము గొన్ని విషయములంబట్టి తిక్కనసోమయాజికవిత్వముకన్న మిన్నయే యని యెన్నఁదగి యున్నట్టు పొడగట్టుచున్నది. తిక్కనసోమయాజి స్వతంత్రరచనగలతనకవిత్వమునందుఁ జూపినధారాశుద్ధికన్న నిక్కవి నియమబద్ధమైనరచనగల యిప్ప్రబంధమునం దెక్కువ ధారాశుద్ధిని జూపియున్నాఁడని నొక్కి వక్కాణింపవచ్చును. అనఁగానిక్కవిపుంగవుఁడు మూలములోని ప్రతిశ్లోకమును భాషయు వృత్తమును మాత్రమే మాఱిచి యరఁటిపండ్లొలిచి పళ్లెములో నుంచి చేతి కందించిన ట్లీప్రబంధములో నంధానించి యాంధ్రుల చేతి కందించియున్నాఁడు. కావుననే:—

" క. అసిధారావ్రత మూని స
రసు లౌరా! యనుచు నబ్బుఁరంపడురీతిం
బొసఁగఁ దెలిఁగింతు సూర్య
ప్రసాదరాయకవిచంద్ర! పరిహృతతంద్రా!"

అని యీతని తెలిఁగింపుంగూర్చి యొకానొకకవిచేఁ జెప్పఁబడిన పద్య మతిశయోక్తికోటి నవగాహింప దని నొక్కివక్కాణించుచున్నాను. ఈగ్రంథమునుబట్టి యీవిద్వత్కవియొక్క సలక్షణమైనసంస్కృతాంధ్రభాషాపాండిత్యము స్పష్టము గాఁగలదు. అందును బీఠికాపద్యములును, ఆశ్వాసాంతపద్యములును నితని పాండిత్యకవిత్వములకుఁ బ్రబలదృష్టాంతములు. మఱియు నిక్కవికిఁ దిక్కనసోమయాజికంటె నెక్కువ చక్కఁగాఁ గందములఁ బొందుపఱుచుటయం దభిలాష యున్నట్టు గనుపట్టుచున్నది. కావుననే గ్రంథమంతటిలోను మూఁడువంతులు కందపద్య

ములును, ఒకవంతు తదితరపద్యములును రచించియుండఁబోలును. అంతి యే కాక యీకవివర్యునికి సాధారణముగాఁ గందముల రచియించుట లోనే యెక్కువ కుతూహలమున్నట్టు తోఁచుచున్నది. కనుకనే:—

"క. కందములరచనలో నీ
కుం దిక్కనసోమయాజికూడ నొకింతం
గ్రిందటితరగతిలోఁ జే
ర్పం దగు సూర్యప్రసాదరాయకవీంద్రా!"

అని యొకకవి యీకవిని బ్రశంసించియున్నాఁడు. మఱియుఁ దిక్కనసోమయాజి స్త్రీపర్వమునందుం బలెనే యీతఁడును దన యీ ప్రబంధములోని యాఱవయాశ్వాసములోఁ దుదను, అనఁగా మూలములోని 17-వ సర్గమును వేఱువేఱు వృత్తములలోఁ దెలిఁగించియున్నాఁడు. అందుఁ దిక్కనకవి చెప్పినవృత్తమును మరలమరలం జెప్పుచువచ్చెను. ఈతఁడో సర్గమంతయుఁ జెప్పినవృత్తము మరలఁ జెప్పుటలేదు. దానిం బట్టికూడ నితనినియమము తిక్కనసోమయాజినియమముకన్న నెక్కుడే యని చెప్పకతప్పదు. ఏవంచ; ఇతఁడు పీఠికలోని 20-వ పద్యములోఁ జెప్పికొనియున్నసంగతిని సర్వవిధములచేతను నిర్వహించుకొనె నని పూర్వాపరసందర్భములంబట్టి తెలియఁదగును.

మాతృకలోని మొదటి యెనిమిదిసర్గములుమాత్రమే కాళిదాసుని వనియుఁ దక్కిన తొమ్మిదిసర్గములును నతనివి గావనియు నైనను నాయనపేరున నుంటంజేసి తాను దెలుఁగుసేయఁబూనుకొన్నట్టును బీఠికలోని 24-వ పద్యములో నిక్కవి నొక్కివక్కాణించియుండెను. కాని యందుగుఱించి తగినయాధారములు గనంబడమింజేసి యిప్పటి కాయనతో నేకీభవింపఁజాలను.

సంస్కృతవిద్యార్థులకుఁ గాళిదాసకవిచంద్రుని కుమారసంభవ మెంత యుపకరించునో యాంధ్రవిద్యార్థులకును నీ నిర్వచనకుమారసంభవ మంత యుపకరించు ననియుఁ గావున నాంధ్రభాషం బెక్కు తెఱం

గుల నున్నతస్థితిని బొందింపఁ బ్రయత్నించుచున్న భాషాభిమాను లంద ఱును నీప్రబంధమును బఠనపాఠములయం దుపయోగపఱిచి తమభా షాభిలాషలోఁగూడ నీకవిచంద్రునిపరిశ్రమమును సార్థకపఱుచుదురు గాకయనియు వర్తమానభావికాలములయందలి యాంధ్రభాషాభిమానుల ను సవినయముగఁ బ్రార్థించుచుఁ గవితాగరిమంగుఱిచి యిక్కవిచేఁ దెలిం గింపఁబడియున్న "నిర్వచనరఘువంశము" లోనిపీఠికనుండి యొక్కపద్య మును బ్రియపాఠకమహాశయుల కుపాయనీకరించుచున్నాను:—

"చ. తొలుతఁ గవిత్వ మబ్బుటయ • దుర్లభ మబ్బినఁ బ్రౌఢకావ్యసం
కలనపటిష్ఠ యౌప్రతిభ • గల్గుట యంతకు దుర్లభం బదిం
గలిగెనయేని దాశరథి• కావ్యకథాకథనప్రవృత్తిపైఁ
దలఁ పతిదుర్లభంబు కవి• తాచరితార్థత యంత చుల్కనే?"

అప్రస్తుత మయినను నీకవిచంద్రునినిర్వచనరఘువంశమునకుఁ బ్రసక్తి తటస్థించుటంజేసి యాప్రబంధముగుఱించి నేను రచియించియు న్నపద్యములలోని దొక్కనిక్కవమగు కందపద్యము నందాకఁ బాఠక మహాశయులప్రరోచనార్థ మిందుఁ బొందుపఱుపకుండ నుండఁజాలక యిట్లు చేయుచున్నాఁడను:—

"క. అమరం బౌ రఘువంశము
కుమారసంభవముకన్నఁ • గోటిమడుంగుల్
కుమధురముగఁ దెలిఁగించితి
క్రమపడి సూర్యప్రసాద•రాయకవీంద్రా!"

ఈనిర్వచనకుమారసంభవమునం దెడనెడ సంస్కృతసమాసభూ యిష్ఠములగు పద్యము లున్నను శ్లిష్టకఠినపదవిశిష్టములు గామింజేసి సుబోధములై పాఠకులహృదయముల కింపు నింపునే కాని విసువు జనిం పఁజేయవు. ఇతఁడు తనయీప్రబంధమును సర్వవిధముల చేతను సలక్షణ ముగా రచించియుండియుఁ బీఠికలోని 26-27-వ పద్యములచే వినయ మును జూపించి తనకవితాప్రావీణ్యమునకును బొందిక నిప్పించెట్టియు

న్నాఁడని విన్నవించుచు నితనికవిత్వాదులంగుఱించి నాచే రచింపఁబడిన పద్యములు గొన్నియిం దుదాహరించి యీతని ప్రబంధముపై నుపోద్ఘాతము వ్రాయునదృష్టము నాకుఁ గలిగించినందులకై నీ కెంతయుఁ గృతజ్ఞుఁడనగుచు నిప్పటికి లేఖిని నన్యత్ర వ్యాపారింపఁజేయుచున్నాను:—

శా. దేవీ! తావకదివ్యవైభవము న♦ర్థిం దెల్పఁగాఁ జాలు నా
దేవీభాగవతమ్ము మొట్టమొదటం ♦ దెల్గించి యాత్మీయవి
ద్యావైదుష్యము వెల్లడించె హరిభ♦క్తాగ్రేసరుండున్ మహీ
దేవప్రాంగణకల్పవృక్షమును వై♦దేహోపమానుండు నా
నీవిద్వత్కవితంద్రి; యిప్పుడితఁ డం♦తే వింతగా భారతీ
దేవీపూరుషమూర్తి నాఁగను ధరిం♦త్రిం గీర్తి గైకొన్న సం
ఖ్యావంతుం డగు కాళిదాసునిమహా♦కావ్యంబు లొక్కింతయున్
భావాదుల్ సెడకుండఁ బండితులు పే♦బా సంచు నెల్లప్డు సం
భావింపం దగురీతి నాంధ్రమునకున్ ♦ మాన్యత్వముం గూర్చ నీ
సేవం దెల్గొనరించి నైజ మగుపాం♦డిత్యమ్ముఁ జూపించె నా
హా! వేనోళుల మెచ్చఁగా వలవదే ♦ యాచంద్రతారార్క మెం
తో విఖ్యాతిని గాంచు నీసుకవిచం♦ద్రోత్తంసునుద్గ్రంథముల్.

ఉ. తమ్మయరాట్కవీంద్రుఁడు వ♦దాన్యశిఖామణియొక్క పుణ్యపా
కమ్మనఁ జాలునీకవిశి♦ఖామణి యాకవితావధూటికిన్
సమ్మత మాగతిం గడుఁ బ్ర♦సాద మొసంగె నిజాఖ్య సేకదే
శమ్మయి సొంపు నింపెడుప్ర♦సాదపదమ్మది సార్థకమ్ము గాన్.

చ. అనితరసాధ్య మాఘణితి ♦ నాకవిరాట్కృతులం దెలుంగుసే
సినమహనీయు నీసుకవి♦శేఖరు నే మని మెచ్చవచ్చు నం
చును మది నెంచియుం దుదకు ♦ సుంతయుఁ దోఁచక యాంధ్రకాళిదా
సనుటకు నిశ్చయించితిన ♦ యమ్మరొ! నీ కది సమ్మతమ్మె కా.

శా. వేయేలా? యలకాళిదాసుఁడె జగ♦ద్విఖ్యాతమై యొప్పు నా
త్మీయాభిఖ్యను మోసియున్నకృతు లాం♦ధ్రీకర్త కామాత్ముఁడై
యీయాకారముఁ దాల్చి వచ్చెనొకొ యం♦చే నెంతుఁ గాదేని యా
హా! యేవంవిధరీతిఁ గూర్చుటకు శ♦క్యమ్మౌనె కామేశ్వరీ!

ఉ. మంగళ మాత మీసుకవి♦మౌళిసృజించిన కావ్యకన్యకున్
మంగళ మాత ముత్తమస♦మాదృతవేషకు నాంధ్రభాషకున్
మంగళ మాతఁ దద్ధితము ♦ మాటికిఁ గోరెదుపూరుషాళికిన్
మంగలముంబలేన్ మొగము ♦ మాడిచికొందురుగాక తద్రిపుల్.

ఉ. శ్రీయుతపూషపాటికుల♦సింధువునం దుదయించి భూసురా
త్మ్యాయతిదాయక మ్మగుచు ♦ నంతటఁ గీరితిఁ గాంచి మించువి
ద్యాయతకల్పవల్లరికి ♦ నాశ్రితుఁడై హితుఁడైనసూర్యనా
రాయణతీర్థు లిట్టులు య♦థార్థముగా లిఖియించె నంబరో!

1-9-1913.
19. గోవిన్దప్పనాయని వీథి,
చెన్నపట్టణము.

ఇట్లు
సహృదయవిధేయుఁడు,
పురాణం - సూర్యనారాయణతీర్థులు.



# OPINIONS.

Verse for verse translation into Telugu from Sanskrit is a very difficult task and it requires much daring to assaye a rendering of Kalidasa's masterpieces. But that feat has been accomplished with remarkble success by M. R. Ry. Tripurana Venkata Surya Prasada Rao Garu of Siddhantam. He is a master of the poetic dialect and his work shows an artistic sense rare among Telugu poets. I compared portions of his *Kumarasambhava* and *Raghuvamsa* with originals. They have nothing of the artificiality and frigidness of translations and can be read by Telugu readers as if they were independent poems.

FORT VIZIANAGARAM, 14*th August* 1913. (Sd.) G. V. APPA ROW.

My dear Venkata Surya Prasada Rao Garu,

I am delighted to read your metrical translation of Kalidasa's *Kumarasambhava*. It is really a wonderful achievement. I sincerely congratulate you on it. There is hardly anything like this in the whole field of Telugu Literature—a literal translation of one of the best Sanskrit classics so happily rendered. You have a keen sense of the beauty of the original Sanskrit poem and you have a great command of the old literary dialect.

But the average Telugu man, even of the upper classes, cannot appreciate your poem. It appears only to a few, *i. e.*, of the Pundit class. How I wish you had cultivated the modern living dialect which you speak. It lends itself to a similar treatment. It would certainly immortalize your name if you could compose a *Kavya* in modern Telugu as good as your *Kumarasambhava*. Millions of Telugus would read and enjoy it.

VIZIANAGARAM, 12*th August*, 1913.

Yours sincerely,
(Sd.) G. V. RAMAMURTY.

## శ్రీమద్విజయనగరం మహారాజావారికాలేజీప్రిన్సిపల్ రావుబహదూర్. కిళాంబి - రామానుజాచార్యులవారు, ఎమ్. ఏ. బీ. ఎల్.

శ్రీయుత త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుగారు తెనిఁగించిన కాళిదాసకుమారసంభవమునఁ గొంతభాగముఁ జూచితిని. కవియభిప్రాయములు చెడకుండ సంస్కృతకావ్యము దెనిఁగించుట సులభము గాదు. అందును మహాకవియగు కాళిదాసుని రసపూర్ణములగు గ్రంథముల నాంధ్రీకరించుట దుస్సాధము. ఇట్టిపని సరసముగ నెఱవేర్చుటచే ప్రసాదరావుగారు పండితశ్లాఘాపాత్రమై యున్నారు. ఆంధ్రభాషయందు వీరి కనర్గళకవితాధార గలదని చెప్పుటకు సందేహము లేదు.

ప్రమాదినామ సం॥ శ్రావణ బహుళత్రయోదశిశుక్రవారము.
29-8-13.

కిళాంబి - రామానుజాచార్యుఁడు
శ్రీవిజయనగరము.

---

## మదరాసు క్రిష్టియన్ కాలేజి గీర్వాణభాషాప్రధానోపాధ్యాయులగు బ్రహ్మశ్రీ, వేదము వేంకటరాయశాస్త్రులవారు:—

మ-రా-శ్రీ, త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరగారికి:-

అయ్యా!

మీరు దయతో నొసంగిన మీరచియించిన "నిర్వచనకుమారసంభవము" నం గొన్నిభాగములం బరికించితిని. నాచూచినవఱకు గ్రంథము ఈకాలమందు అరుదైన మృదుమధురశైలిలోను కాళిదాసునియభిప్రాయమును పోఁగొట్టకయు, మనోహరమై యున్నది. ఇట్లే మీ రిపుడు రచియించుచున్న రఘువంశమును త్వరలో ముగించి ప్రకటింతురేని లోకోపకృతి యగును.

చెన్నపట్టణము.
7-9-13.

యుష్మన్మిత్త్రుఁడు,
వేదము-వేంకటరాయశాస్త్రి.

---

## మహారాజశ్రీ, జి. వేంకటరంగారావుపంతులవారు, ఎమ్. ఏ.

శ్రీమద్వేంకటసూర్యప్రసాదరాయప్రణీతంబైన "నిర్వచనకుమారసంభవము" నందలి కొన్నిభాగములను బఠించితిని. ఇది మహాకవి కాళిదాసవిరచిత కుమారసంభవమునకాంధ్రీకరణము. ఇందలికవిత్వధాటి రచనాసౌలభ్యము మొత్తముమీఁద శ్లాఘనీయముగ నున్నవి. మూలగ్రంథములోని యర్థగాంభీర్యము రసపుష్టియును చెడకుండునటుల

తేటతెనుఁగుమాటలతో రచియింపఁబడిన యీకావ్యము చదువరులకు హృదయానందము గావించు ననుటకు సందియము లేదు.

తిరువలిక్కేణి, చెన్నపట్టణము. }
1 - 9 - 1913. }

జి. వేంకటరంగారావు.

---

మదరాసు ప్రెసిడెన్సీ మేజస్ట్రీటుగారును, ఆంధ్రభాషాభిమానులును నయిన బ్రహ్మశ్రీ మహారాజశ్రీ, జయంతి-రామయ్యపంతులవారు:—

త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుగారు రచించినయాంధ్ర "నిర్వచనకుమార సంభవ" మచ్చటచ్చటఁ జదివినాఁడను. మొత్తముమీఁద గ్రంథము మూలానుసారముగ నున్నది. కవిహృదయము చాలవఱకు తేలిపోకుండ వచ్చినది. పద్యమునకుఁ బద్యము చెప్పినపుడు శైలి యనర్గళముగ నుండుట కష్టసాధ్యము. అయినను ప్రసాదరావుగారిశైలి ధారాళముగాను లలితముగాను ఉన్నదనుటకు సందేహము లేదు. వీరీగ్రంథమును రచించి యాంధ్రభాష నలంకరించినారు.

చెన్నపురి. }
27-8-13. }

జ. రామయ్య.

---

చెన్నపురి ప్రెసిడెన్సీకాలేజీయాంధ్రపండితుఁడును, ఆంధ్రవాల్మీకి రామాయణాదిగ్రంథకర్తయునగు బ్రహ్మశ్రీ, వావిలికొలను-సుబ్బారావు పంతులవారు:—

అయ్యా !

మీరు నాకుఁ గనఁబఱిచిన భవద్విరచితమైన "నిర్వచనకుమారసంభవమునందును, నిర్వచనరఘువంశమునందును" స్థాలీపులాకన్యాయంబున నాకు జ్ఞప్తియందున్న కొన్ని శ్లోకములకు సరియైన పద్యములను గొంతగ్రంథమును జదివితివి. గ్రంథము మూలమునకు సరిగా నున్నదని నాకుఁ దోఁచినది. భావము రసము చక్కఁగఁ బోషింపఁబడినవి. శైలియు హృద్యముగ నున్నది. ఈకాలమున నిట్టిగ్రంథములు తఱచు పుట్టుట లేవని నాయభిప్రాయము. ఆంధ్రభారతికి మీరు చేయుసేవ యనంతఫలదంబై శాశ్వతకీర్తి కలిగించుఁగాక.

చెన్నపురి. }
27-8-1913. }

ఇట్లు విన్నవించు
సుజనవిధేయుఁడు,
వావిలికొలను - సుబ్బారావు.

---

**శ్రీమద్విజయనగరసంస్థానాస్థానవిద్వత్కవి యగు శ్రీమాఁ భగవత్కవి ముడుంబై-నరసింహాచార్యస్వామిగారు:-**

మహారాజశ్రీ త్రిపురాన - వేంకటసూర్యప్రసాదరావుగారు రచించిన "నిర్వచన కుమారసంభవ" మను ప్రబంధమును నేను వింటిని. నిర్దోషముగాను, మిగుల మనోహరముగాను, ప్రౌఢముగాను, సంస్కృతమునకు సరిగాను నున్నది. ఇట్టికవి మిగుల దుర్లభుఁడు. చాలఁగా మెచ్చఁదగి యున్నది.

భగవత్కవి ము. నరసింహాచార్యస్వామి.

---

**శ్రీమద్విజయనగరమునందలి శ్రీమహారాజావారికాలేజిలోఁ దెనుఁగుపండితుఁడగు బ్రహ్మశ్రీ, గొ త్తి-సూర్యనారాయణశాస్త్రులవారు:-**

తా మనిచిన "కుమారసంభవము" నే నామూలాగ్రమ్ముగఁ జదివి కరమ్ము హర్షించితిని. గ్రంథము మృదుమధురసంస్కృతాంధ్రపదగ్రథితమై చరణపూరణశబ్దములు లేక మహాకవి శ్రీకాళిదాసుని కుమారసంభవమునకుఁ బ్రతిబింబమై యున్నది. ఇందలికందాదులు మీకుఁ బరమేశ్వరుఁ డనుగ్రహించిన నిరర్గళకవితావైదుష్యములం జూపుచుఁ గవిగ్రామణులకు సంతసమును గలిగింపకమానవు. ఆంధ్రీకరణములో నిన్నిసొగసులు చూపించిన మిమ్ములఁగూరిచి నే నేమని వ్రాయఁగలను.

శ్రీ విజయనగరము.<br>24-8-13.

గొ త్తి-సూర్యనారాయణశాస్త్రి.

---

**మహారాజశ్రీ, త్రిపురాన-వేంకటసూర్యప్రసాదరావుగారికి:—**

మహాకవి కాళిదాసకృతమగు కుమారసంభవమును దాము నిర్వచనముగ మృదుమధురపద్యముల నాంధ్రీకరించి మాయానందముద్రాయంత్రాలయమున ముద్రించుతిరేని నేను దానిని జదివినాఁడను. వ్యర్థపూరణములు లేక యర్థనిబిడమై యతిరసవంతమై మహాప్రౌఢమగు నాకావ్యమందలి శ్లోకములను దత్తదనుగుణములగు పద్యముల వానియర్థవైభవమును రసపుష్టియు భావచమత్కృతియుఁ గొఱవడనీక తెనిఁగించుటయు నట్లు తెనింగించుటయందు దుర్నివారములగు చప్పిడిసందుగొందులు వ్యర్థములగు ద్రుతస్వరాదులు మొదలగునవి కానిపింపకుండుటయు మెప్పును నాశ్చర్యమును గలిగించుటయే కాక శైలియుఁ గుంటులేక నిరర్గళమై మనోజ్ఞముగ సాగుటయు మీకవిత్వంపు మేలిమికి మెఱుఁగు పెట్టుచున్నది.

చెన్నపట్టణము.<br>6-9-13.

ఇట్లు,<br>తం. లేవపెరుమాళ్ళయ్య.



శ్రీ

రామచంద్రపరబ్రహ్మణే నమః.

# నిర్వచనకుమారసంభవము.

## ప్రథమాశ్వాసము.



శ్రీమోక్షప్రదమై సమస్తబుధసం
సేవార్హమై భోగితే
జోమాహాత్మ్యవిరాజియై గిరిశసం
స్తుత్యానుభావోల్లస
న్నామంబై యవితర్క్యమై సమధికా
నందంబుమై వెల్గుశ్రీ
రామబ్రహ్మము భక్తిమైఁ గొలుతు న
శ్రాంతంబు స్వాంతంబునన్. 1

ఉ. వల్లభు దూఱునక్కపటవర్ణిని నెఱ్ఱనిచూడ్కిఁ జూచి నా
యుల్లము మండెడుం బలుకకోరి శఠా యని లేచుభూమిభృ
త్తల్లజుపట్టిఁ బట్టి నిజతాత్త్వికరూపము సూపి మోహపు
న్వల్లి మునుంగఁ జేయువటువేషధరున్ హరు సంస్మరించెదన్. 2

ఉ. అంబుజనాభునాభికమలాంతరమందుఁ బ్రభూతవేదగా
నంబు మనోజ్ఞఝంకృతినినాదముఁ బోల లసన్మరందపా
నంబున కాసమై నెనయునాలుగుమోములవింత తేఁటిచం
దంబున నొప్పుమంగళవిధాతను ధాతను సన్నుతించెదన్. 3

శా. కైలాసక్షితిభృద్వరేణ్యము నిజోత్ఖాతోచ్ఛలంబై పునః
పౌలస్త్యోద్ధృతిశంక శంకరుఁ జలద్వామాంగుఁ జేయన్ లస

త్కేళీఝుంకృతిశంక వాపి యుగపత్పత్త్రాంకపాళీసుఖ
వ్యాలోలాత్మకుఁ డై తనర్చు కరిరాడ్వక్త్రుం బ్రకీర్తించెదన్.

సీ. లలితవిద్యుల్లతాలసితం బగు ప్రవాళ
ముద్యత్ప్రవాళ మై యొప్పు మీఱి
బహుళరత్నప్రభాభాసమానోపనా
హములు పూగుత్తుల నవలఁ ద్రోవ
వరనిబంధనబద్ధతరుణరత్నస్రవ
త్సలిలంబు పూఁదేనెసౌరుఁ దెగడ
నారోహణావరోహముల మీఁదికిఁ గ్రింది
కరుగుచూడ్కులు తేంట్ల ననుకరింపఁ

తే. దరుణమందారవేల్లితో ద్యల్లతాభ్ర
మంబు స్వప్రాణనాథుడెందంబు వ్రెంద
వీణ వాయించుచుండు నవ్వాణి నాదు
జిహ్వపై సంతతమ్ము వసించుఁగాత. 5

క. కొలుతుఁ మద్గురు సద్గుణ
కలితాత్ముని సంస్కృతాంధ్రకవితాచణు ని
ర్మలతత్త్వజ్ఞుని ధిషణో
జ్జ్వలధిషణుని ముక్కవిల్లిసాంబయశాస్త్రిన్. 6

క. శ్రీవేదవ్యాసకథిత
దేవీభాగవత మెల్లఁ దెలిఁగించి యశ
శ్శ్రీ వెలసిన మజ్జనకు మ
హావిద్వన్ముఖ్యుఁ దమ్మయాఖ్యు భజింతున్. 7

క. విష్ణుసమానుల నాకన
కృష్ణద్వైపాయనుల సమిద్ధయశోరో
చిష్ణుల సంస్కృతకవితా
నిష్ణాతవచఃప్రకీర్తనీయులఁ గొలుతున్. 8

ఉ. ఇంతకు నేర్చి యుండు నితఁ డీతని పల్కుల కింత యర్థ మం

చెంతటివాని కైన విధియింపఁగ రాక తనర్చువాని న
త్యంతరసోపబృంహకపదార్థవచోవిభవాభిరాము సే
వింతు ననన్యలభ్యసుకవిత్వవిలాసునిఁ గాళిదాసునిన్. 9

చ. తనకవితావధూటి వరదైవతవాక్సమలంకృతాంగి యై
తనరుచునాంధ్రవాణి కయిదండను జేకొని భారతత్రిప
ర్వనిరుపమానసౌధమున వర్తిలఁ గీర్తి వహించుశబ్దశా
సనబిరుదాఢ్యుఁ గొల్తు విలసద్గుణధుర్యునినన్నపార్యునిన్. 10

సీ. ఒకచోట శైరీషసుకుమారపదచయా
త్మకము లై హృదయరంజకము లగుచు
నొకచోట సాంద్రపులకకదంబకసంజ
నకము లై యతిభయానకము లగుచు
నొకచోటఁ జతురతాప్రకటరసోపబృం
హకము లై హర్షదీపకము లగుచు
నొకచోట నుపనిషత్సకలార్థబోధసా
ధకము లై ముక్తిదాయకము లగుచు

తే. శ్రోతృజనకర్ణములను జగత్తృపులఁ జేయు
నాంధ్రభారతపుండరీకాసనస్థ
తిక్కనబ్రహ్మముఖభారతీమనోజ్ఞ
గతుల నుతియింతు నాదువాగ్గతులగతుల. 11

ఉ. భారతసంహితం దెలుఁగుబాస రచించి యరణ్యపర్వ మా
ఱార కొంత వెట్టఁ దగ దన్కృతి నన్నయ తిక్కయజ్వ తా
నై రహిమై జనించి రసి యాత్మకవిత్వము సెప్ప నొప్పువి
ద్యారమణీయుఁ గొల్చెద మహాకవిముఖ్యుని నెఱ్ఱనాఖ్యునిన్.

ఉ. ప్రాజ్ఞజనాగ్రగణ్యుఁ డయి భాసిలుతిక్కనతోఁ గవిత్వత
త్త్వజ్ఞులు వీఁడ యీ డయినవాఁ డనఁగాఁ గవితావిభూతి స
ర్వజ్ఞుఁడ నా మనీషిజనవంద్యమనీషిత నొప్పుసత్ప్రమా
ణజ్ఞునిఁ గొల్తు సద్గుణసనాథుని నాచనసోమనాథునిన్. 13

క. అతిమృదులమధురపదపూ
రితముగ సుకవినుతమనుచరిత్ర నుడువు నం
చితయశుని నాంధ్రకవితా
పితామహుని నల్లసాని పెద్దనఁ గొలుతున్. 14

క. శ్లేషరసాంచితమృదుపద
పోషణ మగువసుచరిత్రమును బండితహృ
త్తోషకముగఁ జెప్పినకవి
భూషణ మగురామరాజభూషణుఁ దలఁతున్. 15

క. తక్కుంగలధర వన్నెకు
నెక్కినవిద్వత్కవీంద్రబృందములకు లో
నెక్కొనినభక్తి పెంపున
మ్రొక్కిడుదుఁ దత్ప్రసాదమునకల్మికి నై. 16

క. అని యిష్టదేవతావం
దనమును సుకవీంద్రకీర్తనంబును బొనరం
బొనరించి పూర్వసత్కవి
జనతాకవితాసుధారసప్లుతమతి నై. 17

క. లసమానయశస్సంప
త్త్యసమత్రిపురానతమ్మయమహాకవిచం
ద్రసుతుఁడ వేంకటసూర్య
ప్రసాదరాయాహ్వయమునఁ బరఁగినవాఁడన్. 18

క. ఏను వితర్కింపఁగ నా
మానసమునఁ గవులలోన మంజులకవితా
శ్రీనిధులలోనఁ దిక్కన
పో నెఱజాణ యనుతలఁపు పుట్టెం బిదపన్. 19

ఉ. తిక్కనసారపుంగయితతీ పెద పీటుకొనంగఁ జేసి నే
నొక్కతెలుంగుకావ్యము రసోచితభంగిరచించి ధాత్రిఁబెం
పెక్కినసత్కవీంద్రులయహీనయశంబును బొందు టొప్పన

న్వాక్కుసపుందలంపునను వీటిడి నైతి విచారహీనతన్. 20

క. తలఁచికొనఁ బిదప మది చం
చలత నిగుడ్చెం గుమారసంభవకావ్యో
జ్జ్వలరచనాసందర్భము
తలఁపునకున్ వచ్చి కరము తహతహ వ్రైడమున్. 21

చ. కవికులసార్వభౌముఁ డనఁగా నుతి కెక్కినకాళిదాసస
త్కవికవితారసంబును దగంగఁ దెలుంగున కేను దేర నం
తవలఁతిఁ గామి తెల్ల మయినం జలచిత్తముఁ ద్రిప్ప నేరమిం
దివిరి కుమారసంభవము నేఁ దెలిఁగింపఁగ సాహసించితిన్. 22

ఆ. గిరిసుతాగిరీశపరిణయాదిపవిత్ర
చరితములఁ గుమారసంభవంబు
నిఖిలపండితార్చనీయ మై పదునేడు
సర్గములఁ దనర్చు జగతి నందు. 23

ఉ. ఎన్మిది కాళిదాసుకవీంద్రుఁడు సర్గము లొప్పుగా రచిం
చె న్మతిఁ గల్గుతొమ్మిది రచింపఁగ లే దని పెద్ద లందు రం
చు న్మది నేనునుం దలఁచి చూడఁగ నాకును నట్లతోఁచె నై
న న్మహితాత్ము పేరను దనర్చుటఁ జేసి తెలుంగు చేసెదన్. 24

క. ఎడనెడఁ దగుయుగ్మంబుల
కడఁ దక్కఁగ శ్లోకమున కొకఁడ పద్యం బే
ర్పడఁగా నిర్వచనంబుగఁ
గడ ముట్ట న్నే రచింతుఁ గావ్యం బెల్లన్. 25

క. క్షితిపయినిఁ "బ్రమాదో ధీ
మతా మపి" యనెడుబుధోక్తి మది నిడి సుకవి
ప్రతతి క్షమి యంచు నాదుక
వితఁ గల్గెడుదోసములను వేయును నేలా. 26

తే. రహినిఁ ద్రిపురానతమ్మయరాట్కవీంద్రు
మజ్జనకు నెంచి యైన విద్వజ్జనంబు

గారవించు మత్కృతిఁ జెట్టుపేరు సెప్పఁ
గాయ లమ్ముఁగు ఫ్రోవు నన్నాయ మొప్ప. 27

క. అని నిశ్చయించి గ్రంథర
చనసేఁతకు మును మదీయసత్సంతతిసం
జనితమహాపురుషుల వ
ర్ణన సేసెద వంశవర్ణనం బను పేరన్. 28

ఉ. ధాత్రిని నాల్గుజాతులను దద్దయు బ్రాహ్మణభక్తి గల్గి స
త్క్షత్రియవంశసంభవులసఖ్యము సేకొని మానవంతులై
మిత్రకులప్రమోదము నమిత్రనిషూదనముఁ ఘటించుచుఁ
క్షాత్రసమగ్రవృత్తిఁ దెలగాలుదనర్చుచునుందు రెంతయున్

ఉ. అందుఁ బ్రసిద్ధిఁ గాంచి దొరలఁ బిరుదంబునవన్నె కెక్కి గో
విందపదాబ్జభక్తులయి విశ్రుతవైభవులై దయాళులై
సుందరులై యశోవిభవశోభితులై నిజపౌరుషం బెల
ర్పం దనరారుచుండ్రు త్రిపురానకులోద్భవు లట్టివారిలోన్.

సీ. వంశధారాతీరవసుమత్యనతిదూర
సిద్ధాంతసద్గ్రామసీమవాసి
ద్విగుణీకృతాశేషదిగ్దంతిదంతాచ్ఛ
శోభావిశేషయశోవిలాసి
నానాగ్రహారదానప్రపోషితవిప్ర
కృతమహాశీర్వచస్తతివిభాసి
స్వకృతోజ్జ్వలతటాకసరసవాఃపానసం
తుష్టపాంథాళిసంస్తుతివికాసి

తే. తీవ్రవాక్కంటకోగ్రవిద్విడ్లతాసి
వాసి కెక్కెను ద్రిపురానవంశమూల
పూరుషుఁడు సర్వలోకసంపూజితుండు
మహితరాఘవదాసనామకవిభుండు. 31

చ. అతని నుతింపఁగా నగునె యాతని నాతఁడ పోలుఁగాక యూ

ర్జితవిభవంబునన్ గుణగరిష్ఠత ధైర్యసమగ్రవృత్తి న
ప్రతిమదయార్ద్రచిత్తత నరాతినిరాకృతి భూరిదానశీ
లత నతిలోకశూరతను లాలితరూపవిలాససంపదన్. 32

శా. ఆలోకోత్తరునగ్రసూనుఁడు సముద్యత్పాండుకీర్తిప్రభా
జాలక్షాళితదిక్తటుండు దనరెన్ సమ్యగ్దయాపూర్ణదృ
గ్గోళుం డార్యుఁడు దానకర్ణుఁడు లసద్గోపాలదాసాఖ్యుఁ డా
భీలారాతిభయంకరుం డుదధిగంభీరుం డుదారుం డిలన్. 33

ఉ. ఆమహనీయుతమ్ముఁడు మహామహుఁ డున్నతుఁ డుల్లసద్యశః
కాముఁడు శూరుఁ డింద్రియవికారవిదూరుఁడు ధైర్యశాలి తే
జోమహిమాతిశాయి పరిశుద్ధచరిత్రకుఁ డొప్పె వేంకట[డై
స్వామిసమాహ్వయుండు బుధవంద్యుఁడు సర్వజనాభినంద్యుఁ

శా. ఆమాన్యాగ్రణికిన్ యవీయసుఁడు మాకాంతాకారుఁ డుద్యద్య
ధాముం డర్థిజనేష్టదాయి భగవద్ధ్యానైకతానుం డరి [శో
స్తోమారణ్యదవానలుండు జనసంస్తుత్యాత్తచారిత్రుఁ డై
రామస్వామ్యభిధానుఁ డొప్పెసఁగె శ్రీరామున్విడంబించుచున్

శా. ఆరాజత్సుగుణాభిరామునసుజుం డవ్యాజసత్యవ్రత
త్వారూఢాత్ముఁడు ధర్మమార్గరతుఁ డుద్యద్ఘోరనిస్సారసం
సారార్ణోధివితీర్ణుఁ డూర్జితయశస్సారుండు ధీరుండు వి [మై.
స్ఫారాంచద్గుణుఁ డప్పయాహ్వుఁ డెసఁగెన్ సర్వోత్తమఖ్యాతి

క. ఆఘనుజఘన్యజుఁడు విగ
తాఘుఁడు రాహుత్తపుంగవాగ్రణి విబుధ
శ్లాఘాపాత్రుఁడు గుణజిత
రాఘవరాముఁడు ప్రకాశరాయఁడు వెలసెన్. 37

ఉ. ఆమహితాత్ములందు విబుధాగ్రణి నాఁ దనరారు వేంకట
స్వామిమహాతపఃఫలము సాధ్వి యనం జనుచిట్టమాంబబ
ల్నోములపంట యర్థిసుమనోధరణీజము భూరిసద్గుణా
రామము తమ్మయాఖ్యుఁడు విరాజిలె భూజనగీయమానుఁ డై.

చ. అతనినిసర్గసద్గుణములెంతుఁ బదాఱవపాలు సెప్పఁ బం
డితులక కాదు నాఁగఁ జనునే ననుబోఁటికి నైన నాదుదు
ష్కృతములు వ్రావఁ బుట్టుకకృతకృత్యత నొందఁగ నేర్చుభంగిన
య్యతులగుణాంబురాశిని మహాకవిశేఖరు సన్నుతించెదన్.

చ. పటుతరతత్త్వవేది హరిభక్తుఁడు సద్గుణరాశి కీర్తిలం
పటమతి తిమ్మరాజకులమాన్యుఁడు కౌశికగోత్రజుండు వేం
కటశివరాయనామకుఁ డకల్మషుఁ డెవ్వని ప్రాణమిత్రము
త్కటయశుఁడాతఁడొప్పెసఁగెదమ్మయభక్తజనాగ్రగణ్యుఁడై

సీ. తనప్రతాపానలంబిన దీప్తిపై నొడ్డి
యగులకు దుర్నిరీక్ష్యంబు గాఁగఁ
దనయశోలత హరిద్ఘనకుడ్యములఁ బ్రాఁకి
వేల్పుమ్రానికి వన్నె వెట్టి నిగుడఁ
దనసచ్చరిత్ర మాటవరేంద్రులను మీఱి
మునుల కైనను దిన్నఁదనముఁ గఱపఁ
దనచేయి చేయి సాఁచినయర్థి నర్థి వే
ఱొకనికై చే సాఁపకుండఁ జేయ

తే. ఘనత వహియించె సర్వదిక్కందరాంత
రాగతాశేషవిద్వన్మృగాధినాథ
బృందతుందిలమందిరాళిందుఁ డగుచు
నర్యమప్రభుఁ డాతమ్మయప్రభుండు. 41

ఉ. భాగవతోత్తముం డనఁగఁ బ్రస్తుతి కెక్కెఁ జతుర్వారిద్దరీ
భాగవదాతకీర్తియయి భాసిలె శక్తికథాసుధాఢ్య మా
భాగవతంబుఁ దాఁ దెలుఁగుబాస రచించెఁ దగంగ నమ్మహా
భాగవరేణ్యు నెన్నఁగను పన్నగనాథున కైన శక్యమే. 42

ఉ. కారణజన్ముఁ డూర్జితుఁ డకల్మషుఁ డాశ్రితపక్షపాతి సం
సారవికారదూరుఁడు యశఃపరతంత్రమనస్కుఁ డంచితా
కారుఁడు జాహ్నవీజలవిగాహనపావితసర్వగాత్రుఁడౌ

ప్పారెను దమ్మయయాఖ్యుఁడు గయాకృతకర్మపిత్రృణముక్తుఁడై.

తే. సిరియు విద్యయు రూపంబు దొరతనంబు
జవ్వనంబు గల్గియును స్వచ్ఛందుఁ డయ్యుఁ
బరమభాగవతుం డనం బరఁగె ధరణి
మనుజమాత్రుండె తలఁపఁ దమ్మయవిభుఁడు. 44

ఆ. అరయ లాఁతికవులయట్టిఁడే తమ్మయ
ప్రతనకవికృతప్రబంధసరణి
గడియలోన నొక్కకావ్యంబు రచియించు
భూరితరకవిత్వధార గలఁడు. 45

క. “శ్రీరంగ రంగ రంగప
తే రాజీవాక్ష” యని ప్రతిక్షణమును ల
క్ష్మీరమణుఁ దలఁచుతమ్మయ
నారయఁ బ్రహ్లాదుఁ బోల్చుటర్హము కాదే. 46

క. నిహాగ్రము గోసినఁ దమ్మయ
యాగ్రహమునఁ బగఱఁ బాతునతలంబున సా
నుగ్రహుఁడ డైన శ్రితుల స
మగ్రకృపన్ మిన్నుముట్టునట్లుగఁ జేయున్. 47

ఉ. పుట్టిననాఁటఁగోలెఁ జెడుపోకలఁ బోవుట లేదు విద్యకుం
బుట్టినయిల్లు లీలలను బొంకి యెఱుంగఁడు మేలిజాళువా
పుట్టము దాల్పు నిల్పు సతము న్మదిఁదమ్మయ యిట్టియాతనిం
బట్టిగఁ గన్నదంపతులభాగ్యము వర్ణన సేయ శక్యమే. 48

చ. జనకుఁడు నా కటంచు నుతిసల్పితి నిట్లని యెంచుత్రోవకుం
జనకుఁడు సూరులింతయు నిజంబపొగడ్తలు గావు ధాత్రినా
జనకుఁడు నాఁగఁ బేర్వడినసజ్జనుఁ డాతఁడు కేవలంబు రా
జనకుఁడు రాజమౌళి యన నెఁగదతమ్మయ శ్రీవిభూతిమై 49

శా. నానాసద్గుణరత్నపేటి యనఘున్నారాయణాంబా హరి
ధ్యానాధీనమనస్కుఁడై పరఁగుముత్యాలాన్వయాబ్ధీందు ల

క్ష్మీనారాయణుపుత్త్రిఁ బత్నిగ వరించెం దమ్మయామాఖ్యుండుల
క్ష్మీనారాయణు లౌర వీ రని జనుల్ కీర్తింప నత్యున్నతిన్.

చ. బహుళతరజన్మపుణ్యపరిపాకసమగ్రతకల్మి నమ్మహా
మహులకుఁ బుత్త్రకుండయితి మజ్జననంబు ఫలింప శ్రీరఘూ
ద్వహకరుణాప్రరూఢకవితాప్రవణత్వము భక్తియుక్తి న
మ్మహితనయాధినేతకు సమర్పణ సేసెద నట్లు గావునన్. 51

షష్ఠ్యంతములు.

క. వందారుభక్తజనతా
మందారున కమలపదకమలతలవినమ
ద్బృందారకునకు ననఘున
కుం దారకునకు నతాఘకుట్టాకునకున్. 52

క. త్వాంతాహంతాభేదని
హంతకు బ్రహ్మాండరథనియంతకును దశా
శాంతాక్రాంతాచ్ఛయశః
కాంతునకుం ధరణికన్యకాకాంతునకున్. 53

క. బ్రహ్మానందమయునకుం
బ్రహ్మాదిసుపర్వసేవ్యపదునకును గృ
బ్రహ్మణ్యావనపరునకు
బ్రహ్మణ్యున కాత్మభక్తపరతంత్రునకున్. 54

క. కుంఠితసురపుష్కరదళ
కంఠానేకపకరోటికావిసరసము
ల్లుంఠనకేళీదారుణ
కంఠీరవనఖదమోఘఖరవిశిఖునకున్. 55

క. నామావశేషితాశే
షామరశత్రునకు నింద్రియాతీతునకుం
గామాహితసం
క్షేమంకరనామునకును శ్రీరామునకున్. 56

క. విన్నపము సేయుగతి హృ
త్సన్నిధి నద్దేవు నిలిపి సమ్యగ్భక్తిం
జెన్నగుతత్కావ్యార్థం
బు న్నేఁ గంధాదిపద్యముల రచియింతున్ 57

కథాప్రారంభము.

క. శ్రీసీతాకుచకుంకుమ
వాసితవక్షఃకవాట వల్గులలాటా
దాసేరకజనతాఘుని
రాసకనామా గుణాభిరామా రామా. 58

ఆ. అవధరింపు త్వత్పదాంబుజార్పితముగ
నారచించునలకుమారసంభ
వాఖ్యకావ్యరత్నము దలరాసక
థాక్రమంబు జితసుధాక్రమంబు. 59

క. కలఁడు హిమాలయుఁ డనుగ
ట్టులరాయఁడు దేవతాత్ముఁడు కుబేరదిశా
స్థలిఁ బూర్వాపరసాగర
తలము లొరసి ధరణిమానదండముపోల్కిన్. 60

క. మల లెల్ల వాని దూడఁగఁ
జలిపి ప్రదోగ్ధ యయి గోహచణమేరువు రా
జిల నిలఁ బృథుదర్శిత ను
జ్జ్వలరత్నమహౌషధిప్రచయముం బిదికెన్. 61

క. బహురత్నజనకుఁ డగుట
న్మహీధరవరుసొబగు మంచు మాపఁగ లేదీ
మ్మహిఁ గుణతతి నొకదోసము
మిహికాంశునిఘృణుల గుఱుతు మెయిని నణంగున్. 62

తే. అప్సరోవిభ్రమాలంక్రియావిధాత్రి
ఘనశకలసంక్రమితరక్తకాంతి యైన

ధాతుమత్త నకాలసంధ్యవలె నాత్మ
శిఖరములఁ దాల్చు నాగిరిశేఖరుండు. 63

క. మొలవఱకుఁ దిరుగుజలధర
ములక్రీనెత్తములనీడఁ బొంది మనుచు వా
నల నొచ్చి యెండ గలతద
చలనాయకుశిఖరములకుఁ జనుదురు సిద్ధుల్. 64

క. నెఱమంచున నెత్తురు రూ
పఱ నేనికతిండ్లయడుగు లరయ వలను గా
కెఱుకుగమి యమ్మలం దెరు
వెఱుఁగుగ్ గోళులను జాఱు నెలముత్తెములన్. 65

క. కరిబిందుశోణముల ధా
తురసవిలిఖితాక్షరములఁ దొలఁకుచు బుజప
త్త్రినారలు విద్యాధర
తరుణులస్మరలేఖము లయి తద్గిరిఁ బొలుచున్. 66

క. ఉరుకందరముఖపవన
స్ఫురణాం గీచకబిలములఁ బూరించుచు న
గ్గిరి హెచ్చుగఁ బాడెడుకి
న్నరులకు వాంశికతఁ బూను నా నొప్పారున్. 67

క. కటములతీఁటలు వ్రా గజ
ఘటలు సరళతరుల రాయఁగాఁ బొల్పడి త
త్స్ఫుటతరపరిమళభర మ
చ్చోటున న్నెత్తములఁ జేయు సురభిళములు గాన్. 68

క. రేల నికుంజములను రతి
మేళనమునఁ జొక్కు భిల్లమిథునములకుఁ ద
చ్ఛైలరుచిరౌషధీతతి
తైలము గోరని ప్రదీపతతి యై పొలుచున్. 69

క. సరణి ఘనీభూతతుహిన

ధరమున మడమలను వ్రేళ్ల । బాధ వడియు దు
ర్భరకటికుచార్తిమై న
గ్గిరిఁ ద్వరఁ బోవంగ లేరు । కిన్నరతరుణుల్. 70

క. హరివలన దివాభీతము
కరణి గవులఁ జొచ్చుతమముఁ । గాచు నతం డా
శరణాగతుఁ డన దైనను
దొరల కెనఁగు మమత కోవి।దునియందు బలెన్. 71

క. వాలవ్యజనావళి జ్యో
త్స్నాలలిత నిత స్తతః ప్ర।చలవాలతతా
భాళిని సార్థకముగఁ ద
చ్ఛైలేశపదమును జేయుఁ । జమరీమృగముల్. 72

క. చేలములు గొనఁగ సిగ్గునఁ
దూలి నిలుచు కింపురుషవ।ధూసమితికిఁ ద
చ్ఛైలదరీగృహముఖముల
వ్రేలెడుజలదములు తెరల।విధమున నొప్పున్. 73

క. తెమ్మెర గాంగాపఃకణయు
తమ్మయి సారెకును దేవ।దారుతరువులన్
నెమ్మిలపురులఁ గదల్చుచు
నమ్మల బోయలకు వేఁట।యలపు దలంగున్. 74

క. మిత్రుఁడు క్రిందం దిరుగుచుఁ
జిత్రశిఖండ్యపచితావ।శిష్టము లగుత
ద్గోత్రాగ్రసరోరుహాశత.
పత్త్రంబుల నూర్ధ్వముఖగ।భస్తులఁ దెలుపున్. 75

క. సవనాంగప్రభవత్వము
భువిఁ దాల్పఁగఁ దగినబలముఁ । బొడగని విధి తా
నవనీభృన్నాథత్వము
నవభాగము నొసఁగె నార।సాధరపతికిన్. 76

ఉ. అట్టిగుణోన్నతుండు కనకాద్రిసఖుండు క్షితిజ్ఞుఁ డైనయా
గట్టులఱేఁడు మేన యనుకన్యను బైతృకమానసంబునం
బుట్టినదాని మానిజనపూజనయోగ్యను స్వానురూపఁ జే
పట్టెను శాస్త్రసమ్మతి నపారకులప్రతిపాదనార్థి యై. 77

క. తరువాతఁ గొన్నినాళులు
స్వరూపయోగ్యరతి వారు సలుపంగ మనో
హరయౌవనాఢ్య యైనశి
ఖరిశేఖరుధర్మపత్ని గర్భము దాల్చెన్. 78

క. మేన పదంపడి కనియెన్
మైనాకుని గఱుల నఱకు మఘవుఁడు కుపితుం
డైనను బవిసోఁ కెఱుఁగని
వాని నహీనవధూపభోగ్యు వననిధిమిత్త్రున్. 79

క. పిదప సతీమణి సతి ద
క్షుదుహిత హరుపూర్వపత్ని జనకావజ్ఞా
స్పద మై మై యోగంబున
వదలి నురలఁ బుట్ట శైలవధువుం బొందెన్. 80

క. నగపతివలన నియమవతి
యగు మేనక యందుఁ బుట్టె నాసతి యుత్సా
హగుణంబుచేతఁ గడు లె
స్సగఁ జేతం జెడనినీతిసంపద వోలెన్. 81

క. నలుదెసలు తెల్విఁ జెందె న
కలుషం బై వీచె గాలి కంబు లులిసెఁ బూ
వులజడి గురిసెఁ జరాచర
ములు దనిసెం దత్సతీసముద్భవవేళన్. 82

క. ద్యోతితరుఙ్మండల యగు
నాతనుభవచేతఁ దల్లి యలరె న్నవజీ
మూతాగ్రాపోద్గతమణి

చేత విదూరాద్రిపుడమి చేసియకరణిన్. 83

క. ఉదయాద్రిగ దినదినమును
బొదలుచు శిశు వజ్జ రేఖ పొల్పున శోభా
స్పదము లగునంగములఁ గా
ముకీమయకళాంతరముల పోలికఁ బెంచెన్. 84

ఉ. బందుగు లెల్ల మోదమున బంధుజనప్రియ కాయహార్యరా
ణ్ణందనకున్ నిజాభిజన నామము పార్వతి యంచు నుంచి రం
తం దప మాచరింపఁ జనఁ దల్లి యుమా యని యడ్డగింప న
య్యిందునిభాస్యకష్టులభి యించెసమంచదుమా సమాఖ్యయున్.

ఆ. పుత్త్రివంతుఁ డైన గోత్రేశుచూడ్కు ల
బ్బాలయందుఁ దృప్తిఁ బడయ వయ్యె
విరులు చాలఁ గల్గు విరితతి తేంట్లకుఁ
జూతతతినిఁ గరము ప్రీతి గాదె. 86

క. ద్యుతిమత్కులన్ దీపము
గతిని వియద్గంగ నింగి కరణిం బ్రతిసం
స్కృతవాక్కునఁ గృతిబలె గిరి
పతి సుతచే భూషితుండు పావనుఁ డయ్యెన్. 87

ఆ. చిన్ననాఁడు తనదు చెలులమధ్యము నొంది
కేళిరసము నెల్లఁ గ్రోలుమాడ్కి
గాంగపులినవేదికలఁ గందుకములఁ బు
త్త్రికల నాలతాంగి క్రీడ సలిపె. 88

ఆ. శరదృతువున గంగఁ జక్రాంగములు వ్రాలె
క్షప మహౌషధిని స్వకాంతులు బలె
స్థిరతనోపదేశ గిరిసుత నుపదేశ
వేళఁ బూర్వజన్మవిద్య లొందె. 89

ఉ. మవ్వపుమేనుదీపకు నమర్చనిమంజులభూషణంబు బ
ల్గొవ్విరి తేనెకన్యమగు క్రొవ్వుడఁగూర్చెడుసాధనంబుఁ గ్రొం

బువ్వులవింటివానికిని బువ్వగణేతరమార్గణంబు నా
జవ్వన ముంకురించెను రసాధరరాట్తనయాతనూలతన్. 90

తే. తరణికరముల విరియు నెత్తమ్మికరణిఁ
దూలికం బొల్చుచిత్రంబు వోలె నూత్న
యౌవనంబున నేర్పడి యంద మొందె
సుదతి మైదీవ చతురస్రశోభి యగుచు. 91

క. అరుణోచ్చైరంగుష్ఠన
ఖరరుచి నడలందు శోణకాంతు లొలుకు నాఁ
గర మొప్పుతత్పదము లిలఁ
జరియించుస్థలారవిందసంపదఁ గొనియెన్. 92

క. ప్రాంచన్నూపురరవము గ్ర
హించుట ప్రతిగాఁగ నిర్ణయించుకొనినరా
యంచలు నేర్పినొకో లీ
లాంచితవిన్యాసగతుల నాజవ్వనికిన్. 93

తే. భద్రవృత్తానుపూర్వత పరిఢవిల్ల
నాతిదీర్ఘంబులై యొప్పు నాతిజంఘ
లబ్జభవుఁడు సృజించి శేషాంగరచన
యందు లావణ్యమునకు సయత్నుఁ డయ్యె. 94

క. కరివరకరవరకదళులు
పరిణాహాన్వితము లయ్యుఁ బైఁ గర్కశముల్
స్థిరశైత్యము లగుటం ద
ద్గిరిజోరులతోడ సాటికిఁ వెలి గాంచెన్. 95

క. ఇందుధరుఁడు మీఁదట న
న్యేందుముఖీదుర్లభాంక మెక్కించుట నా
సుందరినితంబమునచ
క్కందన మెంతయును దెలియఁగా వచ్చుఁ గదా. 96

క. నీవింగడచని నతనా

భీవివరములోనఁ జొచ్చి । బిత్తరితనురో
మావళి దగెఁ గాంచీమ
ధ్యావేశితనీలమణిరు।గంకురముబలెన్. 97

క. తనుమధ్య యైనపార్వతి
తనుతరమధ్యమున వళులు । దనరెన్నవయౌ
వనము మనోజారోహణ
మునకుఁ సమకట్టు।మవ్వపుమ్మెట్టు లనన్. 98

క. ఇతరేతర మొరయుచుఁ బా
ర్వతిపాండురకుచయుగంబు । ప్రబలెఁ దదసిత
ద్యుతిముఖకుచయుగమునడుమ
నతితనుబిసతంతులకు న।నవకాశముగన్. 99

క. విరిపిల్తుం డోడియు శం
కరుగళపాశములఁ జేసెఁ । గావునఁ దద్భూ
ధరజాబాహులు దిరిసెన
విరిమొత్తఁదనంబు దెగడ।వే యూహింపన్. 100

క. ఘనకచకుచబంధురగళ
మునకు లసత్తారహార।ముఖ్యమునకు మం
డనమండనీయభావము
పొనరె మిథఃకాంతిజనన।మునఁ దుల్యం బై. 101

క. సరసిజము నొంది శశిరుచి
సరసిజరిపు నొంది తమ్మి । సౌరు నెఱుఁగ ద
గ్గిరిజమొగము నొంది చపల
సిరి యురుప్రా పొందుప్రీతిఁ । జెంది వెలింగెన్. 102

క. చిగురున విడినఁ విరియుం
బగడముపై నుండెనేని । మౌక్తికమును న
న్నగజయరుణోష్ఠగతరుచి
యగు తెలినగవునకు సాటి । యౌనే మొ కదా. 103

క. ఉమ కలమంజులభాషిణి
యమృతరసం బొలుక మాట ♦ లాడ వితంత్రీ
కముఁ జేసి మీటువీఁశియ
క్రమమునఁ బరపుష్టయును వి♦రసనాద యగున్. 104

క. అనిలచలేందీవరరుచిఁ
గనునుమచకితేక్షణములు ♦ గన మృగములవ
ల్లను సతి పడసెనొ సతివ
ల్లను మృగములు పడసెనో త♦లంబె యెఱుంగన్. 105

క. అంజనశలాక దిద్దుగ
తిం జెలఁగెడునిడుదబొమల♦ తేజముఁ గని యా
క్రొంజిగురులవిలుతుఁడు నిజ
మంజులచాపాభిరూప్య♦మదమును విడిచెన్. 106

క. మనమునఁ దిర్యగ్జాతం
బునకుఁ లజ్జ గలదేని ♦ భూధరజనెఱుల్
గని చమరీమృగసంతతి
తనవాలప్రియత నపుడ ♦ తప్పక విడుచున్. 107

ఉ. వేయును నేల యీసకల♦విశ్వపదార్థములందుఁ గల్గుబల్
సోయగ మొక్కచోటనిడి♦చూడఁగఁగోర్కి గలాఁడు ప్రోలెవా
ణీయువతిప్రియుం డు శశి♦నీరరుహాద్యుపమానవస్తు లా
యాయనుకూలదేశముల♦యందునమర్చిసృజించెనాసతిన్.

క. కామచరుఁడు నారదుఁ డా
భామిని నొకనాఁడు దండ్రి♦పజ్జం గని యీ
రామ గొనుఁ బ్రేమ హరుమై
సామసపత్నీక యనఁగఁ ♦ జను నని పలికెన్. 109

తే. అది మొదలు గాఁగ సుత యావ♦నాఢ్య యైన
నచలపతి పొందఁ డన్యవ♦రాభిలాష
హవ్యమును మంత్రపూతంబు ♦ నగ్ని దక్క

నన్యాతైజసగణ మొంద | నర్హ మగునె. 110

క. గిరిపతి తనసుత నడుగని
హరునిఁ బిలిచి యొసఁగ నోపఁ | డన్యోను ధర స
త్పురుషుం డిష్టార్థంబునుఁ
బరు వేఁడఁడు యాచనావి | ఫలతాభీతిన్. 111

క. తొలిజని దక్షునిగోపము
వలనన్ సతి యొప్పుడు తనువు | వదలె నది మొదల్
లలనాంతరమును గోరఁడు
జలజాహితమాళి ముక్త | సంగుం డగుచున్. 112

తరల. స్వనియతాత్మకుఁడై తపంబును | జల్పనాతఁడుజాహ్నవీ
ఘనరసోక్షితదేవదారుని | కాయమై మృగనాభివా
సనలచే సురభీకృతం బయి | చారుకిన్నరవల్లకీ
నినదమైనహిమాద్రిపై యొక | నెత్తమందు వసింపఁగన్. 113

తే. గణములును భూర్జమృదులవ | ల్కములు గట్టి
వరనమేరుసుమంబుల | శిరముల నిడి
మణిశిల నలంది శైలేయ | మంజులముల
బండఱాల వసించిరి | ప్రమద మెసఁగ. 114

తే. మంచురాలను డొక్కలఁ | జించివైచి
గవయమృగములు భయమునఁ | గనుఁగొనంగ
సింహగర్జనమును విని | చిటిలిపడుచుఁ
గింక మదకలవృషభంబు | అంకెవైచె. 115

క. అంతఁ దపఃఫలదుండు పు
రాంతకుఁడు సమిత్ప్రదీపి | తానలము స్వమూ
ర్త్యంతరము నునిచి యట న
త్యంతనియతి నేమొ కోరి | తప మొనరించెన్. 116

క. సురపూజ్యు ననర్ఘ్యుని నా
హరు నర్ఘ్యాద్యర్చనముల | నర్చించి జగ

త్పరిపూత సఖియుత సుతఁ
బరిచర్యల కొసఁగె నద్రిȣపతి యవ్వేళన్. 117

క. గిరిజాపరిచర్య నియమ
పరిపంథియు నైనఁ బ్రమథȣపతి యియ్యకొనెన్
ధర వికృతిహేతు వున్న నె
వరిమనము చలింప కుండు ȣ వారలె ధీరుల్. 118

మాలిని. విరులు బలికిఁ గోయున్ ȣ వేదికాశుద్ధిఁ జేయున్
వరనియమజలంబుల్ ȣ దర్భలుం దెచ్చి యిచ్చున్
హరముకుటశశిజ్యోȣత్స్నాప్తవిశ్రాంతి యై యా
హరునిఁ బ్రతిదినం బాȣయంబ సేవించుచుండున్. 119

క. ఆసమయంబునఁ దారకు
చే సురనికరంబు బాధఁ ȣ జెంది వగచుచున్
వాసవు ముందఱ నిడి కమ
లాసనుమందిరము సేర ȣ నరిగె నరుగఁగన్. 120

క. పరిహృతముఖరుచు లగుని
ర్జరులకు సాక్షాత్కరించె ȣ జలజజుఁ డచటం
బరిసుప్తనలినలినా
కరములకుఁ బ్రభాతమున విȣకర్తనుఁడుబలెన్. 121

క. ఆయవసరమున స్రష్టకుఁ
దోయజగర్భునకు సర్వȣతోముఖునకు భా
షాయువతిప్రియున కెరఁగి
యాయమరులు పొగడి రిట్టు ȣ లర్థ్యోక్తులతోన్. 122

క. సృష్టికి మును కేవలతో
త్కృష్టుఁడ వై వెలిఁగి పిదపఁ ȣ ద్రిగుణాత్ముఁడ వై
స్రష్టృత్వాదిక మొందిన
స్రష్ట త్రిమూర్తి వగునీకుఁ ȣ బ్రణతిశతంబుల్. 123

క. జలముల నమోఘబీజము

నిలుపఁ జరాచరజగద్వినిర్మాణము రా
జిలె దానఁ గాన నాజగ
ములకుం బ్రభువుఁ డని నిన్నుఁ బొగడుదు రభవా. 124

క. ఒకరుఁడవ నీ వవస్థా
త్రికమున నాత్మీయమహిమఁ బ్రేరేపుచు సృ
ష్టికి స్థితికిని లయమునకును
నకలంకా కారణత్వ మందితి గాదే. 125

క. అనఘా మిథునములు సిసృ
క్షను ద్వివిధతనుఁ డగునీదు గాత్రాంశంబుల్
జననం బందినసృష్టికి
జననీజనకు లవియ యని చాటుదురు బుధుల్. 126

క. చిద్రూప స్వమాన ప్రో
ద్యద్రాత్రిందివుఁడ వగుచు నలరారెదునీ
నిద్రావబోధముల చూ
భద్రాత్మక భూతములకుఁ బ్రళయోదయముల్. 127

క. జగతీయోని వయోనివి
జగదాది వనాది వీవ జగదీశుఁడవుగా
నిగమనుత నిరీశుఁడవును
నగుదువు జగదంతుఁడవు నిరంతకుఁడవునున్. 128

క. నీచేతన నినుఁ దెలియుదు
నీచేతన తగ సృజింతు నిన్నుం గృతి వౌ
నీచేతన నీయందున
నోచతురాస్య యణంగి యుందువు గాదే. 129

క. నీవే స్థూలము సూక్ష్మము
నీవే కఠినంబు ద్రవము నీవ లఘుగురుల్
నీవే కారణకార్యము
లీ వెందుదు భూతులను యథేచ్ఛాగతులన్. 130

క. వేని కుపక్రమము ప్రణవ
మా నుచ్చారణము త్రిస్వరాఢ్యము కర్మం
బౌ నిజ్య యత్ఫలము దివి
యౌ నట్టిశ్రుతులకుఁ బ్రభవుఁ డైతీవ కదా. 131

క. నినుఁ బురుషార్థప్రవివ
ర్తినిఁ బ్రకృతినిఁగా బుధులు నుతింతురు దానిం
గనుసాక్షియుఁ గూటస్థుం
డును నగుపురుషునిఁగ నిన్నె నుతియింతు రజా. 132

క. పితలకుఁ బిత నీవే దే
వతలకు దేవతవు నీవె వాణీరమణీ
పతి వీవ పరాత్పరుఁడవు
శతధృతులకు నెల్లరకును శతధృతి వీవే. 133

క. నీవే హోతవు హవ్యం
బీవే భోజ్యంబు భోక్త వీవ ధ్రువుఁడ వౌ
దీవే వేత్తవు వేద్యం
బీవే ధ్యేయంబు ధ్యాత వీశ నిజముగన్. 134

క. అని మంజులసత్యోక్తుల
ననిమిషులు నుతింప మెచ్చి యంబుజభవుఁ డి
ట్లనియెఁ సురగణములతో
ననుగ్రహప్రవణుఁ డగుచు నాసమయమునన్. 135

క. ప్రతనకవి యైనయాగీ
ష్పతి నాలుగునెమ్మొగములఁ బలుకుట శబ్ద
ప్రతతిప్రవృత్తిచతుష్టయి
కృతార్థతాకలన మొంది యెంతయు నొప్పెన్. 136

క. భూరిబలులార యుగభుజు
లార ప్రభావముల మీఱ లాత్మీయాధీ
కారములనుండి యొక్కటఁ

చేరఁగ వచ్చితిరి మీకు క్షేమంబ కదా. 137

క. ఏ మిది సురలారా మీ
మోములు రుచిఁ దొంటిభంగిఁ బొల్పెసఁగ వధో
హైమస్తోమసమావృత
కోమలరుచి యైనరిక్కగుమిచందమునన్. 138

క. కాంతులు దఱుఁగుటను శచీ
కాంతునికులిశంబు శక్రకార్ముకశోభా
వంతంబు గాక కరము ప్ర
శాంతం బయి కుంఠితాశ్రిచాడ్పున నుండెన్. 139

క. అరిదుర్వారం బగునీ
వరుణునికరపాశ మకట వరమంత్రసము
చ్చరణావృతబలకాకో
దరరాజము వ్రాలె మిగుల దైన్యము నొందెన్. 140

క. అపవిద్ధగద మగుటచే
నపవృతశాఖ మగుభూరుహముఁ బోలి ధనా
ధిపుబాహువు వ్యాచ్ఛల్య
స్వపరాభవమును వచించుచందం బొందెన్. 141

క. దండమున విగతరుచిని య
ముం డిల వ్రాయుచుఁ గటా యమోఘ మయినయీ
దండమును జులుకఁ జేయుచు
నుండెం బోలు పేది యాఱునుల్ముకముబలెన్. 142

క. ఈపన్నిద్ధఅరుణులు ప్ర
తాపం బేదుటను జల్లఁదనముం గని చి
త్రాపాదితమూర్తులుబలెఁ
జూపులకున్ విషయ మైరి చోద్య మి దేమో. 143

క. చెల్లరె వాతంబులవే
గోల్లుంఠన మాకులత సమూహ్యం బయ్యెన్

నీళ్లుం బ్రతికూలగతిని
వెల్లువరోధంబు దెలియు । విధమున మఱియున్. 144

క. వినమితజటావిలంబితు
హీనకరలేఖంబు లగుచు । నేకాదశరు
ద్రనిభృతశీర్షంబులు గడు
వినిహతహుంకారములను । విశదపఱచెడున్. 145

క. ఏ మిది మును లబ్ధసితు
లౌషూరలు త్రోపు నడిరె । యభియాతులచే
సామాన్యశాస్త్రసంతతి
భూమిపయి విశేషశాస్త్ర । ములచేఁ బోలెన్. 146

క. ఓవత్సలార తెల్పెఁడు
నావలనన్ మీకుఁ బ్రార్థ । నావిషయము లో
కావళిసర్గము నాయం
దావల సంరక్ష యుష్మ । దాయత్త కదా. 147

క. అన విని మందప్రవిచల
దనిలోద్ధుతనీరజాక । రాభాజిల్లో
చననలినసహస్రంబునఁ
దనగురు గురు సురవరుఁడు । దాఁ బురికొలిపెన్. 148

క. పురికొలుప సహస్రదృగం
తరము ద్వినేత్రంబు వజ్రి । నయనం బగునా
గురుఁడు నిబద్ధాంజలి యై
పరమేష్ఠినిఁ జూచ్చి యిట్లు । పలికె వినీతిన్. 149

క. భగవంతుఁడ నీ వనుక్రియఁ
బగఱవలన నాత్మపదము । భంగము నొందెం
జగదంతర్యామివి నీ
కగపడనిది ముజ్జగంబు । లం దెద్ది విభూ. 150

క. భవదీయవరోద్ధతుఁ డై

భువనంబుల ధూమకేతుఁ బోలెఁ జెఱుప ను
ద్భవ మొందెఁ దారకుం డను
దివిజారి యొకండు ప్రబలతేజస్స్ఫూర్తిన్. 151

క. కమలాప్తుఁ డాతపం బా
యమరాహితువీటఁ గాయఁ డతిభీతినిఁ ద
త్కమనీయదీర్ఘికానవ
కమలంబులు విరియుకంపె గాటము గాఁగన్. 152

క. కలువలదొర నిరతము నా
బలురక్కసిసేవ సలుపు భయ మందుచు జ
క్కులదొర చెలికానితలను
గలయొకళ దక్కఁ దక్కుఁ గళలన్నిటిచేన్. 153

క. తెమ్మెరకు సుమస్తేయభ
యమ్మున నుపవనముచక్కి నరుగక తత్పా
ర్శ్వమ్మున వ్యజనానిల తు
ల్యమ్ముగఁ బ్రసరించుచుండు నతిసుఖదం బై. 154

క. ఋతువులు క్రమ మెడలి సుమ
వ్రతతీసంభారతత్పరత్వంబున సం
తతమును వనపాలురవలె
దితిజేంద్రునివనము నరసి తిరుగుచునుండున్. 155

క. వననిధి వానికిఁ గానుక
కనుగుణ మగురత్ననిచయ మంభోమధ్యం
బున నెప్పుడు పరిపాకం
బును గనునో యనుచు నెదుకు పొడగనుచుండున్. 156

క. జ్వాలదర్చిర్మణియుతకుం
డలిరాజప్రముఖఫణు లనారతమును రా
త్రుల నాఱనిదీపంబుల
వలె సేవింపుదురు దానవకులాధ్యక్షున్. 157

క. సురపతియును దదనుగ్రహ
గరిమ నపేక్షించి కల్ప§కక్షోణిరుహా
భరణంబులఁ బంపుచు నా
సురశాత్రవుకరుణ కెదురు § చూచుచునుండున్. 158

క. అనయము నీగతి సేవలు
గొనియు జగత్త్రితయబాధ§కుం డయ్యె నిహిం
సనమునకు యోగ్యుఁ డగుదు
ర్జనుఁ డుపకారమున నెందుఁ § జక్కంబడునే. 159

క. సురతరుణీకరకమలస
కరుణాలూనకిసలయములు § గలనందనభూ
మిరుహంబు లాదివౌకః
పరుచేతఁ ఛిన్నము లయి § పతితము లయ్యెన్. 160

క. ఆరక్షఃకులనాథుఁడు
గూరుకఁ జెఱఁ బడినవేల్పుఁ§గొమ్మలు గడుఁ గ
న్నీ రొలుక విసరుదురు ని
ట్టూరుపు సరిగాలి వాలయ § నొగి వీవనలన్. 161

క. హరిహరిఖురభిన్నామర
గిరిశృంగము తెల్లఁ బెల్ల§గించి బలిమి నా
సురరిపుఁ డాక్రీడోర్వీ
ధరవరములు గాఁగఁ జేసెఁ § దనవేశ్మములన్. 162

క. సురశైవలినిని దిఙ్మద
కరివరదానావిలోద§కముల మిగిలెఁ గ
ర్బురసరసిజముల నాతుం
టరి నిజదీర్ఘికలయందు § నాటుటవలనన్. 163

క. స్వర్గస్థులు జగములు గన
నిర్గమనము వొందరైరి § నిర్భయముగఁ ద
న్మార్గంబు విమానములకు

దుర్గమ మై యుంట నసురదోర్గర్వమునన్. 164

క. వితతాధ్వరముల దీక్షితు
లతిభక్తి నొసంగుహవ్య మాదుర్మతి యా
దితిసుతుఁ డందఱముఁ గనఁగ
హుతభుఙ్ముఖమున గ్రహించుచుండు బలిమిమై. 165

క. అచ్చపుమేనిం బొల్చువి
యచ్చరపతి చిరయశంబ యన నొప్పెడు న
య్యచ్చపుహరివర ముచ్చై
రుచ్చైశ్శ్రవము గొనె నసుర యుక్కు మెఱయఁగన్. 166

క. ఖలుఁ డగువానియెడఁ బా
చలుపును పాయంబు లెల్ల సాగక యుండెఁ
బలవన్మహౌషధావలి
యలముకొనినసన్నిపాతమందునఁ బోలెన్. 167

క. హరిచక్రమువలన జయము
దొరకొను మా కనుచు నుండ దురమున నదియుం
గరము పొలు పేది యసురం
బొరిగొన లేక తదురోవిభూషణ మయ్యెన్. 168

క. జితగిరిభిద్గజతద్గజ
పతు లతిమదకలితవృత్తి భయము దొఱఁగి యా
దృతిఁ బుష్కలాదిజలము
క్తతి వప్రక్రీడనంబు గఱచుచు నుండున్. 169

క. కావున దేవా మేము చ
మూవిభుఁ గోరెదము దనుజుఁ బొరిగొన భవముం
బో విడువ ముముక్షులు క
ర్మావలి ఛేదించుధర్మ మర్థించు క్రియన్. 170

క. సురసేనారక్షకు నే
వరూథినీనాథుఁ గొని దివస్పతి బందీ

తరుణింబలె రిపులగెలుపు
సిరి మరలుచునట్టివాని § సృజియింపు మజా. 171

క. అని వాచస్పతి వలుకఁగ
వనజభవుఁడు వలికె మధుర§వాక్కును సుభగ
త్వనిరూఢి నది జయించెఁ
స్తనితరవానంతరము యొ§సంగెడువృష్టిన్. 172

క. ఇంచుక కాలంబు ప్రతీ
క్షించిన మీకోర్కి సిద్ధిఁ § జెందెడు నే మీ
యెంచిన సేనానిని సృ
ష్టించుటకుం జాలఁ బురుష§శేఖరులారా. 173

క. నావలనఁ బెరుఁగుదైత్యుఁడు
నావలనన క్షయము గనుట § న్యాయమె తొలుతం
దా వృద్ధి సేసి దానిని
హా విషతరు వైనఁ ద్రుంప § నగునే పిదపన్. 174

క. మును దేవావధ్యత్వం
బునె కోరెను నన్ను సురరి§పుం డొసఁగితి లో
కనివహములఁ గాల్చెడున
ద్దనుజేంద్రునితపము శాంత§తం బొందంగన్. 175

క. సమరనిపుణు నద్దనుజుని
సమరావనిఁ దాఁకి దురము § సలుపఁగ సాక్షా
త్ప్రమథాధినాథ రేతోం
శము దక్కఁగ మఱి యొకండు § శక్తుం డగునే. 176

క. ఆతఁడు పరమాత్మ తమో
తీతం బగు తేజ మతని§దివ్యతరమహ
త్త్వాతిశయంబును దెలియఁగ
నాతరమా మఱియుఁ బద్మ§నాభునితరమా. 177

క. మీరు సమాధి స్తిమితం

బౌరుద్రుమనము నినుము నరయస్కాంతశిలం
జేరఁ దిగుచుగతి హైమవ
తీరూపము చేత వేగ దివియఁ గడఁగుఁడీ. 178

క. హరువీర్యము నావీర్యము
భరియింపఁగ శక్య మగునె పార్వతికినిఁ ద
త్పురనాశనునిజమూర్త్యం
తర మగుజలమునకుఁ దక్కఁ దక్కెవ్వరికిన్. 179

క. ఆసర్వజ్ఞునికొమరుఁడు
మీ సైనాపత్య మొంది మించి సకలబం
దీసురరమణీమణివే
ణీసంఘముచిక్కు విప్పు నిజదోశ్శక్తిన్. 180

క. అని యిట్లు దేవతలతో
నని యంతర్ధాన మొందె నబ్జభవుఁడు నె
మ్మనములఁ గార్యాకూతము
బెనఁగొనఁగాఁ జనియె దివిజబృందము దివికిన్. 181

క. అనలాక్షు మోహపెట్టెడు
పనికి మదను నిశ్చయించి బలరిపుఁ డంతన్
వనజాస్త్రునిఁ గార్యోత్కం
ఠను ద్విగుణితరంహ మగుమనంబునఁ దలఁచెన్. 182

మాలిని. కనదళిచికురభ్రూకాంతిశృంగంబు విల్ ర
త్యనుపమవలయతుత్యంకగ్రీవం దగంగా
ననుచరమధుహస్తన్యస్తచూతాస్త్రుఁడై వ
జ్రిని మదనుఁడు సేరెం జేతులన్ మోడ్చి యంతన్. 183

క. సురల విడిచి సురపతి య
మ్మరునిన్ వేగనుల నొక్కమాత్రన చూచెన్
దొరలగురుత్వము కార్యా
తురతం దఱచుగ నిజాశ్రితులమెడఁ దొలఁగున్. 184

క. భావజ గద్దియదరిగా
నీవలన వసింపు మను శచీశు ప్రసాదం
బావలర్థా జౌదల సం
భావించి రహస్యముగను బలుకం దొడఁగెన్. 185

క. పురుషవిశేషజ్ఞ పనుపు
కరణీయం బెద్ది నీకుఁ గలదో త్వత్సం
స్మరణోత్పన్నానుగ్రహ
గరిమ న్నీయాజ్ఞఁ బెనుపఁగా నే వలతున్. 186

క. ఎవఁడు భవత్పద మొందఁగ
నవిరళతప మాచరించి యహిత మొనర్చెన్
దివిజేశా తెలుపుము వే
గ వశుం డగు నాసబాణకార్ముకమునకున్. 187

క. పరిపంథి యెవ్వఁడో కో సం
సరణత్రాసమున ముక్తిసరణిం బొందెన్
దరుణీకటాక్షశృంఖల
చిరబద్ధు నొనర్తు వానిఁ జెప్పు మహేంద్రా. 188

క. కవిశిక్షితనీతి యయిన
భవదరిధర్మార్థములను బాధింతు శచీ
ధవ రాగచరుఁ బనిచి వె
ల్లువ పెల్లై యేటియొడ్లు లోఁ గొనుమాడ్కిన్. 189

క. పతిదేవత యెవతె మనో
జ్ఞత నీమదిఁ జొచ్చెఁ జెపుము స్వఃపురనాథా
గతలజ్జ యగుచుఁ దా ని
న్నతిరయమునఁ గౌఁగిలించుకొనట్టు లొనర్తున్. 190

క. సురతాపరాధమున నిజ
చరణానతు నిన్నుఁ ద్రోచుకొసతినిఁ దెలుపు మా
తరుణి సనుతాపమునఁ జె

చ్చెరఁ జివురులసెజ్జఁ బొరలఁ । జేసెదఁ గమనా. 191

క. స్వారు వేల ప్రసన్నుఁ డగుము
హరిహయ నీ తెల్పుదనుజు । నలవు దలఁగి నా
శరములను గ్రుధాస్ఫురితా
ధర లగు స్త్రీలకును బాద । దాసు నొనర్తున్. 192

క. సుమశరుఁడ నయ్యు మధుసా
యమ కొని నీకృపఁ బినాకి । యైనహరుని ధై
ర్యముఁ దలఁగెద ననఁ దక్కొరు
లమరేశా ధన్వు లెవ్వ । రరయఁగ నాకున్. 193

క. అన వజ్రి యూరుగతపద
మును బదపీఠమున డించి । మును తాను దలం
చినపనిన స్వసామర్థ్యం
బును వెల్లడి చేయురతివి । భున కిట్లనియెన్. 194

తే. సఖుఁడ యింతయుఁ జేయంగఁ । జాలు దీవు
పవియు నీవును నాదగు । ప్రహరణములు
పవి తపోబలవంతుల । పజ్జఁ బోదు
సాధకుండవు సర్వత । శ్చారి వీవు. 195

క. నీశక్తిఁ దెలిసి మత్సం
కాశుని నినుఁ బనుతు గొప్ప । కార్యంబున ల
క్ష్మీశుఁడు భూధరతఁ గని క
దా శేషునిమై ధరింప । నాదేశించెన్. 196

చ. గిరిశునిపై శరాళిఁ బరఁ । గింపఁగఁ జాలుదు నంటి గాన మా
గురుతరకార్య మీవు సఫు । కూర్పఁగ సమ్మతి నొందినట్లయీ
యరిజనదుఃఖితాత్ము లగు । యజ్ఞభుజుల్ నినుఁ గోరుచెల్ల నా
పురహరుమీఁదనీవుశర । ముల్ ఎఱఁగించుటయుంచు నెంచుమా.

ఉ. ఈసురసంఘ మెల్లను మ । హేశ్వరవీర్యజు సైన్యనాథుఁగాఁ
జేసి నిజద్విషజ్జయము । సేకొనఁ గోరుచునుండె మంత్రవి

న్యాసము చేత నొప్పి పర। మాత్మవినిశ్చలచిత్తుఁ డైనకై
లాసనివాసునొంపఁగఁ గ। లారెత్వదస్త్రము దక్కఁ దక్కొరుల్

క. యుతచిత్తుఁ డైనయాహరు
క్షితిధరపతిజానురక్తుఁ। జేయఁగవలయున్
శితిగళువీర్యముఁ దాల్పఁగ
నతివలలో నుమయ యోపు। నని విధి సెప్పెన్. 199

క. గిరిజయు నధిత్యకఁ దప
స్స్థిరుఁ డగుశంకరుని సేవ। సేయుచునుండెన్
గురునిపనుపుమైనని నుడి
విరి ముస్నచ్చరలు నాదు। వేగులవారల్. 200

ఆ. కానఁ జనుము సిద్ధిఁ। గన దేవకార్యంబు
సల్పు మొందువలన। సాధ్య మైన
నీవ చూ నిదాన। మిప్పని బీజాంకు
రోద్భవమున కాది। నుపకమట్లు. 201

చ. సురవిజయార్థ మైకడఁగి। శూలిపయిన్నిశితాశుగంబులం
బరపఁగ నీక చెల్లు సుర। పక్షకృతార్థుఁడ వైతి వీవు దు
ష్కరత ననన్యసాధ్య మగు। కర్మము ధాత్రిని సప్రసిద్ధ మై
పరఁగినదయ్యెఁబూరుషుని। భవ్యయశఃపరిపూర్ణుఁ జేసెడున్.

క. నిను వేల్పులు వేఁడెదరఁట
పని ముల్లోకంబులకును। బహుహితమునఁట యు
ప్పని ధనువుననఁట ఘాతుక
మును గాదఁట యహా నీవ। పో బంట విలన్. 203

క. మనసిజ యీమధుఁడును నీ
కనుచరతం జెప్పకయు స। హాయుఁడ యాఁగా
యనలునకు సహాయుఁడు గ
మ్మని యెవ్వఁడు మాతరిశ్వు। నాజ్ఞాపించెన్. 204

చ. అన విని యట్లకాక యని। యమ్మదనుండు ప్రసాదదత్తమా

లనుబలె వాసవాజ్ఞను దర్లఁ ధరియించి ప్రయాణమైనయం
తన సుమనఃకరీంద్రతనుఁ దాడనకర్కశ మాకరాంబుజం
బునమరాధినాయకుఁడుఁ బుష్పశరాంగముఁ దట్టినయ్యెడన్.

క. రతితోఁ బ్రియసఖుఁ డగుమధు
నితోడ సభయముగ వెడలి నిజతనునాశా
శ్రితకార్యసిద్ధియై రతి
పతి సేరెఁ హైమవతము భవునాశ్రమముల్. 206

క. వినియతమునిజనులసమా
ధినియమ మెడల మనమున రతిపతియు గర్వం
బున నడరఁగ నామని య
వ్వనమున నిజరూప ముంచి వడి జృంభించెన్. 207

క. ఇనుఁడు కుబేరనిగుప్త
శను సమయము దొఱఁగి పొందఁ జన దక్షిణది
గ్వనితముఖంబునఁ గరువలి
ని నిగుడ్చెం గొందలంపు నిట్టూర్పనఁగన్. 208

క. లలనాశింజితనూపుర
కలితచరణతాడనంబుఁ గాంక్షింపక వం
జులము మొదలు మొదలుగ సుమ
ములఁ జివురులతోడ నొక్కట మొగిన వెలార్చెన్. 209

క. మధుఁడు కిసలపత్త్రంబుల
ను ధరించెఁ జూతశరము సను రచించి లస
న్మధుకరడింభములను గుణ
మధన్వనామాక్షరములఁ మాడ్కి నమర్చెన్. 210

తే. వర్ణమున నొప్పి యుండియుఁ గర్ణికార
సుమము నిర్గంధ మగుట మనమునఁ గలంచె
స్రష్టవృత్తంబు తెఱచుగ సకలసుగుణ
రాశి నొక్కెడఁ కూర్పఁ బరాఙ్ముఖంబు. 211

చ. ముకుళము లొాట బాలశశిరేఖపోలిక వక్రములై నరక్తకిం
శుకకలికాకదంబములు శోభిలె నంత లసద్వసంతనా
యకునిసమేళ మొందునమయంబునయందు వనస్థలీనవాం
గకమునఁ దేజరిల్లెడునఖక్షతపంక్తు లనంగ నెంతయున్. 212

తే. లగ్నషట్పదాంజనభక్తిలలితతిలక
మాత్రముఖమునఁ దనరఁ బాలార్కమృదుల
రాగమునఁ జూపెకిసలాధరంబు నప్పు
డెంతయు నలంకరించె వసంతలక్ష్మి. 213

చ. అనయము గాలిఁదూలెడు ప్రియాళుమహీరుహమంజరీరజం
బునఁ గనుగాన కుండినను భూరిమదోద్ధతికల్మి మర్మర
ధ్వనిఁబడుపండుటాకులను దద్దయుఁజూడ్కికి సొంపునింపున
వ్వనమున సంచరించు మదవన్మృగసంతతి గాలికట్టమై. 214

ఉ. మానవతీశిఖామణులమానము మాయము సేయ నోపి త
త్సూనశరాసనోక్తములు సొంపెసలారుని దేశవాక్యమో
నా నవచూతపల్లవగణంబుల మెక్కి కషాయకంఠతం
బూని మనోజ్ఞభంగి మదపుంబికరాజము కూసె నత్తఱిన్.

క. హిమ మేగుటచే విశదో
ష్ఠములసితభూతవదనజలజద్యుతులం
గొమరగు మిగులుకింపురుష
ప్రమదలచెక్కులను జెమట పరఁగెందిరమై. 216

క. అనలాక్షాశ్రమవాసులు
మును లసమమసుమసమయసముద్భవము గనుం
గొని కదుఁ బ్రయాసమునఁ దమ
మనముల చాంచల్యగుణము మానిచి రంతన్. 217

క. ననవిల్లెక్కిడి రతితో
డన రాఁ బూవిల్తుఁ డయ్యెటవిఁ జేరినయం
తన యచటిమిథునములు ప్రియ

మున రంజిలె రతివిలాసములు తేటపడన్. 218

క. తన ప్రియను గూడి యళి సుమ
మను నొకపాత్రమున మధువు నాస్వాదించెఁ
దను వంటుటచేఁ గను మూ
సినమృగిని మృగంబు గోఁకె శృంగముచేతన్. 219

చ. కమలపరాగగంధి యగు కమ్మనిపుక్కిటినీటితేట రా
గమున మదద్విపాంగన స్వకాంతునకిచ్చెఁ బ్రమత్తచక్రవా
కము దెలిదమ్మితూఁడును సగంబు భుజించి తదీయశేషముం
దమకము మీఱఁగాఁ దనదుతన్వికొసంగి బహూకరించెడున్.

తే. చెమటచిత్తడిఁ జెదరుపత్త్రములఁ దనరి
కుసుమమధుఘూర్ణితాత్ములఁ గొమము మిగిలి
యున్నప్రియురాలిమోమును గిన్నరుండు
రహినిఁ జుంబించె గీతాంతనములయందు. 221

క. ఘనకుసుమస్తబకస్తను
లును సురుచిరకిసలయోష్ఠలును నగువల్లీ
వనితలవలనఁ దరులు నం
తనతలతాబాహుబంధనంబులఁ బొందెన్. 222

క. గిరిశుం డత్తఱి నచ్చర
విరిఁబోఁడులగానములను వినియు నిజతపః
పరుఁడై యుండెను స్వాత్మే
శ్వరులఁ గలఁప విఘ్నములకు శక్యం బగునే. 223

క. ననపొదరింటివిహారం
బున బంగరుబెత్త మెడమముంజేఁ గొని ని
ల్చిననంది ముక్కుపై వ్రే
లిడి పనిచె గణములం జలింపకుం డనుచున్. 224

చ. పలుకఁగ మానెనయ్యెడను బక్షిముఖాండజముల్ ద్రుమాళిని
శ్చలత వహించియుండె మృగసంతతిసంచరణంబు మానెఁ దేఁ

టులబలుపాటలాటలును డొంకె వనంబు సమస్తము న్నిరా
కులమయియుండి చిత్తరువ్రుకోయనన్నొప్పెను నందిపన్పనన్.

చ. అలగులవిల్తుఁ డత్తఱిని యాత్రఁ బురోగతశుక్రదేశముం
బలె హరుదృక్పథం బెడలి ప్రాంతములం గడు నల్లిబిల్లిగా
నలములతావితానముల నందపు మీఱున మేరుశాఖులం
బొలుపగుచంద్రశేఖరుతపోనిలయంబును జొచ్చెనచ్చటన్.

తే. వ్యాఘ్రచర్మాస్తృతం బయి వఱలుచున్న
దేవదారుద్రువేదికపై నసించి
వరతపోనిష్ఠమై నున్నపురవినాశుఁ
జూచె నాసన్నమృత్యుఁ డాసుమశరుండు. 227

క. వీరాసనస్థిరోర్ధ్వశ
రీరు వినమితాంసు దీర్ఘ బుజు నుత్తానో
దారకరద్వయలసితని
జోరువున స్ఫుటాబ్జునిబలె నొప్పెడువానిన్. 228

తే. పన్నగోన్నద్ధరుచిరకపర్దుఁ డగుచుఁ
జెవుల ద్విగుణాక్షసూత్రంబు చవుకళింప
గళవిభాధికనైల్యసంకలిత మైన
కృష్ణమృగచర్మమును దాల్చుకృత్తివాసు. 229

తే. నిశ్చలేషత్ప్రభోగ్రకనీనికములు
స్తిమితపక్ష్మపంక్తులు నధోదీధితులును
భ్రూచలనశూన్యములు నగులోచనముల
నాత్మనాసికాగ్రముఁ జూచునట్టివాని. 230

క. తనువంచవాయురోధం
బున వర్షము లేనిమబ్బువోలె నివాతం
బున వెలిఁగెడుదీపముభా
తి నల లణంగినమడుఁగుగతిఁ దనరువానిన్. 231

క. తలఁ బుట్టి కపాలాక్షిని

వెలువడి కడు వెలుఁగు వేఁడి వెలుఁగుల లేఁదూఁ
డుల మించుమార్దవము గల
కలువలదొరసిరిని మిగులఁ గ్రాచెడువానిన్. 232

క. ఘననియమవశ్యనవరం
ధ్రనివర్తితవృత్తి మన మొదన్నిలిపి మహా
మును లేయజుఁ దలఁతురో యా
ఘనుఁ దనుఁ దనలోనఁ దాన కనుఁగొనువానిన్. 233

క. అనలాక్షుని మనమునకై
న నధృష్యనదూరమందు ననవిల్తుఁడు కాం
చినతోడన కరవిగళిత
ధనురస్త్రము లెఱుఁగఁడయ్యెఁ దపఁబడి భీతిన్. 234

తే. మనసిజుహుతకల్పము బల
మును నిజరూపమున మరలఁ బుట్టించుగతిఁ
వనదేవతామణీయుగ
మును దోడ్కొని యపుడు గిరిజ సొంపు సూపె వనిన్. 235

క. కెంపుసొంపును నగునశోకంపుఁబూలఁ
గుందనపుపన్నె గొనుకొండగోఁగువిరుల
ముత్తెములఁ గేరువావిలిపూలసరుల
మధుసుమంబులఁ దొడవుగా మైధరించి. 236

తే. చనుల నొక్కింత వంగినయనువు దోఁప
బాలతపనారుణాంబగుపటముఁ గట్టి
వల్లరీషద్వినమ్రయుఁ బల్లవినియు
నైనవనపయొడలేఁదీవ యనఁగ దనరి. 237

ఆ. స్థానవేదియైనస్మరుఁడు దాఁచినయొండు
జ్యా యనంగఁ గటిని జాఱుచున్న
పొగడపూలదండ మొలనూలిఁ గరమున
మాటిమాటికిని నమర్చుకొనుచు. 238

ఉ. ఘుమ్మున వాసనల్ చిలుకు కమ్మనియూర్పుల నానునానఁ బైఁ
గ్రమ్ముచు నోష్ఠబింబమున గంతులు వైచుమదద్విరేఫరా
జమ్మును మాటిమాటికిని సంభ్రమసంభ్రమితాక్షియై స్వహా
స్తమ్మునఁ గ్రాలుకేళిజలజమ్మునఁ బొమ్మని పాఱఁదోలుచున్.

క. తన ప్రియునను సిగ్గొనఁగెడు
ననవద్యానయన యగున గాత్రజను గనుం
గొని మరుఁడు జితేంద్రియుశం
భుని గెలుతు నటంచు మరల ముదముం బొందెన్. 240

క. గిరిజ భవిష్యత్పతి యగు
హరునిదువారంబు సేర సరిగం దోడ్తో
గిరిశుఁడును బరంజ్యోతినిఁ
బరమాత్మను గని సమాధిపరతన్ విడిచెన్. 241

క. ఆసమయమున ఫణిపతి ప్ర
యాసంబున ధర భరింప హాఁగుఁడు నిబిడపీ
ఠాసనమును శిథిలంబుగఁ
జేసెఁ జననబంధముక్తిఁ జేసినపిదపన్. 242

ఆ. అంత శివున కెఱఁగి యచలజ శుశ్రూషఁ
జేయ వచ్చె ననుచుఁ జెప్పి నంది
యతనిబొమలసన్న ననుమతిఁగాఁ గొని
యాశుభాంగి నటఁ బ్రవేశపెట్టె. 243

క. గిరిజచెలు లపుడు తమతమ
కరములఁ జిదిమినకిసలయఖండయుతము లౌ
విరితతి క్రొవ్విరిగుమురుల
హరుపదమూలమునఁ జల్లి యతని కెఱఁగుచున్. 244

క. ఉమయు నళికురులనడుమం
గోమును మిగులుకర్ణికారకుసుమము వడఁ గ
ర్ణమునఁ దగుచిగురు జాఱఁగఁ

ప్రమథాధిపుపాదములకుఁ బ్రణతి యొనర్చెన్. 245

క. శివుఁ డపు డనన్యభాక్కును
ధవునిఁ బడయు మనుచు గిరిసుతను దీవించెన్
భువిలోన మహాపురుషుల
సువచనములు తలఁప నొండుచొప్పునఁ జనునే. 246

తే. ఇదియ యుష్మేయఁ దఱి యని మదనుఁ డపుడు
మిడుతవలె వహ్నిముఖమునఁ బడఁ దలంచి
పార్వతిసమక్షమున హరుపయి గుఱి నిడి
యించువిలు గొని నారి సారించె నంత. 247

క. గిరిజ తపోనిధి యగుశం
కరునకుఁ దనరక్తవర్ణకరమునఁ గరస్ఫు
త్కరశోభితఖధునీపు
ష్కరబీజమయాక్షమాలిక సమర్పించెన్. 248




క. వినతప్రియుఁ డగుటఁ ద్రిలో
చనుఁ డమ్మాలను గ్రహించె స్మరుఁడును సమ్మో
హన మనునమోఘశరమును
దనకోదండమునఁ దొడిగెఁ దత్సమయమునన్. 249

క. ఇందూదయాది నంబుధి
చందంబునఁ గొంత ధైర్యసార మెడలి య
య్యిందుధరుఁడు బింబాధర
సుందరగిరిజాస్యమందుఁ జూడ్కులఁ బరపెన్ 250

క. ఉమయు స్ఫురన్నవనీపో
పమాంగముల భావ మెఱుకపడఁ జేయుచు సం
భ్రమితనిజవిలోకనములఁ
గొమరు మిగులుమోముఁ ద్రిప్పుకొని యట నిలిచెన్. 251

తే. అపుడు వశి యగుశివుఁ డింద్రియములవికృతి
బలిమిమై మాన్చి తనమది కలఁకఁ బొఱు

కారణం బేమొ తెలియఁగఁ గోరి నాల్గు
దెసలఁ గలయంగ నాత్మీయదృష్టిఁ బరపె. 252

తే. అల్లె చెవి సోఁక దృఢముష్టి నలవరించి
ప్రణమితాంసుండు సాలీఢపాదయుగుఁడు
కుండలీకృతచాపుకోదండుఁ డగుచు
నేయ సమకట్టుమరుఁ జూచె నీశుఁ డంత. 253

క. తనతపముఁ జెఱచె ననునలు
కను బొమముడి గదుర హరుమొగమునఁ గలతృతీ
యనయనమునఁ దక్షణమున
ననలము శిఖ లెగయ వెడలె నతిభయదం బై 254

క. కన లుడుపుముడుపుము విభూ
యనుచు వియత్తలమునందు నమరు లనినయం
తన యాశివునయనంబున
జనియించినవహ్ని పుష్పశరుని దహించెన్. 255

క. వితతాభిభవప్రభవం
బతిబద్ధేంద్రియవికాస మగుమోహమునన్
రతి యవిదితపతిమృతి యై
కృతోపకృతివలె ముహూర్త మిలపైఁ బడియెన్. 256

క. పవి తరువుంబలెను దపసి
శివుఁడు తపోహరుని మరుని శీఘ్రంబుగఁ దా
భువిఁ గూలిచి సపలాచే
రుప విఱువఁగ నగణముగఁ దిరోహితుఁ డయ్యెన్. 257

క. ఘనుఁ డగుజనకునికోర్కియుఁ
దనదులలితతనువు వ్యర్థతం గనుట సఖీ
జనము నెదుర నగుటను సి
గ్గనసి యలఁత నుమయు వెడలె నింటికిఁ బోవన్. 258

మాలిని. సుతనవు దనుకంప్యా శూలిభిన్మాలితాక్షీ
క్షితిధరపతి ప్రీతిం జేతులం గొంచు దంతా
వృతనలినిని జేజే యేనుఁగుంబోలె వేగా
యతనిజతనుఁ డై పూర్వాధ్వముం బట్టి యేఁగెన్. 259

ఉ. ఇంద్రియవర్గదూర భువనైకసముద్ధరణప్రచార యో
గీంద్రమనోనివాస శుభకృత్కరుణామయదృగ్విలాస బ్ర
హ్మేంద్రముఖామరస్తుత త్రయీశిఖరైకనిరూపితా స్థితా
చంద్రదినేశలోచన నిజప్రియభక్తజనాఘమోచనా. 260

క. సత్యజ్ఞానానంతా
నిత్యాత్మాలోకనైకనిష్ఠావంతా
భృత్యవిపత్తినిహంతా
యత్యంతకృపాప్రపూరితాచ్ఛస్వాంతా. 261

మాలిని. సరసిజదళనేత్రా సర్వదైతేయజైత్రా
సురమునినుతిపాత్రా శోకవల్లీలవిత్రా
పరుషజనదురాపా భానుకోటిప్రతాపా
సరసగుణకలాపా సచ్చిదానందరూపా. 262

గద్యము. ఇది శ్రీమద్వేంకటస్వామిరాట్పౌత్త్ర తమ్మయరాట్కుమారేం
ద్రపుత్త్ర విబుధవిధేయ వేంకటసూర్యప్రసాదరాయ
ప్రణీతం బైన నిర్వచనకుమారసంభవమహాకావ్యం
బునందుఁ బ్రథమాశ్వాసము.







రామచన్ద్రపరబ్రహ్మణే నమః

# నిర్వచనకుమారసంభవము.

## ద్వితీయాశ్వాసము.



భవ్యాద్గారికటా
క్షా భక్తజనైకరక్ష
ణాధీనమన
స్కా భయదశరవిలాసని
రాభరణీకృతసురారి
రామా రామా. 1

తే. అవధరింపుము పిదప మోహమున మునిఁగి
వివశయై యున్న ననవిల్తు వెలఁది దుస్స
హ మగునభినవవైధవ్య ముందఁ జేసి
నట్టివిధిచేఁ ప్రబోధిత యయ్యె నంత. 2

క. ప్రళయాంతోన్మీలితచ
క్షుల మెల్లన విచ్చి కలయఁ జూచి యెఱుఁగ ద
చ్చెలి మఱుఁ దనియనితనక
న్నులకు నతివిలుప్తదర్శ నునిఁగా నంతన్. 3

క. ప్రాణేశ సుందరాంగక
ప్రాణముతో నుంటె యంచు రతి లేచి పురః
క్షోణిం బురుషాకృతి యగు
స్థాణుక్రోధాగ్ని భస్మ సంతతిఁ గనెన్. 4

తరల. మరలఁ జేష్టలు దక్కి యమ్మరు । మానినీమణి భూమిపైఁ
దొరఁగి పొర్లుచు గబ్బిగుబ్బలు । ధూసరత్వము నొందఁగాఁ
గరము వేనలి వీడ నచ్చటి । కాననస్థలి నెల్లఁ దో
సరివగం బొగలంగఁ జేసెడు । చాడ్పునన్ విలపించెఁ దాన్.

ఉ. అయ్యయొ జీవితేశ యిటు । లైతివె మంజులతావిభూతిచే
నెయ్యది రూపవంతులకు । నెంతయుఁ దానుపమాన మయ్యెనో
యయ్యది నీదుమేను ధర । నక్కట యీదశఁ బొందఁ జూచియు
న్వ్రయ్యలుగాను నేను లల । నల్ కఠినాత్ములుగారె యారయన్.

క. కృతసేతుబంధ మగుజల
తతి నలినింబోలె నన్నుఁ । ద్వద్వశగతజీ
విత నెచట డించి నిమిషవి
గతహార్దుఁడ వగుచుఁ జనితొ । కంజాతశరా. 7

క. హానాథ నీవు నాకును
నే నీ కప్రియము సేయ । మెపు డేల యొకో
నీనవరూపము సూపవు
గానఁగ విలపించురతి క । కారణము కటా. 8

క. మొలనూలిత్రాళ్ల నామ
స్థలితంబుల బంధనంబు । స్మరియించితొ దృ
ష్టుల నకరులఁ గలఁచెడును
త్పలతాడనములను గాని । తలఁచితొ మదనా. 9

చ. హృదయమునందయెప్డు వసి । యింతువునీవనిమత్ప్రియంబుగా
నెదివచియించి తప్పలుకు । నేఁ గపటంబును గాఁ దలంతు న
య్యది మెఱమెచ్చు కానియెడ । నక్కట నీవతనుత్వ మొందనో
మదనమదీయదేహ మొక । మాత్రయుఁ గీడును బొందకుండునే.

క. నినుఁ బరలోకాభినవగ
తుని వెనుకొని వత్తు నిదిగొ । ద్రుతతరగతి నీ
జనము విధివంచితము జగ

నీపద [illegible]రవారోరతములు
శ్రీపుత్త్రా తలఁప శాంతిఁ । జెందఁగ వశమే. 18

మ. వారతిపండితా ప్రియ మృదంగము లందును నీవు దాఁ బ్రియం
బారఁగ సేవనంతకును । మాభరణ ప్రతతిన్ రచించితో
యారచిత ప్రసాధనము । లన్నియుఁ గానఁగ నయ్యెఁ గాని యా
నీరమణీయరూప మవ । నిం బొడసూపదు నాకు నక్కటా. 19

తే. యత్ప్రసాధనరచనా । సమాప్తిఁ గ్రూరు
లగుసురలు నిన్నుఁ దలఁచిరో । యట్టినాఁడు
దక్షిణేతరపదమును । దర్పకా స
రాగముగఁ జేయఁగా వేగ । రమ్ము లెమ్ము. 20

క. ఓనాథ కలభపద్ధతి
నే నీతోడఁ జేర వత్తు । నెంతటఁ జతుర
ద్యోనారీగణములవల
లోనఁ బడక యుండు దంత । లోన రయమునన్. 21

క. ఓరమణా యిప్పుడు నినుఁ
జేరినను రతి మరుని విడి । చి యొకక్షణము దా
నోరిచి జీవించె నటం
చీరస నొకనింద యావ । హిల్లుఁ నాకున్. 22

క. స్మర మృతుఁ డగునీ కంఠా
భరణ మయినఁ దొడుగు నట్లు । వాటిల్లుఁ గళే
బరజీవితములతో నీ
వరయుంగా రానిగతిని । నరిగితి వకటా. 23

క. తోడవై విల్లిడి ఋజుతం
బడ శరముం దీర్చుకొనుచు । మధుతో నగవౌ
ప్పెదుపలుకులఁ బలికెదు నీ
కడకంటివిలోకనములఁ । గడుఁ దలఁతు మదిన్. 24

క. హృదయంగమనఖుఁడు సమ

ప్రదరాసనకరుఁడు మధుఁడు రాఁ డటు వోయెఁ
మదన మహోగ్రరుషోగ్ర
శిఖదహనుచే మిత్రుగతినిఁ జిక్కువడఁడుగా. 25

క. అనుసావిలాపవచనము
లను మది విషదిగ్ధశరములంబలెఁ గడు నొ
చ్చినవాఁడై మధుఁ డావ
న్నను రతిఁ గావంగఁ దత్క్షణము పొడచూపెన్. 26

క. వానిం గని చను లవియం
గా నురమును మోఁదుకొనుచుఁ గడు రతి యేడ్చెం
దా నడరుఁ దుఃఖము తన
వానిపురస్థ్సలి వివృతకవాటము వోలెన్. 27

క. వెత నొందుచు నారతి మధు
నితోడ ని ట్లనె వసంత నిజమిత్రుని యీ
స్థితిఁ గంటె కపోతశబల
తతభస్మము దెసల మారుతములు విసరెడున్. 28

క. చెలువుఁడ దర్శన మొసఁగుము
చెలికాఁ డగుమధుఁడు వేడ్క సెందెడుఁ బురుషా
వలిప్రేమ దయిత లందుం
జల మైనను సఖులయెడ న చంచలము గదా. 29

క. అనుచరుఁ డగునీమధుచే
తను ససురాసురజగంబు తనుబిసగుణశిం
జినియును జేశలసుమశర
మును నగునీధనువు పనుపు బొనరింపఁబడెన్. 30

క. అనిలాహతదీపముబలెఁ
జని నీచెలి మరలి రాఁడు సత్యము తద్వ
ర్తినిబలె దుస్సహదుఃఖం
బున ధూమితనై నన్నుఁ బొడగను మనఘా. 31

క. ననవిల్తు వధించినవిధి
నను విడుచుట నర్థిహింస నమ యొనరిచె నై
నను ననసాయాశ్రయనగ
మును గరి వికలింప లతయుఁ బోడవడఁగుఁ గదా. 32

క. కావున బాంధవకృత్యము
నీ వీగతి నెగపవలయు నిత్తఱిని వసం
తా వహ్నిని దరికొలిపి మ
హావిధురను నన్నుఁ జేర్పు మంగజునిదరిన్. 33

క. నెలతో వెన్నెల వ్రావు మొ
యిలుతో మించును నశించు నెంచంగను గాం
తలు మగలతోడివారని
తెలుపు నచేతనములును క్షితిం దెల్లముగన్. 34

తే. ఈరుచిర మగుభర్తృశరీరభస్మ
మునన చనులఁ గషాయితంబులుగఁ జేసి
లేఁజివురుఁబొన్నవబలెఁ గళేబరమును
జిత్రభానునియందుఁ జేర్చెద వసంత. 35

క. విరిపాన్పులు గూర్పఁగ మా
యిరువురకుం దోడుపడితి వీవు పలుమఱుం
గరములు మోడిచి వేఁడెదఁ
ద్వరితముగా నాకిపుడు సాదం బేర్పఁగదే. 36

క. జ్వలనము నా కిడి యటఁ ద్వర
మలయానిలవీజనముల మండింపుము నీ
చెలి నన్ను విడిచి క్షణమును
నిలుపోవఁగఁ జాలఁడ యని నీ వెఱుఁగుదుగా. 37

క. ఇటు లొనరిచి సలిలాంజలి
పుట మొకటియ మాకొసంగుము భవత్సఖుఁడ
చ్చోటున ముదంబున నావాః

పటలము నాతోడఁ గూడి పానము సేయున్. 38

తే. మాధవా పరలోకకర్మమున నాసు
మాంబకునకుఁ జలత్పల్లవంబులైన
మావిపూవులగుత్తు లిడుము త్వదీయ
సఖుఁడు ప్రియసహకారప్రసవుఁడు గాఁడె. 39

క. అని మెయి విడువఁ దలఁచుమా
రనలిననేత్రను వియత్సరస్వతి కరుణిం
చెను మడువున నీ రింకిన
దునుకునఁ గలఁగెడుశఫరినిఁ దొలకరిమాడ్కిన్. 40

క. ఓమనసిజపత్ని త్వర
నీమగనిం బొందఁగలవు నిక్కము వినుమా
కాముఁడు హరిదృగ్జ్వాలం
దా మిడుత యగుటకుఁ గారణంబు దెలిపెదన్. 41

తే. స్మరునిచేఁ బ్రేరితుం డయి జలజభవుఁడు
తనయ మోహించె బదపడి తనదువికృతి
మాన్చి యవ్విధి ప్రేరకు మరు శపించె
నాఫలం బితఁ డీగతి ననుభవించె. 42

ఉ. అత్తఱి ధర్ముచే నలువ యాచితుఁడై గిరిజాతపఃక్రియం
జిత్తమునందు మెచ్చి శశిశేఖరుఁ డామె వివాహమై సుఖా
యత్తతనున్నయంతమరుసాంగునిఁ జేయునటంచుఁ బల్కె నా
నాత్తనకుల్ ఘనంబులమృతాశనియుగ్మనిదానములే గదా.

తే. కాన భవితవ్యభర్తృసంగమమనోజ్ఞ
మైనయీమేనిరక్షణ మరయు మమ్మ
తపనకరపీతజల యగునట్టి యేఱలఁ
దొలకరిని ప్రవాహముతోడఁ గలయఁ గాదె 43

తే. అని పలికెడి వియద్వాణి నతనుపత్ని
మరణనిశ్చితబుద్ధిని మరలఁ జేసె

నవుడు మధుఁడును దత్ప్రత్యయమున రతిని
లలితచరితార్థపదవచఃకలనఁ దేర్చె. 45

క. ననవిలుతునేలఁత పిదప వ్య
ననకృశ యై యెదురు చూచె శాపాంతంబుం
దినమందుఁ గిరణసంక్షయ
మునఁ బొల్పఱుచంద్రలేఖ మునిమాపుబలెన్. 46

క. ఇందుధరుఁ డట్లు మరుఁ దన
ముందఱ దహియింపఁ గోర్కి పొసఁగమి రూపున్
నిందించెన్ గిరిజ సతీ
సౌందర్యఫలంబు భర్తృసౌభాగ్యము గా. 47

తే. అట్లు నిందించి నియతాత్మ యై మహోగ్ర
తపముచేఁ దనసొబగు సార్థకముఁ జేయ
నెంచె నాయచలాత్మజ యెట్లు గలుగు
నట్టిప్రేమయు భర్తయు ననన్యసరణి. 48

క. సుత హారసక్తాత్మ తపః
కృతనిశ్చయ యగుట విని గిరిజఁ జేరి ముని
వ్రతము వల దనుచు మేనా
సతి కౌఁగిటఁ జేర్చి పలికె సంభ్రమ మెసఁగన్. 49

ఉ. అక్కట వత్స మందిరములందు మనీషిత లైన దేవతల్
లెక్కకు నెక్కుడై మనకు లేరె వనం బది యేల హా తపం
బెక్కడ నీతనూవిభవ మెక్కడఁ దుమ్మెదకాలితాఁకునన్
రెక్కనుఁ గాక పేశలశిరీషము పక్షిపదంబు సైఁచునే. 50

తే. అని నివారించియు ధ్రువేచ్ఛ యైనతనయ
యుద్యమము మేన మరలింప నోప దయ్యెఁ
గామితార్థైకనిశ్చయ మానసంబుఁ
బల్లమున కేఁగునీరుఁ ద్రిప్పంగఁ దరమె, 51

క. పిదప నొకనాఁడు వాంఛా
విదు జనకు సఖీముఖమున § వేఁడికొనియె న
మ్ముదిత మనస్విని ఫల మ
బ్బుదనుక వని కేఁగి తపము § పొనరుచుపొంటెన్. 52

తే. అవుడు సుతతగుబుద్ధికి § హర్ష మొంది
శైలపతి యంప నాగౌరి § సనియెఁ బిదప
నిలను దనపేర జనులచేఁ § బిలువఁబడెడు
శిఖికలారావకలితత § చ్ఛిఖరమునకు. 53

చ. చని యనివార్యనిశ్చయ ర§సాధరరాజతనూజ యచ్చటన్
స్తనధరణీధరద్వితయ § చంచలయష్టివిలుప్తసాంద్రచం
దన మగుహారముఁ విడిచి § నవ్యకుచోన్నతిశీర్ణసంహతిన్
ఘనతరుణారుణద్యుతివి§కస్వరవల్కలము దాల్చె వేడ్కమై.

ఉ. ఆలలనాశిఖామణిము§ఖాబ్జ మలంకృతకుంతలంబులం
బోలె జటాకలాపపరి§పూరిత మయ్యును సొంపు నింపెఁ గీ
లాలరుహంబు షట్పదకు§లంబులచేతన కాదు బాలశై
వాలముతోడఁ గూడినను § హారనిసొంపు వహింప కుండునే.

తే. మాటిమాటికిఁ బులకలు § మైఁ జనింప
మున్ను ధరియించి యెుఱఁగమి § మొలయుఁ గందఁ
ద్రిగుణ మగుమౌంజినూలు నా § నగతనూజ
ఘనతపోనియమార్థంబు § కటినిఁ దాల్చె. 56

తే. చనులమైపూఁత నెత్తి నై § తనరుచెందు
రాగవిరహితమృదులాధ§రంబు విడిచి
యగజచే దర్భలవవి§క్షతాంగుళియును
నక్షమాలికాసక్తంబు § నయ్యె నవుడు. 57

ఉ. ఎయ్యచలాధిరాట్తనయ § యింపగు మెత్తనిహంసతూలికా
శయ్యఁ బరున్నఁ బెన్నుఁ బులి§జాతెడు క్రొవ్విరు లంటినంతలో
డయ్యెనొ యాలతాంగి యక§టా తన కేలు దలాఁపి చేసి తా

నయ్యెడఁ బండుచుండు విని రారాస్తరణం బగుధారుణీస్థలిన్. 58

క. గిరిసుత వ్రతవతి యగుటకా
మరలఁ గొన లతామృగాంగ నలయం దునిచెకా
నరసవిలాసములు చల
న్నిరీక్షణంబులును వరుస నిక్షేపము నాన్. 59

ఆ. జనన మొందుగుహుఁడుఁ గొన రానిపుత్త్రివా
త్సల్య మెసఁగ బాలసాలములను
గునికిపాటు లేక ఘనఘట స్తనపయో
ధారఁ బెంచె నాకుధరతనూజ. 60

చ. హరిణము లాగిరీంద్రతనయామణి చేరలఁ బ్రీతి నిచ్చుని
వ్వరికణికంబులం దినుచు వారనిమచ్చిక నొంది వేడ్క నా
ధరజ సఖీనమక్షమునఁ దన్నయనంబుల నాత్మనేత్రతో
యరుహాయుగంబుఁ గొల్వనగు నంతటినమ్మిక సంచరించెడున్.

క. హుతవహ్ని నధీతినినిం
గృతాభిషేకను ద్వగుత్త రీయను నవ్వా
ర్వతిని గన మునులు వచ్చిరి
కృతు లెన్నరు వయసు ధర్మవృద్ధులమొదలన్. 62

చ. సమదకరీంద్రసింహముఖ సత్త్వవిసృష్టపరస్పరోగ్రవై
రమును ఫలార్చితాతిథి రారుహరాజివిరాజితంబు నై
యమలన వ్రోటజాంతరహుతాగ్ని యునైనత దాశ్రమంబు నా
హిమగిరిజాతపోమహిమ నెంత యుఁ బావనమయ్యెన య్యెడన్.

క. కోరిక తావత్తపమునఁ
గూర దనుచుఁ దోఁచునాఁటఁ గోలెను నిజశా
రీరసుఖము గోరక గిరి
జారమణి మహాతపంబు సలుపఁ గడంగెన్. 64

ఉ. కందుక కేళి నైనఁ గడు గాసిలునాచివురాకుఁబోఁడి మా
నీందుధరుల్ వహింపఁదగు నెక్కుడు నేమముతోఁ దపంబు నే

యం దొడఁగెన్ నిజంబుగను హైమసరోరుహనిర్మితంబకా
నందదుమాంగ మోజఁగరిశీనంబయి కోమల మైతనర్చెడున్.

తే. నిండువేసవి భగభగమండునాళ్లు
నెగడులనడుమ నిలిచి యానగతనూజ
కనులఁ గలఁచెడుతీక్ష్ణప్రభను జయించి
భానుదెసఁ జూడ్కి నిల్పి తపం బొనర్చె. 66

క. తరణిఖరకిరణముల నా
కరణిం దప్త మగుతన్ముఖము దమ్మిసిరిన్
ధరియించె నలువు మెల్లన
నెరసెం గేవలము దీర్ఘనేత్రాంతములన్. 67

క. కోరక పడునీరంబు ను
ధారసమయశశికరములు తద్గిరిజకు నా
హారవిధి యయ్యె విపినర
సారుహావృత్తికి నభిన్నసాధన మగుచున్. 68

క. ఖచరేంధనసంభృత మా
శుచిఁ గడుఁ దప్త యగుశైలసుత తొలకరివాః
ప్రచయంబునఁ దడిసి విడిచె
నచలగతిని నూర్ధ్వగ మగునావిరి నంతన్. 69

చ. తొలుదొలుతన్ క్షణంబునునుఁదాంగలిఱెప్పలనిల్చి మోవిపై
గలయఁగ నొవ్వఁదాఁకి చనుగట్టులపైఁబడి చూర్ణితంబులై
వళులను దొట్రుపాటొదవ వందఱలై యిటు లెట్టకేలకఁ
బ్రొలఁతిగభీరనాభికడఁ బొందెను దొల్కరివానబిందువుల్.

క. ఘనమధ్యానిలవృష్టుల
ననిలయవాసిని శిలాశయయు నగునగనం
దనను దపస్సాక్షులు రేల్
కనత్తటిద్దృష్టితతులఁ గనుగతిఁ దనరెన్. 71

తే. చల్లగా వీచుగాడ్పుల నలువు గొలుపు

తైషరాత్రుల నుదకమధ్యమున నిలిచి
జరపె విరహార్తి నట కూయు జక్కవకవ
మీఁదఁ గనికర మొలయ నమ్మీననయన. 72

తే. కంపమానాధరదళంబు కమలగంధి
యైనమోమున గిరిజ రేయందు మంచు
వానఁ జెడుతమ్మిసిరి గలవారి కబ్జ
సంపదను గూర్చుచందాన సొంపు మీఱె. 73

తే. పండి తమయంత రాలెడుపర్ణములను
బ్రతుకు జరపుట తపమున కతిశయంబ
యదియు విడనాడుటను బ్రియంవద దద్రి
పుత్త్రిక నపర్ణయని యంద్రు బుధులు జగతి. 74

క. బిసకోమలనిజతను వి
ట్లసమవ్రతముల గిరిజ యహర్నిశమును దాఁ
గనుగందఁగఁ జేయుచుఁ దా
పసదృఢవపురార్జితముఁ దపంబును మీఱెన్. 75

తే. తరుణహారిణాజినాషాఢ ధరుఁడు ప్రౌఢ
భాషణుఁడు బ్రహ్మతేజోవిభాసి యగుచు-
బొలుచునొకజడదారి మైపూను మొదటి
యాశ్రమము నాఁగఁ జనుదెంచె నచటి కపుడు. 76

క. వానిం గని గిరిజ సబహు
మానార్చన నెదురుకొనియె మహితమతులు స
న్మానింతురు తమతోడ స
మానజనుల నైన దురభిమానరహితులై. 77

క. ఆజటిలుఁడును యథావిధి
పూజను గొని సేదదేఱి పోలిక [illegible]ణ మ
చ్చో జరపి సౌమ్యదృష్టుల
నాజోటినిఁ గనుచు నిట్టు లనియెఁ గ్రమముగన్. 78

క. సులభమె సమిత్కుశము విధి
సలుపఁగ స్నానానుకూలజలము గలదె నీ
కలవడునంతియు తపమును
జలుపుదె తను వాద్యధర్మసాధనము గదా. 79

క. చిరవర్జితలాక్ష మయిన
నరుణరుచినిఁ బోలు చునీదునధరోష్ఠముతో
సరి యగులేఁజిగురులు త్వ
త్కరజలములఁ బెరుఁగునీలతలను వెలయునే. 80

క. లోలాక్షుల నీకనులను
బోలెడు లేళ్లు నిజహస్తపుటకుశతతులన్
నీలోత్పలాక్షి. ప్రణయము
చే లాగిన మనము కనలుసెందక యున్నే. 81

క. కోపము గలచోఁ బాప
వ్యాపారం బుండ దనెడువాక్కు నిజం బీ
నీపావన ఘాశీలం
బోపార్వతి మునుల కైననొజ్జ యగుఁ గదే. 82

క. తతసత్త్వమానిబలిన
స్మితఖచ్యుతగాంగజలనమితికంటె హిమ
క్షితిధరుని గులముతోఁ బా
వితుఁ జేసెం దరుణి నీ పవిత్రచరిత్రల్. 83

క. భావిని వర్గత్రయమున
నేవర మని తలఁతు ధర్మమే కా క్షున్నన్
నీ వర్థకామముల నటు
పో విడిచి తదేకపరతఁ బొందుదె చెపుమా. 84

క. నీవు భవదర్పితుని నను
భావింపకు పరునిఁగా విపశ్చితులనుహ్రా
ద్భావము సా పపదీనము

గా విబుధులు సెప్ప వినమె కమలదళాక్షీ. 85

క. కావున నే విప్రవస్వా
భావికచాపలత నిన్ను బహుళాంతమతిన్
భావిని యొక్కటి యడిగెద
నీవు రహస్యంబు కానియెడ నది చెపుమా. 86

క. జననంబా విధికులమునఁ
దనువు త్రిలోకాభిరూప్య ధామము ప్రాయం
బు నవంబు సిరి యమృగ్య మిఁ
కను దపమున నెక్కు డేమి గలదో చెపుమా. 87

క. ఈయిల మానవతు లసహా
నీయానిష్టముల నిట్టి నియతిఁ గొనుటయుం
గోయజముఖి కల దదియును
నీయెడఁ గానంగ రాదు నెమ్మదిఁ దలఁపన్. 88

క. ఈనీరూపు ధవాద్యవ
మానానర్హంబు దండ్రి మందిరమున నె
ల్లా నవమతి గా దది పరు
చే నెవఁ డురగస్థమణికిఁ జే సాఁచు సతీ. 89

తే. ఉవిద జవ్వనమున నగలొల్ల కీవు
స్థావిరవిరాజివల్కలంబు దాల్చి తేల
రాత్రిముఖమునఁ జంద్రతారాప్రదీప్త
మైనశర్వరి యరుణునకగు నె చెపుమ. 90

తే. తరుణి దివి గోరితేని వ్యర్థంబు శ్రమము
దేవభూమియ నీతండ్రిదేశ మెల్ల
నిఁకను వరు వలతేఁ జాలు నీతపంబు
వెదకఁబడుఁ గాక రత్నంబు వెదకికొనునె. 91

క. ఔర తెలిసె వెచ్చని ని
ట్టూరుపునన దైన డెంద మొందెడు శంకం

గోరఁ దగువాఁడె లేఁ డనఁ
గోరిన దుర్లభుఁడు గలఁడె కోమలి నీకున్. 92

తే. చిరవిధుతకర్ణకుముద మౌచెక్కుటఁ గల
మాగ్రపింగళవర్ణంబులైన జటలు
ప్రిదిలి వ్రేలుట గని యొప్పరికము సేసె
నెవఁడో యామునివరుఁడు వజ్రహృదయుఁ డహహా. 93

క. భానుప్లుష్టాభరణ
స్థానను మునినియమకర్శితను దినశశిలే
ఖానిభను నిన్నుఁ గనునె
వ్వానిమనము కొండెలంబు నడకుండు సతీ. 94

తే. ఎవఁడు చతురపుఁజూడ్కుల నెసఁగునీయ
రాళపక్ష్మాక్షులకుఁ బెద్దకాల మిట్లు
నిజముఖము సూప కుండె నాకనీప్రియుండు
చెలువ సౌందర్యగర్వవంచితుఁడు సూవె. 95

క. చలి యెన్నాళ్ళిటు గాసిలఁ
దలఁచితో పూర్వాశ్రమార్జితతపము నాకుం
గలదు తదర్ధంబున నీ
వలచువరునిఁ గొనుము తెలియ వలతును వానిన్. 96

క. అని బాపఁడు పలుకఁగ గిరి
జ నిజమనోగతునిఁ దెలుపఁ జాలక తనప
జ్జన మెలఁగువయస్య ననం
జననయనాబ్జమునఁ జూచి సన్నయొనర్చెన్. 97

క. అనుఁ దత్సఖి వర్ణికి ని
ట్లని విన వేడ్క గలవేని నాలింపుము త
మ్మిని గొడుగుబలెఁ దపస్సా
ధనముగ మై నేల యీసుతను వైనరిచెనో. 98

క. సిరి గలశక్రాదిచతు

ర్త్యాదిదేశుల వరకు గొనక పాతకాముం డై
వరఁగుట నరూపహార్యుని
హరుఁ గోరుచు నున్న దీ లలితాంగి మగనిఁగన్. 99

క. తొలి హరునసహ్యాహంకృతిఁ
గలఁగి మరలి తోన దగ్ధకాయుం డగు న
య్యలరువిలుకానియ ప్పా
చెలిమది నో నాడి కృశతఁ జెందఁగఁ జేసెన్. 100

క. మాటికి నాఁటంగొలె లా
లాటికపాటీరమిళదలకయుత యూని
బోటికిఁ బుట్టినయింటం
బాటిల్లదు సుఖము తుహినమయశిల లందున్. 101

తే. పంచశరహరుచరితంబుఁ బాడుతఱిని
గద్గదగళస్ఖలితపదకలనవలనఁ
గిన్నరులఁ గాననాంతసంగీతసఖులఁ
బెక్కుమాఱ్లీమె కడు దురపిల్లఁ జేసె 102

తే. రేల వేకువవేళ నీబాల తుణచు
కన్ను మోడిచి యపుడ యోకాలకంఠ
యెచటి కేఁగె దని యలత్యవచన యగుచు
బయలు కౌఁగిటఁ జేర్చుచుఁ బదరి తెలియు. 103

క. ఇల సర్వగతుం డండ్రు బు
ధులు నిను నెటు భావసంస్థితుని నీజనునిం
దెలియు వని రహస్స్థలి నీ
చెలి స్వకరోల్లిఖితుఁ జంద్రశేఖరు దూఱున్. 104

క. ఒందువెరవుమెయి శివుఁ డవ
శుం డని తోఁచుతఱి నీవిశుద్ధచరిత దాఁ
గొండలదొరపనుపు గొని య
ఖండతపము సేయఁ బొందెఁ గానను మాతోన్. 105

క. వీక్షితము ఫలంబు తప
స్సాక్షి నఖిలోపితాంగ సమితిని మఱి ఫా
లాక్షవిషయ మగుకోర్కి వి
చక్షణ మొల కెత్తుటయుఁ బొసఁగదు కంటే. 106

తే. అకట ప్రార్థితదుర్లభుఁ డతఁడు చెలులు
కంటఁ దడి వెట్టి చూచు నిఖరతపఃక్ల
శాంగి సఖ నెప్డు కరుణించు నయ్య యింక
కష్టుఁ డెండిన నాఁగటిచాలుఁ బోలె. 107

తే. అని నగను తేంగితజ్ఞ యానాకె యంత
యుం దెలియఁ జెప్ప నైష్ఠికసుందరుండు
ముదము మది డాఁచి ముదిత యియ్యది నిజంబొ
నవ్వులాటయొ చెపు మని నగజ నడిగె. 108

క. ముకుళీకృతకరశాఖా
గ్రకరంబున నక్షమాలికను ద్రిప్పుచు నై
ష్ఠికునిపలుకు విని యుమ మెలుఁ
గొకభంగిగ నెట్టకేల కొయ్యనఁ బలికెన్. 109

తే. వేదవిద్వర నిజము నీవినిన దెల్ల
నున్నతపదాప్తికి జన ముత్సుకంబు
చాలు నీతప మది వొంద సాధన మఁట
యవిషయం బెద్ది కోర్కుల కరసి చూడ. 110

క. నా వర్ణి వలుకు నెఱుఁగమె
భావజరిపు మరల వలతె భవు వాని నభ
ద్రావహావ ర్తనుఁ దలఁపఁగ
నీవల పొప్పదు లతాంగి నెమ్మనమునకున్. 111

తే. తగనివస్త్రపు గోయనోయముగుద పెండ్లి
తోరమున వొప్పునీహస్తనీరజాత
మకట తొటు లోర్చు వలయీకృతాహి యైన

హారకరముతోఁ దదాదినకమాగమంబు. 112

క. శ్రీలవధూహంసాంకదు
కూలము రుధిరకణవర్షి కుంభిత్వచ మే
కాలమున నైనఁ గలయఁగఁ
బోలునె తలపోయు మీవ బుద్ధిం దరుణీ. 113

క. సాలక్తము లై మేడలఁ
బూల మెలఁగునీదుచరణములు తతకేశా
భీలపితృవనము మెట్టఁగ
నోలలనా శత్రుఁ డైన నొడఁబడఁ గలఁడే. 114

క. శ్రీచందనాస్పదము లగు
నీచనుల శ్మశానధూళి యెనయుటకంటెన్
నీచంబె య్యది చెపుమ త్రి
లోచనుపరిరంభ మెంతలోఁకువ యైనన్. 115

క. అది గాక మొదల నిది యొక
కొదవ యొదవు మదవుటేనుఁగు వహింపఁగఁ బెం
పొదవఁ దగుపెండ్లికూఁతురు
ముదిపసరము నెక్క జనులు పొడగని నగరే. 116

క. ఆకాంతిమదిందుకలయు
లోకాత్మజ్యోత్స్న వీవు లోలనయన యా
శ్రీకంఠుపొత్తుఁ గోరుట
శోకింపఁగఁ జేసి రకట చూచుజనములన్. 117

క. తనువు విరూపాక్షము పు
ట్టునఁ గన రా దేరికిం దిగంబరత నెఱుం
గ నగు ధనము వసులందుం
గనఁ దగినది యొద్ది గలదు కాంత వారునెడన్. 118

క. ఈదుష్కాంతు విడువు పొం
పెదుహారుం జేడ భద్ర ఏ వేఁడఁ గటా

వైదికయూపార్చనకై
పాడు వెవఁడు కాటిమొరడు సంపాదించున్. 119

క. అని పాఱుఁడు హరు దూఱఁగఁ
గనలునఁ గమ్మోవి వణఁకఁగా నాభూభృ
త్తనయ యుపాంతారుణ మగు
కనుఁగవ భ్రూకుటి నటింపఁగనుఁగొని తోడ్తోన్. 120

తే. ఆవటునిఁ బల్కు నీపల్కు లరసి చూడ
నీకు తత్త్వ మెఱుంగ వీ వింత నిక్క
మకట యతిలోక మవితర్క్య మామహాత్ము
చరిత మెఱుఁగంగ మందులు శక్తు లెట్లు. 121

క. భూతిరతులు స్వాపత్పరి
భూతిరతులు పలతురు శుభములు గా కేలా
భూతశరణ్యాని రాశున
కీతృష్ణాదూషితాత్మవృత్తులు శుభముల్. 122

క. ఆతఁడు బీదయు సంప
ద్ధేతువును శ్మశానచారి త్రిజగత్పతియుఁ
భీతిదరూపుఁడును శివుఁడు
నాతనితత్త్వంబు నెఱుఁగునట్టిరు గలరే. 123

క. ఉరగములు మెఱయునగలును
గరిచర్మము క్షౌమ మిందుకలయుఁ బునుకయుం
ధరియించువిశ్వకాయుని
శరీరమును నిశ్చయింప శక్యం బగునే. 124

క. అతనియొడలి నంటి పవి
త్రత నయ్యె శ్మశానధూళి తథ్యం బాదే
వతలును నృత్తాభినయ
చ్యుతతద్భస్మంబుఁ దాల్చుచుండరె తలలన్. 125

క. బీదయు వృషగుఁడు నగుశివు

పాదయుగము సమదదిగ్ద్వి§పము నెక్కఁ వృషం
డౌదల మ్రొక్కెడి కల్పక
పాదపనుమధూళి నెఱుపు § వడఁ జేయఁడొకో. 126

క. కానిపలు కాడుతలఁపున
నైన శివునిఁగూర్చి నిక్క § మాడి తొకటి యే
వానిని విధికినిఁ గారణ
మా నందురొ వానిపుట్టు § వరయం దరమే. 127

క. ఈవాదము చాలు హరుఁడు
నీ వనున ట్లగును గాక § నెఱి నామది త
ద్భావైకరసనిమగ్నము
త్సావిబుధా కామవృత్తి § సడి నరయఁడు గా. 128

క. వారింపు సఖి పెదవు ల
ల్లారి చెడిని మగుడ నెదియొ § యున నీతఁడు స
త్పూరుషుఁ డెగడునతఁడ కాఁ
డారయ నగుఁ బాపపాత్ర § మది వినునతఁడున్. 129

క. లేకున్నఁ బోదు నే నని
పైకొంగు కుచద్వయమును § బాయ గిరిజ ప్రా
స్వాకారముఁ గైకొని శివుఁ
డాకోమలిఁ బట్టె సస్మి§తాననుఁ డగుచున్. 130

క. వానిఁ గని మేను సెమరుపఁ
గా నుమ వణఁకుచును బోవఁ§గా లూనుచు మా
ర్గానుగతనగవ్యతికర
యానదివలెఁ బోదు నిలుప § దత్యాకుల యై. 131

క. ఇది మొదలు నీవు దపముల
ముదిత గొనినవరవృడ నని § ముక్కంటి యునన్
వదలెఁ దపఃక్లమ మాకుధ
రదుహిత యా సఫల మైన § శ్రమ మొకశ్రమమే. 132

క. ఆమీఁద దాత నాకా
భూమిధరుం డతని నడుగఁ బోఁగు ననుచున
న్కామారికి గిరిజ వయ
స్యాముఖమునఁ దెలిపెఁ దగ రహస్స్థలి నంతన్. 133
క. కామాహితతత్పర యా
వామ సఖీవ్యాహృతాత్మవరవాచిక యై
యామునిదారకై పరభృతి
కాముఖరరసాలయష్టిగతి నటఁ బొలిచెన్. 134
క. ఆకటికంఠుఁడు నట్లగుఁ
గాక యనుచు నెట్టకేని గౌరి విడిచి సు
శ్లోకులఁ దేజోమయుది
వ్యాకృతులను సప్తఋషుల నాదటఁ దలఁచెన్. 135
క. సభ మెంతయు నిజదేహ
ప్రభల వెలుఁగఁ దత్క్షణము పరాత్పరుఁ డగునా
ప్రభుముందటఁ దోఁచిరి ముని
విభు లేడ్వు రరుంధతియును వెనుకొని యుండన్. 136
క. తీరామరభూరుహసుమ
వారోత్కరవీచులును నవారణమదది
గ్వారణమదగంధులు నగు
సౌరధునీనీరములను స్నాతులు మఱియున్. 137
క. ముత్తెపుజన్నిదములు మేల్
పుత్తడిచీరలును రతనపుజపమాలల్
తత్తనులఁ దనర ప్రజ్యా
యత్తామరతరులభంగి నమరెడువారున్. 138
క. అరుణాధఃప్రస్థాపిత
హరివరుఁ డావర్జితధ్వజాంచలుఁ డగుభా
స్కరుఁడు నమస్కృతు లొనరిచి

పరికించెదునట్టిపరమపావనమతులున్. 139

క. ప్రళయమూపత్తిని దంష్ట్రా
వలితభుజాలతిక యైనవసుమతితోడం
గలసి మహాకిటిదంష్ట్రను
గలఁత పడక తవిలి శ్రాంతిఁ గాంచినవారున్. 140

క. సృష్ట్యకృతానంతర మవ
శిష్టం బైనట్టిసృష్టిఁ జేయుటచేను
త్కృష్టమనీషులు ప్రతన
స్రష్టలు వ్రా వీర లన యశముఁ గనువారున్. 141

క. పరిశుద్ధంబులు జన్మాం
తరభవములు పక్వము లగుతపములఫలముల్
కర మనుభవించును నన
వరతతపోనిరతు లైనవారును మునులున్. 142

క. అగునాన వ్రతులమ
ధ్యగత యయినసాధ్వి మూర్తిఁ దాల్చుతపస్సి
ద్ధిగతినిఁ దనరె నరుంధతి
మగనిపదాంబుజయుగంబుమాత్రము కనుచున్. 143

క. మానుల నాయెను శివుఁడు స
మానాదర మొప్పఁ జూచెఁ మగువ పురుషుఁ డన్
దీనిఁ గనఁ దగదు బుధులకు
మానితవృత్తంబు సూవెఁ మహితము జగతిన్. 144

క. తనమది నరుంధతీద
ర్శనమున దారార్థ మాదరము హెచ్చఁ త్రిలో
చనునకు ధర్మక్రియలకుఁ
గనుఁగొన సత్పత్ని మూలకారణము గదా. 145

క. శర్వుఁడు ధర్మువున కయినఁ
బార్వతినిఁ బరిగ్రహింపఁ భావింపంగాఁ

బూర్వాపరాధభీతిని
నిర్విణ్ణుం డై నమరుఁడు । నిట్టూర్పించెన్ 146

క. సత్పురుషు లనూచానులు
ముత్పులకితతనులు స ప్తమునివరు లంతం
దత్పరమేశ్వరునకుఁ ద్విజ
గత్పతి కి ట్లనిరి పూజ । గావించి తగన్. 147

క. ఏ మిచ్ఛ కవిషయం బగు
నీమది స్మరియింపఁబడుట । నిక్కంబుగ మా
మహోమాధ్యయనతపఃఫల
మోమాన్యా నేఁడు పరువ । మొందెం జుమ్మీ. 148

క. ఏవానిడెంద మందును
నీవు ప్రవర్తిలెదో వాఁడె । కృతివర్యుఁ డనం
గా వేదనిదానం బగు
నీవు మదిం దలఁచునతని । నెన్నఁ దలంచే. 149

క. తరణిశశాంకులకంటె ను
పరిపదముం బొంది మెప్పు । వడసితి మిపుడు నీ
స్మరణముకతనఁ దదుచ్చై
స్తర మగుపద మొందితిమి ని । జంబుగ నీశా. 150

క. నీమన్నన వడయుటచే
నే మధికుల మని తలంతు । మీశ్వర స్వగుణ
స్తోమము నెడ సజ్జనకృత
మామన్నన సూవె ప్రత్య । యంబుం గొలుపున్. 151

క. నీతలఁపునఁ బుట్టినమా
ప్రీతికొలఁది కొలఁదియె వివరింపంగ జగ
ద్వ్యాప్తాంతరాత్మ వగునీ
వే తెలియుదు గాక దాని । నిద్ధచరిత్రా. 152

క. నిన్నుఁ బ్రత్యక్షంబుగ నిటు

కనియును నీతత్త్వ మెఱుఁగఁగా లేము త్రిలో
చన నీకలరూపు దెలుపు
విన వలతుము బుద్ధి కది యవేద్యం బగుటన్. 153

క. ఈనీభాగము జగమును
మానుగ సృజియించునదియొ మఱి యుద్ధానిం
బూనునదియొ నశ్వరమును
గా నొనరుచునదియొ తెలియఁగా వలతు మజా 154

క. ఈమానం ప్రార్థన నొం
తే మహిత మ టుండ నిమ్ము దేవా త్వచ్చిం
తామంత్రితుల మయిన మే
మేమి యొనర్పంగ వలయు నిపుడ పనుపవే. 155

క. అని మానుల న
తనుకాంతిని నైజవిశదదశనద్యుతులం
బెనుపడఁ జేయుచు శివుఁ డి
ట్లనియెం బ్రియపూర్వకముగ నమ్మానులతోన్. 156

క. నాకొన్నివృత్తులైనను
నాకై కావనుట మీమనములకు విదితం
బే కద మదష్టమూర్తుల
యాకై వడివాఁడ ననుచు నెఱిఁగించుఁ గదా. 157

క. ఆనన్నుం బ్రార్థించిరి
దానవపీడితులు సురలు దనయునిఁ బడయన్
వానఁ గురియఁ దృష్ణాతుర
మై నవసినచాతకతతి యభ్రమును బలెన్. 158

క. కావున సుతుఁ బడయుటకై
గ్రావసుతఁ బరిగ్రహింపఁగా వలతును నేఁ
బావకసుముఖ్యభవమునకు
నై వేడుకపడినయష్ఠ యరణింబోలెన్. 159

క. నాకొఱకు మీర లందఱు
నాకమలాక్షిని గిరీశు నడుగవలయు ను
ల్లోకఘటితసంబంధము
వైకల్యముఁ బొంద కుండు వసుధాస్థలిలోన్. 160

క. స్థితిమంతుఁడు సున్నతుఁడును
క్షితిభారధరుండు నైన గిరిపతితో బం
ధుతనొందిన నన్ను నవం
చితునిగఁ దెలియుఁడు మహర్షి శేఖరులారా. 161

క. ఈపగిదిం గన్యార్థం
బాపర్వతపతినిఁ బలుకునది యన నేలా
మీపలుకులె యాచారము
లై పరఁగు నటంచు జగతి నార్యులు సెప్పన్. 162

క. ఆర్య యరుంధతియును ని
క్కార్యంబున మీకుఁ దోడుగా నుండును చా
తుర్యం బేవంవిధస
త్కార్యములఁ బురంధ్రులక జగానఁ దఱచుగన్. 163

క. కావున మహౌషధిప్ర
స్థావనిధరపురికిఁ గార్య మలవడఁ జేయం
బోవుఁ డిట మహాకోక్షీ
శైవలినీతటిని మగుడ సంగతి మనకున్. 641

క. యోగీశ్వరేశ్వరుం డగు
నాగంగాధరుఁడు పెండ్లి యాడఁ దలంపన్
వేగమ పరిగ్రహీత్రి
త్యాగు లయిరి బ్రహ్మపుత్త్రిలగునమ్మానుల్. 165

క. మునిగణ మాశివుపలుకులు
విని యౌఁ గా కనుచుఁ బయలువెడలె హరుండున్
మును నిర్దిష్టం బగునా

ధునీప్రపాతమును జేరఁ గ దోడన చనియెన్. 166

క. ఆమునిగణమును ఖడ్గ
శ్యామద్యుతి యగువిహాయసమున కెగసి యు
ద్దామమనస్సమజవమై
హైమవతీపితృపురంబు న న్నపుడ చేరెన్. 167

క. అమితధనరాశి నలకను
సమూలముగఁ బెఱికి యిచట స్థాపించిరొ నా
నమరాలయాతిరిక్తజ
నము వెడలిచి యిట నిలిపిరొ నాఁ దగుదానిన్. 168

క. దీప్యానేకమనోజ్ఞమ
ణిప్రాకారంబు సురధునీపరివృతమున్
వప్రాంతర్జ్వలితౌషధి
కాప్రకరము వరణమునను గడు రమ్యంబున్. 169

క. ఏనగరిని జితసింహము
లో నాగములు బిలయోనులో హయచయముల్
కానన దేవతలో చం
ద్రాననలు తురంగమాస్యయక్షులో పౌరుల్. 170

క. ఏవీట హర్మ్యఘనశిఖ
రావలిసంసక్తఘనమహాధ్వనిఁ దద్భ
ర్మ్యావాసాంతర్మురజవి
రావంబుల లలితతాళరవ మేర్పఱచున్. 171

క. ఏపురిఁ జలద్విటపపటు
సౌపర్వాణతరుల వేశ్మచయయంత్రపతా
కాపటలీప్రత్యగ్ర
శ్రీ పరఁగుంగడునయత్నసిద్ధం బగుచున్. 172

క. ఏపురమున స్ఫాటికహ
ర్మ్యోపానస్థలులయందు యామినులం దా

రాపంక్తి ప్రతిబింబము
లేపారు నుపాయనములకై యొసఁగ నెసంగన్. 173

క. ఎచట నభిసారికలు ఘన
నిచయావృతము లగుయామి నీవేళలఁ బో
వుచునుందురు రుచిరౌషధి
రుచితతిచే సిరులు వాఱిఁ ద్రోవ నిడేచ్ఛన్. 174

క. ఎట వయసు యౌవనాంతం
బెట మారునికంటె లేదు మృత్యు వెచట ను
త్కటతరసురతక్లమసం
ఘటితం బగునిదుర చావుగా వర్తిల్లున్. 175

క. ఏయెడ వ్రేల నదల్చుచు
భ్రూయుగ్మము ముడి వడంగ మోవి వణఁకఁ గో
పాయత్తతను బరాఙ్ముఖు
లౌ యువతులఁ దేఱుదనుకఁ బ్రార్థింత్రు ప్రియుల్. 176

క. ఏనిగమము బహిరుపవన
మై నవ్యానురాగలసదనాతపసుఖని
ద్రానుగవిద్యాధరవధి
కానీకము గంధమాదనాచల మెసఁగున్. 177

క. ఆమహీధరవరనగరము
నామానులుసూచి సురపురార్థజ్యోతి
ష్టోమాదికంబు వంచన
గా మానములఁ దలఁచి రథికకౌతుకమతులై. 178

క. లిఖితవ్యాలద్ధనంజయ
శిఖాచలజటాళి యాఖుపిప్రకరం బు
న్ముఖులై పణిహారులు గన
శిఖరిగృహాముని డిగ్గ శీఘ్రం బెనఁగన్. 179

క. ఈవిధమున నచట డిగి య

ఖావృద్ధాగ్రేసర మగుతన్మునితతి పా
థోవాప్తవిభాకరబిం
బావలి యొసకమున దర్శనార్హం బయ్యెన్. 180

క. ఆభవ్యు లిట్లు రాఁ బృథి
వీభృత్పతి పాదపద్మవిన్యాసనమ
ద్భూభాగుఁ డగుచు నర్ఘ్యవి
శోభితకరుఁ డరిగె దవులఁ జూచి యెదురుగన్. 181

క. ధాత్వరుణాధరతం బ్రాం
శుత్వంబున దేవదారుసుమహాభుజతం
దత్వమునన యుపలోర
స్కత్వంబునఁ దోఁచె నతఁడు క్ష్మాధరపతిగాన్. 182

క. పావనచరితుల మునుల య
థావిధిపూజితులఁ జేసి తద్గిరిపతి తాఁ
దోవను జూపుచు శుద్ధాం
తావాసము సేర్చె నయభయంబులు గదురన్. 183

క. మునుల నట లలితవేత్రా
సనములఁ గూర్చుండఁ బెట్టి సవినయముగఁ దా
నును గూరుచుండి తగ ని
ట్లనియెం జలిగట్టుదొరకృతాంజలి యగుచున్. 184

క. భావింప నపఘనోదయ
యావృష్టి యదృష్టకుసుమ మాప్రసవ మసం
భావిత మగుమీరాక మ
హావిద్వద్వంద్యులార యద్భుత మయ్యెన్. 185

క. పామరునిఁ బండితునిబలె
భూమి విడిచి దివికి నేఁగు పురుషునిఁ బోలెన్
హైమముబలె నాయసమును
నే మది ననుఁ దలఁతు మీరాయ హీనపుఁగరుణన్. 186

క. ఇది మొదలుగ నే భూతస
ముదయమునకు శుద్ధిపొంటెఁ బొందఁ దగిలి నె
య్యది సుజనాధిష్ఠిత మ
య్యది తీర్థం బనఁగఁ బరఁగు నన రే పెద్దల్. 187

క. మిన్నేటిపాటుచేత భ
వన్నవ్యక్షాళితాంఘ్రి వాఃపూరముచే
త న్నేఁ బరిశుద్ధులలో
నెన్నిక వడసితిని మునికులేశ్వరులారా. 188

క. స్థావరము జంగమం బనఁ
గా వెలసిననాదు రెండు కాయంబుల మీ
పావనచరణము లిడుటను
సేవలనుఁ వరుసఁ గరుణ సేసిరి గాదే. 189

క. మీమన్ననఁ బొడమి నిగుడు
నామోదముకొలఁది సెప్ప నలవియె దెసలన్
వ్యోమంబును మ్రింగెడు నా
ద్యామై నయ్యెలమి పట్ట దయ్యెం జుండీ. 190

క. ఇంతకు నే మీరల భా
స్వంతులఁ జూచుట గుహాంత సంస్థతమము కా
దంతస్థ్సరజఃపరతమ
మంతయు నెంతయును విచ్చె హర్షం బెసఁగెన్. 191

క. మీ కొకపని గలదే యటు
గాక కలిగనేని నదియుఁ గానిదె యీమీ
రాక దలపోయ నన్నుం
జేకొని యెంతయుఁ గృతార్థుఁ జేయన కాదే. 192

క. ఐనను ననుఁ గరుణించియొ
కానొకకార్యమునఁ బనుపఁగా వలతుచు భృ
త్యానీకమునకుఁ [illegible]

దైవవశమున కా యనుగ్రహం బరయంగన్. 193

క. ఇదె కులసతి యిదె మేమును
నిదె కులజీవితము కన్యయిం దేజన మె
య్యది సేయ వలయునో య
య్యది సెప్పఁడా యొండెడల నహినాథయ నాకున్. 194

క. అని సవినయముగ నగరా
జన నానినదంబు గవులయ వ్యాపించి ప్రతి
ధ్వనులమెసక మెసఁగఁగ న
య్యనఘుఁ డినుమాఱు పలుకునట్లులు తోఁచెన్. 195

క. పదపడి ముని లంగిరసుని
సదమలచారిత్రు నగ్రసరు వెస నాభూ
భృదధీశున కుత్తర మీ
ముదమునఁ బ్రేరేప నతఁడు భూధరున కనెన్. 196

క. ఇంతయు నుపపన్నం బగు
నింతకు నెక్కుడును గలదు హిమగిరివర నీ
స్వాంతోన్నతియును శిఖరా
త్యంతోన్నతియును సమానమై నెగడుఁ గదా. 197

క. స్థావరరూపుం డగువారి
నా వెలసితి నిక్కమే మహిఁ జరాచరభూ
తావలి కెల్లం బ్రదిగ
త్పావన నీపొట్ట యునికిపట్టగుఁ గాదే. 198

క. తామరతూఁడులవంటివి
పాము పడగల నెటులోపు భరియింపఁగ నీ
భూమి నహిజగము మొదలుగ
భూమిధరాధీశ నీవు పూనక యున్నన్. 199

క. పారావారతరంగా
వారితములు నవిరళప్రవాహంబులు నీ

స్ఫారధునీకీర్తులు శుభ
కారణములు లోకములకుఁ గడుఁ బావనతన్. 200

క. శౌరిచరణాంబుచే నిటు
లాకీతిగనే ద్వితీయమహాపుట్టునకుం
గారణ మగునీచే భా
గీరథి యెంతయును జగతిఁ గీర్తిత యయ్యెన్. 201

క. త్రైవిక్రమోద్యతుఁడు హరి
యావేళన విశ్వ మెల్ల వ్యాపించెను నీ
కావిధము సంతతస్వా
భావిక మై యొప్పుచుండుఁ బర్వతవర్యా. 202

క. హరిహయునిఁ దొట్టి క్రతుభు
గ్వరులనడుమఁ బదముఁ గొనినవాఁడవు నీచేఁ
గరము సురాలయచామీ
కరమయశృంగంబు వన్నెగాఁ జేయఁబడెన్. 203

క. తావకకఠినత యంతయు
స్థావరరూపంబునందు స్థాపించితి వీ
నీవపువు సత్పురుషసం
సేవాతత్పరము భక్తిచే నమ్రంబున్. 204

క. మావచ్చినకార్యము విను
మావిధి నీశుభముపొందు నయ్యెడు సుశ్రో
త్రావచనంబులు గలపుట
చే వం తప్పనిని మాకుఁ జేకూరుఁ జుమీ. 205

క. అష్టైశ్వర్యయుతం బ
స్పష్టాన్యపురుషము సార్థ హిమకరము మహో
త్కృష్టం బీశ్వరశబ్దము
శిష్టవరా యొజనునకుఁ జెల్లునొ జగతిన్. 206

క. విశ్వంభరాదిమూర్తుల
శశ్వత్కల్పితమిథస్స్వసామర్థ్యములన్
విశ్వము భరించు నెవ్వం
డశ్వంబులు మార్గమందు యానముఁ బోలెన్. 207

క. హృదయాంతర్వర్తిని నే
సదములవస్తువను యోగిజనవరయునో కో
విదు లెవ్వనిపదమును జె
ప్పుదు రావృత్తిభయరహితముగను నగేశా. 208

క. ఆకర్మసాక్షి వరదుఁడు
శ్రీకంఠుఁడు మాముఖమున స్త్రీజనమాన్యన్
నీకొమరిత యాచించెడి
నోకుధరాధీశ యెంతయుం బ్రియ మెసఁగన్. 209

క. వాకున నర్థంబుంబలె
నీకన్నియతోడఁ గూర్పు మిందుధరుని నీ
లోకమునఁ దండ్రి సద్వరుఁ
జేకూరిచి కూఁతు నెడలఁ జింతఁ దలఁగుఁగా. 210

క. సచరాచర మగులోక
ప్రచయం బీమెయెడ మాతృభావం బెపుడుం
బచరించుఁ గాక యంబర
కచుఁడు జగంబులకుఁ దండ్రి గాన నగేంద్రా. 211

క. పురహరున కెరఁగి తదనం
తరము సురేశాదిదేవతాతతి చూడా
భరణమణిరుచుల నీయమ
చరణంబులఁ జేయు వలదె శబలంబులుగాన్. 212

క. ఉమయఁట పెండిలికూఁతురు
హిమగిరియఁట దాత యర్థి లేమఁట వరుఁ డా
ప్రమథాధిపుఁడఁట యారా

విమలభవత్కులము కడుఁ బవిత్రం బయ్యెన్. 213

క. మఱియు స్తుతించియు నెఱఁగియు
నెఱుఁగఁడు స్తుత్యుండు వంద్యుఁ డే దేవుఁడో య
క్కఱకంఠున కీమె నొసఁగి
కొఱ దలఁగి జగద్గురునకు గురుఁడవు గమ్మా. 214

క. అని యంగిరసుఁడు వలుకఁగఁ
దనజనకునిపజ్జ లజ్జ దలకొన వినతా
నన యై యుమ తనచేఁ బూ
నినతమ్మిదళమ్ములను గణించుచు నుండెన్. 215

క. మహీధరపతి యియ్యకొనియు
గృహిణి యయిన మేనవదన వీక్షించె మహా
గృహిణులయనుమతిఁ గొందరు
గృహమేధులు కన్నె వరున కిచ్చెడు వేళన్. 216

క. పతియియ్యకోలు మేనా
సతియు మదిం దెలిసి తాను సమ్మతి నొందెన్
క్షితి మగలయిష్టములకుం
బతివ్రతాంగనలు మాఱుపలుకరు గాదే. 217

క. తదనంతర మాధరవరుఁ
డిది యే ప్రతివచన మంచు నెంచి వెస నుమా
సుదతిని భద్రాలంకృత
ముదమునఁ జేరంగఁ దిగిచి ముద్దిడి పలికెన్. 218

క. అక్షరుఁ డగునీశునకున్
భిక్షు వయినఁ బమ్మ రమ్ము ప్రీతిని మునిహా
ర్యక్షులు నిన్నడిగెద రిదె
యక్షయము గృహస్థఫలము నందం గంటెన్. 219

క. అని సుతను బల్కి మఱియున్
మునులఁ బలుకు ధరవరుండు మునులార మహా

శునిధర్మపత్ని యిదె మీ
కు నమస్కృతి సేయుచుండెఁ గొనుఁ డనువంతన్. 220

క. తమకోర్కికి ననుగుణ మగు
హిమవద్వచనమును బొగడి యెడఁద లలర న
య్యుమను మునులు దీవించిరి
విమలశుభోదర్కవాక్యవిభవం బెసఁగన్. 221

క. పుత్తడిసొమ్ములు జాఱఁగఁ
న త్తఱిఁ దన కెరఁగులజ్జ తానన నాభూ
భృత్తనయ నరుంధతి గడుఁ
దత్తఱమున నెత్తి యంకతలముం జేర్చెన్. 222

క. తనయాస్నేహమున నపుడు
కనుఁగవ బాష్పంబు లురులఁగా వందురుమే
న ననన్యపూర్వుఁడై నవ
రునిగుణములు పొగడి యయ్యరుంధతి తేర్చెన్. 223

క. అప్పుడు వైవాహికతిథి
నప్పరమర్షుల గిరీశుఁ డడుగుటయును వా
రిప్పటికిఁ జతుర్థదివన
మొప్పెడు నని చెప్పి నిర్గమోన్ముఖు లగుచున్. 224

క. గిరినాయకు వీడ్కొని స్మర
హరుఁ జేరి స్వకార్యసిద్ధియగుటఁ దెలిపి య
ప్పురహరునిఁ వీడ్కొని యం
బరతలమున కెగసి చనిరి పరమమునీంద్రుల్. 225

క. గిరిజాపరిణయపరుఁ డయి
హరుఁడు గడపె నెట్టకేని నాదినముల నీ
శ్వరు వశి నంటఁగ నవశుని
నొరు నెవ్వనిఁ జిక్కువఱుప కుండుఁగ వికృతుల్. 226

ఉ. నిర్గుణరూపధేయ మహనీయ నిరామయ నిష్క్రియా జగ

త్సర్గవినాశకారణ ప్రశోభానసమావృతలోకదూర దు
ష్మార్గజనానుఘస్మరశరా విబుధావనతత్పరా చతు
ర్వర్గఫలప్రదాయక నిరంజన నిష్కల నిస్సమాధికా. 227

క. ఓంకారవాచ్య పావన
రాంకృతిబీజాంకమంత్రరాజజపనిరా
తంకనిజభక్తమానస
పంకేజనివాస సతతపాలితదాసా. 228

మాలిని. శ్రుతిశిఖరవిహారా శుద్ధసత్త్వప్రచారా
సతతశుభవిచారా సర్వలోకైకవీరా
దితిజహాననఖేలా దేవరక్షావిలోలా
నతజనపరిపాలా నవ్యజీమూతనీలా. 229

గద్యము. ఇది శ్రీమద్వేంకటస్వామిరాట్పౌత్ర తమ్మయరాట్కవీంద్రపుత్ర విబుధవిధేయ వేంకటసూర్యప్రసాదరాయ ప్రణీతంబైన నిర్వచనకుమారసంభవమహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీ

రామచంద్రపరబ్రహ్మణే నమః.

# నిర్వచనకుమారసంభవము.

## తృతీయాశ్వాసము.



శ్రీసంపాదనదురితని
రాసనచణకరుణ నిర్మలాంతఃకరణా
యాసేచనకాంగ ఖలదు
రాసదసంగా తమోవిరామా రామా. 1

తే. అవధరింపుము పిదప హిమాద్రి శుక్ల
పక్షదినములు వెలయ సబంధు వగుచుఁ
గలితజామిత్రశుద్ధిసమ్మిళితలగ్న
తిథినిఁ బుత్త్రిక పెండిలిదీక్షఁ బూనె. 2

క. తరుణు లనురక్తిఁ బ్రతిమం
దిరమునను వివాహవిధులు దీర్చుటకై వే
గిరపడి తిరుగుదు నొకయిలుఁ
బురుడించె గిరీశునంతిపురముం బురమున్. 3

తే. రాజవీథులఁ దనరుస్వర్యాభజములను
బట్టవాసఃకృతధ్వజపటలములను
స్వర్ణతోరణరుచుల నెసంగె నప్పు
రంబు రెండవనాకపురంబువ్రోలె. 4

క. వరుఁ బొందెడు నని పుత్త్రిలు
వరఁగుచునుండినను నుమయ ప్రాణం బర్యోం
జిరదృష్టవ్రాలె మడిసియు
మరలం బొడసూపుదాని మాడ్కిఁ బితలకున్. 5

క. తొడనుండి తొడకుఁ దిగుచుచుఁ
దొడవుల దీవనలగములతో నొసఁగుచు న
ప్పుడు గిరిపతిచుట్టలు దమ
కొడుకులకంటెను గరంబు కూరిచి రుమకున్. 6

క. చందురుఁ డుత్తరఫల్గునిఁ
బొందఁగ మైత్రసుముహూర్తమున నయ్యుమమైఁ
గొందఱు పతిసుతవతు లగు
నిందుముఖు లలంకరించి రెసక మెసంగన్. 7

క. సితసర్షపయుతదూర్వా
తతి గొని నిర్మాభపటముఁ దాలిచి శర మా
దృతిఁ జేకొని యభ్యంగ
ప్రతికర్మ మలంకరించెఁ బార్వతి యాతన్. 8

క. నవదీక్షావిధిశర మ
న్నవలారతనంబు పూని నలినప్రియునం
శువుచే బహులాంతంబున
రవణ మెఱయుచంద్రరేఖ రమణం దనరెన్. 9

క. తైలంబు పూసి మెయి నా
పై లొద్దుగపిండి నలిచి పసఁతులు శుష్య
త్కాలేయ మలఁది జలకపుఁ
జేలముఁ గట్టించి చవికఁ జేర్చిరి గిరిజన్. 10

తే. ముత్తెపుఁదోరణముల సముజ్జ్వల మగు
విమలవైడూర్యమణిమయవేది నగజ
నునిచి వనితలు కనకకుంభోదకముల

జలక మార్చిరి తూర్యనిస్స్వనము లెసఁగ. 11

క. ఉమ జలకము లాడి ధవ్రా
ద్గమనీయాంశుకముఁ దాల్చి ధారాధరనీ
రమునఁ దడిసి విస్ఫుటశర
సమితిం దనరారుధరణి చాడ్పున నొప్పెన్. 12

తే. సతులు పిదపఁ జతుర్మణి స్తంభములను
మేలిమేల్కట్టుపనుల నమేయభంగిఁ
దనరు కౌతుక వేదిమధ్యమున గిరిజ
నునిచి రెలమి మహోన్నతాసనముమీఁద. 13

క. వనిత నటుఁ దూర్పు మొగముగ
నునిచి యెదురఁ గూరుచుండి యుగ్మలులు ప్రసా
ధన మున్నను క్షణ మూఱక
కనుచుండిరి సాజ మైన కలికితనంబున్. 14

క. తెఱవ యొకతె దూపం బిడి
తుఱుమునతడి యార్చి విరులు దుఱిమి యెడనెడం
గఱిక గలయిప్పవిరిసరి
గిఱికొనఁగా ముడిచె నపుడు గిరిజ నెఱికురుల్. 15

క. గారాగురు విడి సతిమెయి
గోరోచనపత్త్రరచన గుదురుపఱుపఁ జ
క్రారూఢపులిన యుగభా
గీరథిచెలువమును దెగడి గిరిసుత యొప్పెన్. 16

క. ఎలతేంట్ల నొప్పుతమ్మిని
జలధర రేఖం దనర్చు శశిబింబము న
వ్వలఁ దోఁచి తీర్చునలకల
నలరారునుమాస్య ముపమ యనుపలు కడఁచెన్. 17

తే. అమలగోరోచనా లేపనారుణంబు
లోధ్రకకషాయరూక్ష మాలోలనయన

చెక్కులికిఁ గ్రొత్తవన్నెలు। సేసి జనుల
యక్షుల హరించె శ్రవణయ।వాంకురంబు. 18

తే. మధ్యరేఖావిభక్తంబు। మహితసిక్థ
సదమలీకృతరాగ మా।సన్నచారు
తాఫలం బగునావ్యక్త। తనువు మోవి
స్ఫురణముల నొకానొకరుచి।స్ఫురణఁ దాల్చె. 19

క. చరణముఁ గైసేయుచు నొక
తరుణి సఖి యీపదమున। ధవుముకుటసుధా
కరుఁ దన్ను మనఁగ నుమ క్రొ
వ్విరిసరి మార్పలుకు లేక। వ్రేసె నిజసఖిన్. 20

క. లలితోత్పలదళసదృశం
బుల నాయెలనాగకనులఁ। బొడగాంచి మహో
జ్జ్వలకర మని కా దిది మం
గళకర మని పెట్టిరపుడు। కజ్జలము చెలుల్. 21

తే. సంభవత్పుష్పయుగుతీవ। చందమున స
ముద్యదుడురాజి యగు రేయి।పోల్కి లీయ
మానవిష్కర యగునది।మాడ్కి నపుడు
ధార్యమాణవిభూషణ।ధరజ దనరె. 22

క. తనుసమలంకృత నచలన
యన యై యచ్చెల్వ నిల్వు।టద్దమునఁ గనుం
గొని హరుఁ జేరఁగఁ ద్వరపడె
వనితలకై సేఁతఫలము। వరుకాన్పె కదా. 23

చ. హరిదళముల్ మనశ్శిలయు।నంగుళికాద్వయిఁ బూని మేనయ
గ్గిరిసుతదంతిదంతదళ।కీలితకర్ణము మోము నెత్తి భూ
ధరజకు చోదయస్థితి మొ।దలొల్కని వర్ధిలినట్టికోర్కి యై
పరఁగెడుపెండ్లిబొట్టు సుత।ఫాలమునం దిడె నెట్టకేలకున్. 24

తే. మఱియు బాష్పాకులాక్షి యై। మాత ఫేన

యొండుకడఁ జేర్చ దాది తదుచితదేశ
మునకు వ్రేఁగుల నడపంగఁ దనయచేతఁ
బట్టు పెండ్లితోరంబును గట్టె నపుడు. 25

క. ఆరమణి దుకూలంబు ను
దారాదర్శంబుఁ దాల్చి తగియె సఫేన
క్షీరాబ్ధివేలఁ బూర్ణని
శారాజలసచ్ఛరన్నిశం బురుడింపన్. 26

క. సుతను గులదీపికను గిరి
పతిసతి కర్త్యోపదేశపారగకులదే
వతలకు నెఱఁగించి పతి
వ్రతలకు మ్రొక్కించె మేన క్రమముగ నంతన్. 27

క. ఎడలేని మగనినెయ్యము
వడయుము నాతల్లి యనిరి పతిదేవత లా
మృదుసామేనిం గొనున
ప్పడఁతి సతులదీవన లొక ప్రక్కకుఁ ద్రోచెన్. 28

క. కోరికకు సిరికిఁ దగ నా
నారీమణి కుత్సవం బొనర్చి కృతి సభా
స్తారుం డచలపతి సుహృ
త్పూరితసభ వేచుచుండెఁ బురహరురాకన్. 29

ఆ. అపుడు రజితగిరిఁ దదాదివివాహోచి
తం బయినప్రసాధనంబు దెచ్చి
ముదము వ్రేదల నునిచెఁ బురవినాశనుఁ డైన
శర్వమోౢల మాతృసప్తకంబు. 30

క. మాతృకలమీఁది మన్నన
భూతేశుం డపుడు దాని ముట్టుకొనియె న
ప్పూతాత్మునివేసము పరి
ణేతకుఁ దగువేస మయ్యె నిముసములోనన్. 31

క. అది యెట్లన భసితంబ వి
శదలేపన మయ్యెఁ బునుక స్వర్ణముకుటసం
పద నొందె రోచనాల
క్ష్మదుకూలం బయ్యె హస్తిచర్మము మఱియున్. 32

క. ఫాలాంతర్జ్వలితము మ
ధ్యాలోలవిశాలపింగలామలతారం
బాలోచనంబ వరహరి
తాలాత్మకతిలక మయ్యెఁ దక్షిణమాత్రన్. 33

క. నిడుపడుదారగమి మున్ను
న్నెడన నిలువ దానియొడళులే బంగరుబల్
తొడవులుగ మాఱె జిగి గల
పడగలరతనములు దొంటిపగిదిన తనరెన్. 34

క. పవలును జిగి సెడక చిఱుత
యవురుట గుఱుతు కప్పు లేక యలరుశశి సతం
బవతంస మగుచు వెలుఁగఁగ
శివునకు ముకుటమణి వేఱఁ జెప్పఁగ నేలా. 35

క. ఇటు స్వప్రభావతక్షణ
ఘటితవిభూషణుఁడు చిత్రకర్మనిపుణుఁ డా
నిటలాక్షుఁడు తనరూపు ని
కటసంస్థగణోపనీతఖడ్గమునఁ గనెన్. 36

తే. పిదప బెబ్బులితోలు గప్పినమహోక్షు
మందు నందిచే యూఁది యయ్యిందుధరుఁడు
బత్తి నది వంగ రజతాద్రిపై వసించు
పగిది వసియించి ముఖమున బయలువెడలె. 37

తే. అపుడు వాహనరంహశ్చలావతంస
లగుచు సుషమాపరాగారుణాననముల
నింగి కెందామరకొలంకుభంగిఁ దోఁప

సప్తమాతృక లేఁగి రీశ్వరుని వెనుక. 38

క. కనకప్రభ లగువారల
వెనుకఁ బునుక లూని కాళి । వెలఁగ బలాకల్
తనమ్రోల మెలఁగ మెఱుఁగులు
మునుమున వడిఁ జిమ్ము కారు । మొయిలువిధమునన్. 39

క. గణములు సఱచినభేరుల
రణన మపుడు ద్యోవిమాన । రాజిస్థమరు
ద్గణములకు మధితసుమమా
ర్గణుసేవకు సమయ మిదియ । రం డని తెలిపెన్. 40

క. దినకరుఁడు త్వష్ట నిర్మిం
చిన వెలిగొడు గపుడు పట్టె । శివున కది శిరం
బున పొంతఁ దనర మస్తక
వినిపతదభ్రాపగుబలె । వృషహయుఁ డొప్పెన్. 41

క. గంగాయమునాయుగళి ధృ
తాంగి వెలసె వీజనముల । హరుఁ గొలుచుచుఁ ద
ద్రంగత్ప్రవాహరూపా
సంగత యయ్యును సహంస । సంచారగతిన్. 42

క. ఆవృషభధ్వజు నత్తఱి
శ్రీవత్సాంకుఁడును విధియుఁ । జేరి జయజయా
రావములఁ బొనిచి రతనిప్ర
భావమును హవిస్సుచేతఁ । బావకునిబలెన్. 43

ఆ. మూర్తి యొకఁడ యట్లు । మూఁడయ్యె వానికిఁ
బిన్న పెద్దతనము । లెన్న సున్న
హరికి విధియు విధికి । హరియును వారికి
హరుఁడు వారు హరున । కాద్యు లరయ. 44

క. కలితస్వోచితలక్షణ
ముల విడచి వినీతవేష । ములతో నాఖం

కలముఖముకుర లత్తతిఁ బ్రాం
జలు లతని కెరఁగిరి నంది సందర్శితు లై. 45

క. హరినిఁ బ్రణయవచనంబున
శిరఃప్రకంపమున విధిని స్మితమునను బురం
దరు సురలఁ జూడ్కు లన యీ
శ్వరుఁ డపుడు యథోచితముగ సంభావించెన్. 46

క. తనదుపురస్థలి జయజయ
యని సప్తర్షులు వచింప హరుఁ డను మీరల్
మును నే నీపరిణయసవ
మున వలచినఋత్విజు లని మునిముఖ్యులతోన్. 47

క. ఆవృషభకేతనుఁడు వి
శ్వావసుముఖు లపుడు త్రిపురజయమును వీణా
ప్రావీణ్య మెసఁగఁ బొగడఁ ద
మోవికృతివిదూరుఁ డధ్వమును గడచి చనెన్. 48

చ. గణగణమంచుఁ గంఠగతకాంచనమంజులకింకిణీలస
త్క్వణనములొప్పఁ బ్రోతజలదంబులుకొమ్ములుతీరభూవిదా
రణధృతపంకముల్బలె విరాజిలఁ జిమ్ముచు నప్డు పుష్పమా
ర్గణహరు మోచి వాహము త్వరం జని యొం దివిఖేలగామియై.

తే. ఇట్లు పరు లంట రానిగిరీశుపురము
రెండుగడియలలోఁ జేరె వృషభవాళి
హారపుగోగదృక్కాంతము లనుపసిండి
పగ్గముల లాగఁబడుదానిపగిదిఁ దనరి. 50

క. హరుఁ డాపురిప్రాంత సెలమిఁ
బురజనులు మొగంబు లెత్తి పాడగనుచుండన్
ఖరనిజశరచిహ్నం బగు
తెరువున వెస డిగ్గి తత్ప్రదేశముఁ జెందెన్. 51

క. కుంచిత బాంధవ పూరిత

కుండలఘటనలతోఁ డ ౹ స్ఫుటవిటపినిబో
ద్దండకటకములతోఁ బలెఁ
గొండలదొర గిరిశు నెదురుకొనియె ముదమునన్. 52

క. సురశిఖరి వర్గయుగమును
బురవివృతద్వారమందు ౹ భూరినినదసం
భరిత మయి కలసె క్షతబం
ధురసేతుర్ఘురద్వయంబుతోఁ నెన యగుచున్. 53

క. సర్వజగద్వంద్యుఁ డపుడు
శర్వుఁ డెరఁగ సిగ్గు వడియు ౹ శంకరు మహిమం
బూర్వము వంచినశిర మ
ప్పర్వతపతి యెఱుఁగఁ డయ్యెఁ ౹ బదపడి యెలమిన్. 54

క. ఉల్లంబు పల్లవింపఁగ
నల్లునిమునుమునన నడచు ౹ చాగిరిపతి సం
ఫుల్లసుమాకీర్ణాధ్వము
నల్లన నిజపురముఁ జేర్చె ౹ నాజగదీశున్. 55

క. ఆసమయంబున హరుఁ గను
నాసఁ బురీతరుణు లెల్ల ౹ నమలమణిమయ
ప్రాసాదరాజి నీగతిఁ
జేసిరి చెయ్దములు త్యక్తచేష్టాంతర లై. 56

క. వడి జాలముఁ జేరఁగఁ జను
పడఁతి యొకతె మాల్య మూడి ౹ పడ వీడ్వడు కొ
మ్ముడి ముడువఁ జేతఁ బట్టియు
ముడువం బట్టుటయు మఱచె ౹ మోహితమతి యై. 57

క. లలన యొకతె కై సేసెడు
చెలిచేతిపదమ్ముఁ జిమ్మి ౹ శీఘ్రగతుల ని
గ్గలదార్ద్రపాదలాక్షా
కలితాయన యగుచు జాలకముఁ జేరఁ జనెన్. 58

క. కుడికంటికిఁ గాలాంజన
మిడి డాకంటికిని నిడక యింతి యొకతె యా
వడువునన చేరె నప్పుడు
వడిగ శలాకను వహించి వాతాయనమున్. 59

క. నడచునెడ సడలునీవిం
బడఁతి యొకతె చూచువేడ్కమైఁ గట్టక చే
తొడవుల క్రొంజిగి నాభిం
బడ నయ్యెడ సంభ్రమమునఁ బట్టక పట్టెన్. 60

క. వడి లేచి యొక్కసతి వెత
నిడు నడుగడుగునకు డొల్ల నిలపై మణు ల
ప్పడఁతి యరగ్రుచ్చురశనక
మ్మృదుఁ గనుఁగొనుసరికిఁ ద్రాడె మిగిలెను వ్రేలన్. 61

తే. సాంద్రకౌతూహల లగునా చంద్రముఖుల
మద్యగంధులు లోలాక్షి మధుపములును
నగుమొగంబులఁ గూడి జాలాంతరములు
పంకజాలంకృతంబుల పగిది నొప్పె. 62

క. ఇందుధరుఁడు వెన్నెలఁ బవ
లుం దత్పురసౌధరుచి వెలుఁగఁ జేయుచుఁ జే
రెం దోరణకేతనగణ
సుందరరాజపథ మపుడు సురగణయుతుఁడై. 63

క. హరరుచిరమూర్తిఁ గన్నులఁ
దరుణు లెలమిఁ గ్రోలు చొందు తలఁపర యపు డా
గరితల శేషేంద్రియవృ
త్తి రహింప జక్షువును జేరి తీరున నొప్పెన్. 64

చ. అతిసుకుమారి యయ్యును చలాచపుగాదిలిపట్టి యీమహా
న్నతునకుఁగా మహాతపమొనర్చుట యెంతయు నొప్పినట్టి యీ
శితిగళుదాస్య మైనఁ గల చేడియయే చరితార్థ యన్న నో

నితనిపృథూరు వెక్కుతర శైకుణ వేణి వచింప నేటికిన్. 65

తే. త్రిజగతీమోహను లగునీ స్త్రీపురుషుల
నొండొరులతోడఁ గూర్పక యుండెనేని
నిట్టిమవ్వంపురూపుల సృష్టిసేయు
బ్రహ్మశ్రమ మెల్లఁ దలఁప వ్యర్థంబ కాదె. 66

క. విరివిల్తుని నెమ్మే నీ
హరుతీవ్రరుషాగ్నిఁ గ్రాఁగె నందురు గాద
మ్మరుఁ డితనిసొబగు గని సి
గ్గరి యై తా మేను విడిచెఁ గాకని తలఁతున్. 67

క. మును మదిఁ దనకోరినయీ
తనిచుట్టఱికంబ పొంది ధరవరుఁడు శిరం
బును ధరణీధరణోన్నత
మును గడుఁ బై కెత్తి తిరుగుఁ బోయుఁకఁ జెలియా. 68

క. అని గిరివరనగరతరుణు
లనుకర్ణరసాయనోక్తు లాలించుచు న
య్యనఘుం డంగదచూర్ణిత
ఘనలాజము శైలపతియగారము సేరెన్. 69

తే. తద్గృహంబున విష్ణుకై దండఁ బూని
శారదాభ్రము డిగ్గుభాస్కరునిమాడ్కి
హరుఁడు వృషభంబు డిగి విధి తెరువు సూప
గ్రావపతిగృహకక్ష్యాంతరములు గడచె. 70

క. హరిహయముఖామరులు స
ప్తఋషిప్రభృతు లగుమానిపతులు గణములున్
హరుతో గిరియిలు సొచ్చిరి
వెరవున శ్రేష్ఠార్థతతుల విధమున సంతన్. 71

తే. అచటఁ దగురీతిఁ బీఠంబు నధివసించి
యీశుఁడు సమంత్రకముగ గిరీశుఁ డొసఁగు

నర్ఘ్యమధుపర్కమంజులానర్ఘ్యమణిదు
కూలములఁ బ్రీతితోడఁ జేకొనియె నవుడు. 72

క. హరు క్షౌమధరుని నంతట
పురజనము వినీతి గిరిజ పొంతను జేర్చెం
దరుణశశిఘృణులు ఫేనో
త్కరరుచిరాంబుధిని వేల దరిఁ జేర్చుగతిన్. 73

తే. ఆవివృద్ధాస్యశశికాంతి నైనయుమను
వరశరల్లక్ష్మి లోకంబు కరణిఁ గలసి
యమలహ్లాదయోదకుఁడు విస్ఫుటాక్షికుముదుఁ
డయ్యె నయ్యిందుమౌళి యయ్యవసరమున. 74

క. వెరయునెడ జడిసి తిరుగుచు
మరలఁ గదిసి కొంతవడికి మరలుచును బర
స్పరలోలము లై గిరిజా
గిరిశుల చూడ్కులు త్రపాబ్ధి గిట్టికొని మునిఁగెన్. 75

క. గిరిజమెయి భీతి నణఁగిన
మగుని మొనటియుంతురంబు మాడ్కి దనరుభూ
ధరసుతచే నరుణాంగుళి
గిరిశుండు గ్రహించె నపుడు గిరిగురుఁ డొసఁగన్. 76

క. గిరిసుతమై గరుపాటెను
హరువేళ్లఁ జెమటు పుడమె నయ్యెడ సరిగాఁ
గరసంస్పర్శము వారల
స్మరవృత్తము నేర్పరించు చాడ్పున నొప్పెన్. 77

క. పరిణయముతఱి వధూవరు
లొరు లెవ్వరిదరిని నిలిపి యుసుకాంతిని గాం
తురొ యట్టియుమేశ్వరులకు
నిరువురకుఁ శోభకలిమి యెన్నఁగ నేలా. 78

క. జ్వాలదగ్నికి నమ్మిథునము

వలగొను చొండొంటిఁ గలసి వరకాంతిసము
జ్జ్వలకనకనగోపాంతం
బులఁ దిరుగుదివానిశంబు పోల్కిం దనరెన్. 79

క. మైమై తాఁకునఁ జొక్కుడు
నామిథునము మూఁడుసారు లట్లు వలగొనం
గా మహీధరగురుఁ డుమ చే
హోమము చేయించె లాజ లుజ్జ్వలదగ్నిన్. 80

తే. గురునిపనుపున నాలేమ సురభిలాజ
ధూమమును దోయిలించి నెమ్మోముఁ జేర్చె
నది కపోలవిస్తృతశిఖ మై ముహూర్త
మువిద చెవి నల్లగల్వచెలువు వహించె. 81

తే. హోమధూమము మోము నాలేమ సేర్ప
జిగిఁ గులుకుచెక్కులను జిఱుచెమట గ్రమ్మెఁ
గన్నుఁగవనుండి దిగఁ జాఱెఁ గజ్జలంబు
పొరిని వాడె శ్రవోయవాంకురము కరము. 82

క. గురుఁ డపుడు గిరిజ కనుఁ ద్వ
త్పరిణయమునఁ గర్మసాక్షి దహనుఁ డిదె పతిన్
హరుని గలసి యిఁక ధర్మా
చరణము నీ కెలమిఁ జలుపఁ జను నని యంతన్. 83

క. రాణం జెవులారఁగ శ
ర్వాణి గురునియవ్వచనము ద్రావె నిదాఘా
క్షీణోష్మలతాతప్త
క్షోణి ఘనప్రథమజలముఁ గ్రోలువిధమునన్. 84

క. ధ్రువుఁ డగుపతితో నయ్యుమ
ధ్రువుఁ గను మని గురుఁడు వలుకఁ దొరపులజ్జా
వివశత సన్నపు తెలుఁగున
సువదన వదనాబ్జ మెత్తి చూచితి ననియెన్. 85

తే. ఇట్లు శాస్త్రజ్ఞుఁ డగుపురోహితుఁడు పెండ్లి
కార్య మంతయు దీర్చ లోకపిత లైన
యయ్యుమామహేశ్వరులు పద్మాసనస్థుఁ
డగుపితామహునకు మ్రొక్కి రతివినీతి. 86

క. అతఁడు గను మబల వీరుని
సుతు నని దీవించె శైలసుత నవ్విధి వా
క్ప్రతి యయ్యు మహేశ్వరునెడ
మతిఁ గలయాశాస్త్రచింతమాన ము పూనెన్. 87

తే. విమలమణిమయచతురస్రవేదిమీఁది
యుదిరిగద్దియయందు నయ్యుమయు హరుఁడుఁ
గూరుచుండఁగ లౌకికాచార మగుట
నపుడు తెఱదీసి బ్రాల్ సల్లి రచటివారు. 88

క. దళములకొనలను వ్రేలెడు
జలకణములు ముత్తియములచాలుఁ దెగడ రా
జిలుతమ్మిగొడుగు దీర్ఘా
మలనాళము వారిపై రమాసతి పట్టెన్. 89

క. ఆసమయంబున నట భా
షాసతి యీశ్వరుని నుమను సాంస్కృతికవచ
శ్శ్రీసరణిని బ్రాకృతవా
చాసరణిని నుతి యొనర్చె సరసతరముగన్. 90

తే. వివిధసంధిస్ఫుటీకృతవృత్తిభేద
మంచితాంగహారంబు రసానుకూల
రాగ మానాటకం బప్సరలు నటింపఁ
జూచిరి ముహూర్త మప్పు డీశుండు నుమయు. 91

క. సుర లది సెల్ల సభార్యుని
హరుఁ జేరి నమస్కరించి యాదటఁ బ్రార్థిం
చిరి శాపాంతసతనుఁ డగు

స్మరునిఁగొలువుఁ గొనఁ గిరీటసక్తాంజలులై. 92

ఆ. కనలు విడిచి శివుఁడు తనమీఁదనైన నా
స్మరుఁడు శరము లేయ సమ్మతించె
దగినసమయ మరసి తజ్జ్ఞులు దొరలతోఁ
జేయువిన్నపంబు సిద్ధిఁ బొందు. 93

క. సురల విడిచి పిదప మహే
శ్వరుఁ డుమఁ జేఁబట్టి భక్తిచారుతరము భా
స్వరహాటకకుంభము భూ
విరచితతల్పంబు శయనవేశ్మముఁ జేరెన్. 94

ఉ. ఆసదనంబునందు నచలాత్మజ నూత్నవివాహజాతల [గే
జ్జాసముపేత యై మొగము శంకరుఁ డెత్తఁగఁ ద్రిప్పికొంచుఁ
లీసఖు లెంతపిల్చినఁ బలుకక పల్కక యున్నఁ జూచి తా
నాసతి నవ్వఁ జేసె నిటలాక్షుఁడు భృంగివికారచేష్టలన్. 95

క. గిరితనయ వివాహానం
తరమున శంకరునిఁ జూచి తనసాధ్వసభా
వరసాత్త్విక యగుట మనో
హరము స్మరోద్దీపకంబు నగుసుఖ మందెన్. 96

క. పిలిచినఁ బలుకదు చేలాం
చలము గొనఁ జనం గడంగు శయ్యను మొగ మ
వ్వల గాఁగఁ బండు నక్కో
మలి యిట్టిద యయ్యు హరుని మనంబున ముంచెన్. 97

క. కుతుకంబునఁ బతి కూరుచు
గతి నుండఁగ సతిని కభిముఖంబుగ నవ్వా
ర్వతి కనులు విప్పి నవ్వుచుఁ
బతి గనఁ దటిదాహతాముల పగిది ఘూయున్. 98

క. నీవిధరి హరుఁడు కర మిడఁ
గా వణఁకుచుఁ జేయి పట్టె స్నిగ్ధరసుత యూ

హై పీఁటఁ దనంతన యా
భావిని నీవియును సురత ౯ పరవశత మొయిన్. 99

క. చెలి యీగతి వెలువటి హారు
నలరింపు రహస్యమందు ౯నని కలిపినదె
చ్చెలులపలుకులను మఱచె న
చలసుత ప్రియుఁ గని ప్రభాత ౯సాధ్వసమతి యై. 100

క. అనవసరంబుగ నెద్దియొ
తను నడిగెడుహారునిపలుకు ౯ తనచూడ్కులఁ జే
కొని యగ్గిరిజ శిరశ్కం
పనరూపోత్తర మొసంగు ౯ మదన హారునకున్. 101

క. చేలముఁ గొనఁ గరయుగమున
శూలికనులు మూసె శైలు౯సుత పదపడి త
త్ఫాలాక్షిదృష్ట యయ్యు య
బ్బాలామణి విఫలయత్న ౯పరవశ యయ్యెన్. 102

తే. చుంబనాద త్తరుచిరోష్ఠ ౯బింబ మదయ
తరపరీరంభణ స్తబ్ధ ౯కరము దుష్క
ర ప్రతిక్రియ మవ్వధూ ౯రతము హారునిఁ
గ్లిష్టమన్మథ మయ్యు సం ౯తుష్టుఁ జేసె. 103

తే. అక్షతంబుగఁ గెమ్మోవి ౯ యానుటయును
నవ్రణంబుగఁ గొనగోళ్ళ ౯ నంటుటయును
సకరుణంబుగ స్మరకేళి ౯ సల్పుటయును
నోర్చు నయ్యును తదితర ౯ మోర్చ దయ్యె. 104

క. ప్రాతఃకాలమున నయ
న్యాతతి తను రాత్రివృత్త ౯ మఃగంగ మదిఁ
వే తెలుపఁ గడఁగియును ద
త్కౌతుకమును దీర్చ లేద ౯ గ్రాపజ లజ్జన్. 105

క. రతిపదము లద్దమున న

య్యతివ గమచు వెనుక నిలుచు హారుబింబము స్వ
ప్రతిబింబము పజ్జం గని
యతిలజ్జ నదేమొ యేమొ యపు డొవరించెన్. 106

క. తల్లి హారభుక్తయూవన
నుల్లాసిని సుతను గాంచి యూఱడి సంతో
సిల్లెం గన్నియ ధవునకు
వల్లభ యై కాదె తల్లి వంతం బాపున్. 107

క. పిదప హారుఁడు కొన్నా ళ్లా
సుదతి నడపె నెట్టకేని సురతంబున న
మ్మదవతియును నానాఁటికి
మదనరసం బెఱిఁగి రతిని మానె నసహాతన్. 108

క. పతి కౌఁగిలింపఁ దానును
నతనిఁ గవుఁగిలించు మోవి యతఁ డానఁగ స
మ్మతి నొందుఁ గాని యూగిరి
నుత నీవిం జేరనీదు శూలికరంబున్. 109

తే. ఇట్లు కొన్నాళ్లు సన నయ్యు మేశ్వరులకు
నొండొరులయందు నిమిషవియోగ కాత
రంబు భావజ మప్రియ రహిత మమిత
చాటుకలితంబు నగుప్రేమ నాటుకొనియె. 110

క. ఇతరేతరసదృశులు వా
రితరేతరసదృశముగ వహించిరి రతి వా
పతిని విడిచి గంగ మను నె
యతఁడును దన్ముఖరసప్రియాత్మకుఁడు గదే. 111

క. దక్షిణ గణిగుగు వగునిట
లాక్షున కగ్గిరిజ శిష్యరాలగుటను ద
చ్ఛిక్షితరతినిపుణత గురు
దక్షిణగా నొసఁగె సురతదక్షత వెలయున్. 112

క. హరుఁ డాని విడుచుమోవిని
ధరనుత వేదమ్ములను వెత న్వదురుచుచుఁ
గిరిశశిరోహిమకరహిమ
కరములఁ జల్లార్చు క్షణము గౌరియ ప్రోవన్. 113

క. లలితాధరచుంబనపత
దలకరజోహతలలాట జాక్షిని హరుఁ డు
జ్జ్వలకమలగంధి యగున
య్యెలనాగముఖానిలమున కెదురుగ నుంచున్. 114

క. ఇమ్మెయిని వివిధసురతసు
ఖ మ్మొందుచు ననుగృహీతకాముఁ డయి హరుం
డమ్మహీధరగృహమున మా
సమ్ము సుఖ మ్ముండె శైలజాసహితుం డై. 115

క. పిదప నుమాపతి మామను
స్వదుహితృవిరహార్తు శైలవరు వీడ్కొని స
మ్మదమున విహరించె నుగ
త్స్వదవృషభము నెక్కి తిరుగు చయ్యెయెడలన్. 116

క. గిరిజా స్తనయుగపీడిత
చరమాంగుం డగుచు హరుఁడు స్వర్ణగిరికి ము
న్నరిగి యచట నారెయి బం
గరుజిగురుల సెజ్జ రతులఁ గరఁగించె నుమన్. 117

క. అటఁ గడచని కైటభజి
త్కూటకాంచితశిలను సవసుధాగసబిందు
చ్ఛటము సగుమందగకటక
తటిని సుమాస్యాంబుజాలి తగ విహరించెన్. 118

క. దశకంధారవభయపర
వశ యై తనుఁ గౌఁగిలించు సలిమలసుతతో
శశిధరుఁడు రజతగిరిపై

విశదశశిప్రభల ననుభవించెం బిదపన్. 119

క. అందుఁ దనిసి చందనన
మందు రతులఁ దేలువారి యలపుఁ దలఁగ నా
స్పందితలవంగకేసర
చందనమందానిలంబు చాటుకరుబలెన్. 120

క. స్వర్ణాబ్జతాడితధ్వా
దీర్ణకరార్ణోనిమేలి తేటుఁగ యగుచున్
స్వర్ణదిఁ గ్రీడించె నపుడ
పర్ణ ఝషాళిద్విరుక్త పటుమేఖల యై. 121

క. అమ్ముదితను శివుఁడు శచీ
ధమ్మిల్లోచితవదాన్య తరుకుసుమవితా
నమ్మునఁ గై సేసె సురవ
నమ్మున రహిం నప్సరోజనమ్ము గనుఁగొనన్. 122

క. ఇమ్మెయి భౌమస్వస్వా
ఖ్యమ్ముల నుమతోడఁ బొంది హరుఁ డాకతజి శో
ణమ్మయి యాతప మొప్పఁ బ్రి
యమ్ముగ దిరి గంధమాదనాద్రికిఁ జనియెన్. 123

క. వరకాంచనశిలపై నట
హరుఁ డెలమి వసించి దర్శనార్హుఁ డగుదివా
కరుఁ గని నిజవామభుజముఁ
గరయుగమున నూఁది యున్న గ్రావజ కనియెన్. 124

క. సూరుం డడె యింతి యుషాం
తారుణముల సీదుకనుల నరవిందరుచిం
జేరిచిబలె దిన ముడిపెడు
సారసభవుఁ డంతమందు జగముం బోలెన్. 125

క. తరణి సలిలప్రసారిత
కరములు తద్ధారములుగఁ గావించుటనో

యురుకుచ యాత్వత్విత్పని
ఝ్ఝరములు హరిచాపవర్ణ । రహితము లయ్యెన్. 126

తే. సగము గ్రాకిన తూఁడు నెఱవ్వగల విడిచి
పెడమొగము పెట్టి మెలఁగించు । చెడలు గదుర
సరసి నదె దైవవశమున । జక్కవకవ
తెలిపి యొండొండ వెరుఁగంగ । దెరలఁ గంటె. 127

క. పవ లెల్ల మేసి యందుగుఁ
జివురులఁ గడు వలచునీళ్లు । సేకొని యెడు నో
యువిద కడుపార నేనుఁగు
లవె యబ్జగతాళిముఖర । యగుసానసరసిన్. 128

క. పడమర వ్రేలునినుఁడు తన
నిడుద ప్రతిమ చేఁ గొలంకు । నీళ్లలలోఁ బు
త్తడిసీటికట్ట నిర్మిం
చెడుపోలికఁ దనరుచుండెఁ । జెలియా కంటే. 129

క. తెలిగోఁటలు సందష్టకు
టిలబిసములగతిఁ దనరఁ గిరిటిప్రజ మతిపం
కిలపల్వలములఁ బొరలి పొ
రలి యొయ్యన వెడలుచుండె । రహితశ్రమ మై. 130

క. అరుణరుచి పర్వి పురి బం
గరురంగులఁ జెంగలింప । ఘనజఘనా యీ
తరుశిఖరస్థశిఖి పొరిం
బొరిఁ దఱఁగెడు నెండఁ గ్రోలు । పోలిక నొప్పెన్. 131

క. తొలిదెసఁ బర్విన తమ మొక
వలన న్వ్రాలువడినయదును । వడువుఁ దనరఁ
లలన చద లినహృతాతప
జల మై యొకకొంత యుండు । సరసిం బోలెన్. 132

ఆ. మూలసేకసజల । బాలసాలంబుల

నుటజనివసన్మృగోచ్ఛ్రయములఁ
బ్రవిశదగ్నిధూమపటలిని జ్వలదగ్ని
తతుల నాశ్రమములు తనరుచుండె. 133

క. ముకుళిత మయ్యెను బద్మము
శుకవాణీ వసతిఁ గోరి చుట్టుఁ దిరుగు తేఁ
టికిఁ దెరువు నొసఁగునదిబలె
నొకయించుక మోముఁ దెఱచి యుండెం గంటే. 134

క. పరిమేయమయూఖుం డగు
నరుణారుణుచేతఁ బశ్చిమాశ రుచిరకే
సరవంతం బగుమాకెన
విరిబొట్టు ధరించుకొన్న విధమున నొప్పెన్. 135

క. మినుకులవేఁడిమిఁ గ్రోలుచు
ననుచరు లగుమునులు తేజ మగ్ని నిడి వడిం
జనునినుఁ బొగడెదుఁ గోక
స్తని రథహయహృద్యమధురసామస్తుతులతోన్. 136

క. శిరములు వంచి శ్రవశ్శ్వా
మరములు కనులొత్తి సటలు మలఁగఁగఁ గాఁడిం
బరు విడెడుగుఱ్ఱములతో
శరనిధి దిన మునిచి క్రుంకె సవితృఁడు చెలియా. 137

క. తెఱవ రవి గ్రుంకెఁ జద లో
ప్పతి సుప్తము నాఁ బరఁగె మహాతేజం బి
న్నెఱిన తనకలిమి లేమిని
వఱలించుగా విరుచి చేయు వరుసగా ధరణిన్. 138

క. పడమటికొండకుఁ జనురవి
యొడలి ననుగమించె సంధ్యయును నాఁడొలియా
వడువున నుదయంబున ము
న్నిడఁబడునది యతని పిడచు లెట్లగు నిమమన్. 139

క. హరిదరుణకపిశరుచిభా
స్వరఘనకోటు లవె తనరె సంధ్యాసతి సుం
దరి నీవు సూతు వని యి
క్కరణిం దూలికలతోడఁ గావించెనొ నాన్. 140

క. మృగరాజసటాచ్ఛటలం
జిగిరించిన చెట్ల ధాతుశిఖరంబుల ని
న్నగరాజు పంచెనో నాఁ
దగునీసాంధ్యాతపంబుఁ దరుణీ కంటే. 141

క. లలన మడమ లెత్తి జలాం
జలుల నొసఁగి శాస్త్రవిదులు శ్రద్ధాళులు మా
నులు సంధ్య కెదురుగా శుభ
మొలయఁగ బ్రహ్మము జపించు చుండిరి కంటే. 142

క. కావున సంధ్యావిధికై
యీవు ముహూర్తంబు సెలవు నీవలె నాకున్
భావిని యీచతురవయ
స్యావళి యలరించుచుండు నంతకు నిన్నున్. 143

క. అని హరుఁడు పలుక గిరిసుత
వినియు వినవిభంగిఁ బెదవి విఱిచి నికటవ
ర్తిని యగువిజయాఖ్య వయ
స్యను గూర్చి యకారణముగ సల్లాపించెన్. 144

క. శితికంఠుఁడును దినాంతో
చితవిధిని సమంత్రకముగఁ జేసి యసూయా
వతి యై మాటాడనినిజ
సతిఁ జేరి వచించె నిట్లు సస్మితముఖుఁ డై. 145

క. కనలు విడు మకారణకో
పన సంధ్యకెరఁగితి నొందుపనికై కా దేఁ
జనుట నను నీదుసహచా

రినిఁ దెలియుమ్రొ చక్రతుల్య వృత్తునిఁగ సతీ. 146

క. పితృదేవతలను వాణీ
పతి ప్రొవరిచి యొరొడలినిఁ బాసె నదియ సే
వితమా సంధ్యాద్వయి నీ
గతిఁ గావున నాకు నందు గౌరవ మబలా. 147

క. అతివ తమఃపీడిత మై
క్షితితలలగ్నంబుమాడ్కిఁ జెలఁగెడుసాంధ్య
ద్యుతి యేకతటతమాలా
వృత యాధాతురసతటిని విధమున నొప్పెన్. 148

తే. అరుణతర రేఖ మస్తంగ తావశిష్ట
మైనసాంధ్యాతపముఁ బ్రత్యగాశ దాల్చె
రమణి తిర్యగుజ్ఝిత మగుర క్తసిక్త
వరకృపాణంబు సంగ్రామధరణి కరణి. 149

క. ఇంతి సుమేరువుప్రక్కది
నాంతోద్భవతేజ మెల్ల నడుగుట నకలా
శాంతంబుల నీగాఢ
ధ్వాంతము సెలరేఁగె నప్రవారోద్ధతిమై. 150

క. వెనుకకు నెదిరికిఁ బ్రక్కల
కును మీఁదికిఁ గ్రిందికిఁ గనుఁగొన రాక నిశీ
థిని నీలోకం బొప్పెఁ
ఘనతిమిరోల్బావృత మయి గర్భమునబలెన్. 151

క. పరిశుద్ధము కలుషము సు
స్థిరము చలము ఋజువు నతము చీఁకటిచే నో
తరుణి సమ మయ్యె దోషా
కరులతర మెఱుఁగనిమహిమ కాల్పనె చెప్పుమా. 152

క. శార్వరవిస్ఫారతమో
గర్వం బడఁపఁగఁ దుషారకరుఁడు పొడుచు నో.

పార్వతి కై తెకరజములఁ
బూర్వాశ మునింగి యున్నపోలిక నొప్పెన్. 153

క. మందరనగాంతరితుఁ డగు
చందురుచే నీసతారకశర్వరి యొప్పెఁ
సుందరి తెఱఁ గరయు వెనుక
నందిననాచేత ససఖి వగునీవుబలెన్. 154

క. లలన నిశాచోదిత యై
తొలిదిక్కు రహస్యముబలెఁ దుహినాంశునిమం
డల మాసాయము లో నిడి
తొలివెన్నెల యనెడునగవు దోఁప వెలార్చెన్. 155

క. ఫలినీఫలసజ్యోతులు
చలివెల్గు నభస్తటాకజలగతబింబం
బులు దనరెం దవుదవ్వులఁ
బొలిచెడు జక్కవలదోయివ్రాలెఁ బాలా. 156

క. నవనవజాతము లభినవ
యువకోమలములును నగుహిమాంశునియాయం
శువులు గొనగోళ్లఁ జెలి నీ
శ్రవణాలంక్రియకుఁ ద్రుంప సాధ్యములు సుమీ. 157

క. రజనీపతి వ్రేళ్లఁ గచ
వ్రజముంబలెఁ దమము నిజకరంబులఁ గొనుచుఁ
రజనీముఖము ముకుళితాం
బుజనేత్రము ముద్దు వెట్టుపోలిక నొప్పెన్. 158

క. హాస్తిసమగమన యిందుగ
భస్తితతులఁ దమము సగము వాయంగ విహా
యస్తలముపోలెఁ జూడుము
మస్తిచేఁ గలఁగి తేఱు మానససరసిన్. 159

క. అరుణిమ విడి యుక్కలువల

దొర నిర్మలమండలుఁ డయి తులకించెడు నోఁ
బరిశుద్ధప్రకృతులయెడ
స్థిరము లగునె కాలగతినిఁ జెందెడువికృతుల్. 160

క. అతివ శశికరము లుచ్చ
స్థితిఁ జెలఁగ నిశాతమంబు సెందె బిలములన్
క్షితి గుణదోషములకుఁ దగు
గతి గతి నక్కమలభవుఁడు గల్పించెఁ గదే. 161

క. నెలకళుకులఁ గరఁగెడుక్రొ
న్నెలతాలం జాలువాఱునీరమ్ముల ని
మ్మలచటియలఁ గూర్కుశిఖా
వలముల మేల్కొలుపుచుండె వనిత [illegible]. 162

క. మందారశాఖశిఖరముఁ
లందుఁ గడుం గ్రందుకొనుకరావలిచేతం
జందురుఁడు హారయష్టుల
సుందరి లెక్కించుమాడ్కిఁ జూడఁగ నొప్పెన్. 163

క. ఇన్నగము వెలందుక ని
మ్మోన్నతతట మగుటఁ దిమిరయుక్తం బగునీ
వెన్నెలబహూరచనాసం
పన్నమదద్విరదభూతిపగిదిం దనరెన్. 164

క. మొక్కలపుఁదృష్ణ వెన్నెల
లెక్కుడుగాఁ గ్రోలి స్నేఁప కిట్లయ్యెనో నా
నిక్కలున శేంట్లరవములు
పిక్కటిలన్ మొదలు మొదలు ప్రి

క. ఈపండువెన్నెలల పె
ల్లేపున నేర్పఱుప రా యీక[illegible]
ఖాఫరిలంబిదుకూలం
బోవార్వతి పవనగతుల మాహ్యా[illegible]ఖ్యాన్.

క. రాలినపూవులొ నాఁ దగు
సాలంబుల క్రిందిపత్త్రజర్జరితజ్యో
త్స్నాలవములు నీయలకల
వ్రేళులఁ గొని ముడువ వచ్చు వెలఁదుక కంటే. 167

క. అతితరళయోగతారా
న్వితుఁడై యీశశధరుండు నెలఁతుక భయకం
పితతను వగు పెండిలికొమ
రితతోఁ గూడుకొనువరునిరీతిం దనరెన్. 168

క. లలితస్ఫుటశరగౌరం
బులు జ్యోత్స్నాబింబవిప్తతములు నగునీచె
క్కుల వెన్నెల మొలచెడుగతిఁ
బొలుపారె నయారె చంద్రమోనిహితాక్షీ. 169

క. అరుణారుణమణిఘటసం
భరితామరతరుమధువును భరియించి సమా
దరమున వనదేవత నీ
దరిని నిలిచె దీనిఁ జూడు తామరనాక్షీ. 170

క. కేసరపరిమళత యరుణ
భాసురనయనతయు నీలపనమున కెపుడున్
నైసర్గికము ల యింతకు
నాసవ మొసఁగేమి కూర్చు నంబుజవదనా. 171

క. ఐనను సఖు లతిమాన్యలు
గాన మహానంగదీపకం బగుదీనిన్
మానిని చేకొను మని మధు
పానము సేయించె హరుఁడు పార్వతిచేతన్. 172

క. ఆరమణి తదుద్భూతవి
కారమ్మును దోహదమున ఘనతరచూతం
బార్ష్వాఢిగ నభినవసహ

కారత్వముమాడ్కిఁ బొంది కరము వెలింగెన్. 173

క. లజ్జఁ దలఁగి రాగముతో
సెజ్జకుఁ జనుకడక నిగుడఁ జేయుపతికి మ
ద్యోజ్జనితమదమునకు భూ
భృజ్జాత యధీన యయ్యెఁ బేర్చువవశతన్. 174

క. అతిఘూర్ణితనయనంబు స్ఖ
లితవచనము స్వేదయుతము లీలాహేతు
స్మిత ముమ మొగ మప్పుడు పశు
పతి కన్నులఁ దప్పి దీఱఁ బానము సేసెన్. 175

క. ఘనజఘనభారదుర్వహ
నములంబితకనకరశన యయ్యుమను ద్రిలో
చనుఁ డెత్తికొనుచు స్మృతిసం
జనితవిభూత్యమలమణినిశాంతము సొచ్చెన్. 176

క. అట హంససితప్రచ్ఛద
పట మై గంగాపులిననిభం బగుశయ్యా
తట మొందె గిరిజతో ధూ
ర్జటి రోహిణితోడ శశి శరద్ఘనముఁ బలెన్. 177

తే. అదయకేశగ్రహణపీడితాబ్జఖండ
మతులమత్సరముత్పథార్పితనఖంబు
ఛిద్యమానసౌవర్ణకాంచీగుణంబు
నగునుమారతి నాఁపోవఁ డయ్యె హరుఁడు. 178

క. భవుఁ డటు క్రీడించుచు నా
ల్గవజామునఁ బ్రియతనువుమెడ నక్కటికమునం
గవుఁగిట నాహిమవత్సం
భవ నిడికొని నిదుర వోయెఁ బరమప్రీతిన్. 179

క. తెలవాఱఁ బసిఁడితామర
కొలఁకులతో నంత మేలుకొనియె శివుండు

జ్జ్వలకిన్నరకరవీణా
కలమంగళలలితగీతకలితశ్రుతి యై. 180

క. పరిరంభము వదలి పిదప
హరుఁడు సురయు ననుభవించి రట మానసశ్రీ
కరసరసిజపరిమళసం
భరితము లౌతద్వనాంతమరుదంకురముల్, 181

క. తొడలఁ గొనగోళ్ల మును తన
యిడినక్షతంబు లన చూడ్కి లిసి తొడిఁ బడుచుక్క
సడలినవలువను సవరిం
చెదు ప్రియతము నడ్డగించె శివుఁడు దిదృక్షున్. 182

తే. జాగరారుణలోచనాబ్జములతోడ
దంతపదశోభితామలాధరముతోడఁ
గరఁగుతిలకంబుపైఁ దూలుకురులతోడ
నలరుగిరిజాస్యమును జూచి యలరె హరుఁడు. 183

తే. ప్రొద్దు పొడిచిన నైన నపూర్వహారుఁడు
నడుమ గిటికొను మొలనూలు ముడుత వడిన
యట్టివలువయుఁ జరణాలతాంకములును
గలిగి యలరారు సెజ్జ వదలక యుండె. 184

క. ముదమున రేవగలు సుఖా
స్పద మగుగిరిజావదనరసముఁ గ్రోలుచు న
మ్మదనారి విజయ తెలిపెడు
స్వదర్శనాగతులకోర్కి సలుపఁడ యంతన్. 185

చ. పవలును రేలు నొక్కగతిఁ బార్వతితో రతికేళిఁ దేలునా
శివునకు నొక్క రేయిబలెఁ జెల్లెను సార్థశత ర్తుకాల మ
ర్ణవగతబాడబాగ్ని ప్రణిరంతరతజ్జలధార చేబలెన్
భవుఁడును దృప్తిఁ బొందఁడ యపారతదీయరతిప్రసంగతిన్.

శా. అంహోరణ్యదవానలా సకలలోకాధార శుంభద్భుజా

రంహస్స్ఫూర్జదవక్రవిక్రమకళా । రంభానురేఖావళీ
సింహస్మార్తివిశేష దేవపరిష । త్సేవ్యాంఘ్రిపంకేజ స
త్సంహాత్మాత్మనివాస భూరికరుణా । సంపత్కటాక్షాంచలా.

క. సర్వత్రపరివ్యాపక
సర్వాత్మక కాలరూప । సన్మునిజనతా
నిర్వృతిదాయక యజముఖ
గీర్వాణసమాజసతత । కీర్తితచరితా. 188

మాలినీ. వినతజనశరణ్యా । విశ్రుతశ్రీవరేణ్యా
జనకదుహితృపుణ్యా । సర్వవీరాగ్రగణ్యా
వినుతసుగుణధుర్యా । విశ్వరక్షైకకార్యా
ఘనతరభుజవీర్యా । గాఢసద్భక్తిహార్యా. 189

గద్యము. ఇది శ్రీమద్వేంకటస్వామిరాట్పౌత్త్ర తిమ్మమరాట్కవీంద్రపుత్త్ర విబుధవిధేయ వేంకటసూర్యప్రసాదరాయ ప్రణీతంబైన నిర్వచనకుమారసంభవమహాకావ్యంబునందుఁ దృతీయాశ్వాసము.





శ్రీ

రామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# నిర్వచనకుమారసంభవము

## చతుర్థాశ్వాసము.



శ్రీశ్వరధాత్రీశ్వరతా
శశ్వత్కృతసకలలోకసర్గాదిక స
ర్వేశ్వర విశ్వాత్మక యపి
నశ్వర గుణధామ విమలనామా రామా. 1

తే. అవధరింపుము పిదప నయ్యబ్జధరుఁడు
ధరనుతాస్యాంబుజాళియై సురతసౌఖ్య
జలధి నోలాడుచుండి లోపలికి వచ్చు
పావురం బొక్కఁడు వీక్షించెఁ బడకటింట. 2

తే. ఘూర్ణమానరక్తాక్షులు గోమరుమిగులఁ
జెలులమణితంబు నాఁగూయు చలఘుగతులఁ
గుత్తుకను డించుచును బైకి నత్తికొనుచు
సారెకును బుచ్ఛమును గుంచి తారుదాని. 3

క. వరపక్షతియుగళము మద
భరభరితానందగతులు భాసిల్ల నిశా
కరరుచియు వినిగళజటిల
చరణము నై వలయగతుల సారెఁ దిరుగుచున్. 4

క. వలరాయఁడు రతితోఁడుత
జలకము లాడంగ నమృతసరసిఁ బొడమును
జ్జ్వలఫేనచయము గతి రా
జిలు దానిం జూచి క్షణము శ్రీగళుఁ డలరెన్. 5

క. ఆమీఁదను సర్వాంత
ర్యామి యగుటఁ దన్మనోహరాకృతిఁ గని య
క్కామారి ఫలఖగాగ్నిం
గా మనమునఁ దెలిసి క్రోధకలుషితుఁ డయ్యెన్. 6

క. లలితనిజాకృతిఁ గైకొని
జ్వాలనుఁ దపుడు వెఱపు గదుర నణకుచును గృతాం
జలి యై వికటభ్రూకుటి
కలితలలాటుఁ డగు కాలకంఠున కనియెన్. 7

క. త్రైలోక్యపతివి సురవిప
దాళినిహంతవును నీవ యగుట సురారుల్
దోల సురేంద్రముఖమరు
త్పాళి నినుఁ శరణుసొచ్చె భక్తాధీనా. 8

క. గిరిజానశ్యత నీ వి
ట్లు రహస్థలిఁ గ్రీడసల్పఁ బోయె శతక్రతుల్
సురతతితో నినుఁ గానక
పరమార్తి బలారి దీనభావం బందెన్. 9

క. నీకొలువుతఱిని వేచుచు
నాకేశప్రభృతిసురలు నను వేఁడికొనన్
నీకలచోటరయఁగ విహ
గాకృతిఁ గొని వచ్చితిని మహాత్మా యిటకున్. 10

క. కావున నిది యెడఁద నగసి
నావలసిమహాఘము ను ఘృణామతి సైఁపం
గా వలె శరణార్థులు పరి

యం గుధరజమెడను ముత్తియపుహార మిడెఁ
బంగరుగుబ్బలిజతపై
గంగాయుగ మున్నసొంపు గారింపంగన్. 25

క. నఖపదవిలసిత మగునిజ
నఖఘనజఘనమున రశనకుశర్వుఁ డిడియె న
య్యఖిలేశుహృన్మృగి సుఖవి
శిఖుండు బంధింపఁ దగిలించిన పాశమనాన్. 26

క. ఫాలేక్షణానలంబునఁ
గాలగళుఁడు కజ్జలంబు గావించి యుమా
లోలాక్షుల కిడి పులకిత
నీలగళము నందు వ్రేలి నెత్తివడఁ దుడిచెన్. 27

క. లాక్షారాగము నక్కమ
లాక్షిపదాబ్జములఁ బూసి యరుణిమ వ్రోఁ బిం
గాక్షుఁడు హస్తాబ్జంబులఁ
బ్రక్షాళించెను శిరస్తరంగిణినీటన్. 28

క. భస్మాలిప్తం బగుమెయి
సస్మితుఁ డయి యద్ద మూఁచి సకియ కెదురుగా
నాస్మరరిపుఁ డిడియెఁ బహు
విస్మయమై పథ్యలక్ష్మి వీక్షింపంగన్. 29

క. దర్పకహరుఁ జూపినమణి
దర్పణమున గిరిజ రతిపదములఁ దనరుమై
నేర్పడఁ గనుఁగొని నానయొ
లర్పు వెలిచె రాగముం బులకదంభమునన్. 30

క. అథ త్రైలోక్యాలంక్రియ
నాభంగిం గని ప్రసన్నయై నగుచుఁ దనున్
సౌభాగ్యవతీవారక
శోభాపణముగఁ దలంచె రుద్రాణి మదిన్. 31

క. విజయాజయాఖ్య మగు గ్రా
వజయాళీయుగ్మ మపుడు వచ్చె యటు వృష
ధ్వజుతోడన్పై వసియించిన
నిజసఖిని నలంకరించె నిపుణత మెఱయన్. 32

క. వైతాళికతతి మంగళ
గీతంబుల హరుచరిత్ర గీర్తించె శివ
ప్రీతికి నై గంధర్వ
వ్రాతంబులు పాడె శంఖరవములు సెలఁగన్. 33

క. నంది పిదపఁ గొలువున్నసమయ
మందు నరిగి యెఱఁగి యోజితాంజలి యై తె
ల్పెం దద్దర్శనమున కై
బృందారకసమితి రాక త్రిపురాంతకుతోన్. 34

క. రుద్రుఁడు మానసహంసిని
భద్రసుతం గేలు నూని బలతిగృహము
ద్వ్రతిగ వెడలెఁ దివి
షద్రాజికి నెదురు గాఁగ సస్మితముఖుఁడై. 35

క. ఇంద్రాదిసురలు ప్రియ మొసఁ
గం ద్రిపురహరునకుఁ దొలుత గానంజలు లో
ప్పం ద్రిజగన్మాత యగుఁగి
రీంద్రతనూభవకు మ్రొక్కి రంతయు భక్తిన్. 36

క. విషకంఠుఁడు నున్ననలది
విషదాళిం దనివి నంది వేచే యొసఁగన్
వృషభముపై రయమున నిజ
ఝషమృగలోచనతోడ నెక్కి చయ్యన వెడలెన్. 37

క. మానసజవ మగువృషభము
పై నాగతి నెక్కి గగనపథమునఁ జన నై
మానికు లెరఁగిరి గిరితన

యానాథునిఁ గూర్చి యోజితాంజలు లగుచున్. 38

క. మందాకిని నీఁది సురత
మందు నలసి సోలుసతుల యలపు దలఁగుచున్
మందారకుసుమవాసన
లం దగుగాడ్పయ్యుమేశులను సేవించెన్. 39

క. గిరిశుఁడును ధృతార్ధసుధా
కరము లలితభోగిభోగకలితముఁ గలితాం
బరభాగము భూతిధరము
వరకైలాసాద్రిఁ దన్నుఁ బలెఁ బ్రాపించెన్. 40

క. ఎట సిద్ధసతులు ప్రతిమలఁ
బటికపుగోడలను జూచి పరసతు లని యు
త్కటకోపలై ప్రియులు సం
ఘటితాంజలులైన బెడమొగము వెట్టుదురో. 41

క. ఏశిఖరిని స్ఫటికాంశుల
లో శశి బింబించి యుండఁగ గోనిశంక
శ్రీశైలజ యిదుకస్తూ
రీశకలముమాడ్కిఁ దేజరిల్లుచు నుండున్. 42

క. ఏనగము నందు బ్రతిమల
నేనుంగులు స్ఫటికశిలల నీక్షించి రుషా
ధీనతఁ గొమ్ముల మత్తా
న్యానేకపము లనుభ్రాంతి నడిచి యడఁగునో 43

క. ఏలను సిద్ధసతులు స్ఫటి
కాలయములఁ బ్రతిఫలించి నట్టిలసత్తా
రాళిఁ గని కాంతు రెట రవి
కాలచ్యుతహారమౌక్తికభ్రాంతి నెదన్. 44

క. ఏమహీధరముపయిన్ ఖచ
రీమండనదర్పణంబురీతి రుచిఁ డా

సోముఁడు వసించి చారుత
రామూల్యశిరోమణిత్వ ǂ మంది వెలుంగున్. 45

క. సుర లేగిరిని రహస్స్థలి
మరులునఁ దరుణులను గూడి ǂ మలయుచు నో కొ
క్కర తముఁ బోలెదు వెక్కం
డ్రురఁ గూడినభంగిఁ దలఁతు ǂ రో బింబితులై. 46

క. ఆకైలాసాచలమును
శ్రీకంఠుఁడు సేరి యచట ǂ శృంగారవిలా
సైకవిచేష్టితముల న
స్తోకానందమున గిరిజ ǂ తో విహరించెన్. 47

క. స్మరమర్దనుకరసుం దన
కరమునఁ గీలించి యపుడు ǂ గ్రావజ బెత్తుగా
ధరియించి నంది మునుమున
సరిణెం జూపంగ నడచె ǂ సమ్యగ్భంగిన్. 48

క. వికటాంగభంగములచే
సిక దూలఁగ భయదతీక్ష్ణ ǂ సితముఖుఁడై గా
రికి నెలమి గోరు త్రిపురాం
తకునిబొమలసన్న భృంగి ǂ నటన మొనర్చెన్. 49

క. కంఠాలోలకపాల యు
కుంఠితదంష్ట్రోగ్రవదన ǂ కుహారయునై శ్రీ
కంఠుఁడు వనుప నుమాకల
కంఠికి ముద మెదను బొదలఁ ǂ గాళి నటించెన్. 50

క. వెఱపు గదుర నిరువురు ని
త్తెఱఁగున నర్తింపఁ గాంచి ǂ ధృతి సెడి వెఱపై
మఱచి గిరిజ గాఢంబుగఁ
గఱకంఠునియూరుయుగముఁ ǂ గౌఁగిటఁ జేర్చెన్. 51

క. బలసి నిగుడు చనుగొండల

బలుతాఁకున సంభ్రమించి పర్వతసుతకాఁ
గిలిఁగొని తత్క్షణము హరుఁడు
పులకలు మై జాదుకొనఁ బ్రమోదితుఁ డయ్యెన్. 52

క. ఇటు లంబికతో వివిధో
త్కటలీలావిలసనములఁ గడు నలరుచు న
న్నిటలాక్షుఁడు రజతాచల
తటమున సుఖ ముండెను బ్రమథసమేతుం డై. 53

క. అట వహ్నితీవ్ర మగుధూ
ర్జటివీర్యంబును వహించి సత్వరముగ న
చ్చోటు వాసి సకలసురసం
ఘటితసభాస్థితమహేంద్రు కడకుం జనియెన్. 54

క. వేకన్నుల సాదరముగ
నాకేశుం డపుడు కుత్సితాత్మాంగుని ధూ
మ్రాకారుని నతిధూమస
మాకులు దుష్ప్రేక్ష్యు నాబృహద్భానుఁ గనెన్. 55

క. ఆరీతి వహ్నిఁ గనుఁగొని
స్వారాజ్యధురంధరుండు సంక్షుభితుం డై
గౌరీరమణాత్యుగ్రరు
షారూషితుఁ గాఁగ మానసమునఁ దలంచెన్. 56

క. వెలవెలఁబాఱెడు నెమ్మో
ములతో సారెకును సురలు పొడగను చుండన్
బలరిపుచూపినగద్దియ
జ్వలనుఁడు గూర్చుండె నపుడు సంభావితుఁ డై. 57

క. హవ్యవహా యెట్టు లిట్టిద
శావ్యతికర మొందితి వని శక్రుఁ డడుగ నా
భవ్యాత్ముఁడు నిట్టూర్చి స
నవ్యథముగ నిట్టు లనియె శతమన్యునితోన్. 58

క. అనతిక్రమణీయము నీ
పనిఁ గొని పావురమ నగుచు భవు గిరిజాక్రీ
డనరతుఁ జేరి యచట జము
మునుమున బలెఁ దొంటిరూపు వొందితి భీతిన్. 59

క. ననుఁ గని కపటపుఁబులుఁగని
మును దెలియుటఁ జేసి యాత్రిపురహరుఁ డతికో
పనుఁ డై నిటలప్రజ్వల
దనలము పాల్పఱుప నెంచె నమరాధీశా. 60

క. అగణితసార్థకమధురము
లగుపలుకుల నే వినమ్రుఁ డై పొగడఁగ న
న్నగచాపుఁడు ప్రియ మందెం
బొగడిక నెవ్వఁడు ప్రీతిఁ బొందఁడె యుండున్. 61

క. విబుధేశ త్రిజగదవన
ప్రబలుం డీశుండు నతిశరణ్యుండు జ్వల
న్నిబిడావార్యమహాగ్నిఁ
గబళము గాకుండ నన్నుఁ గాచెం గరుణన్. 62

క. శారీరమణీగాఢప
రీరంభం బపుడు పరిహరించి యుమాకాం
తారమణుఁడు స్మరరణాలీ
లారసవిముఖత్వ మొందె లజ్జావశుఁ డై. 63

క. దుర్వహము సమాఘంబు స
ఖర్వంబును సురతభంగకలితముఁ ద్రిజగ
న్నిర్వాణకరము వీర్యము
శర్వుఁ డునిచెఁ బిడప నాదుసంహాసనమునన్. 64

క. దహనాత్మకంబు నతిదు
స్సహము నయిన దాని చేత సంపీడితము దు
ర్వహమును దగ్ధము నగుమై

సహియింపఁగఁజాల నైతి స్వధీశా. 65

క. స్థాణుమహీయస్తేజో
రీణద్యుతిదగ్ధనిజశరీరుఁడ నగునా
ప్రాణములు గావు మార్త
త్రాణపరాయణుఁడ వై శరణ్యావరేణ్యా. 66

క. అనిపలుకునగ్ని పలుకులు
విని పరితాపోపశాంతివిధి యెట్లొకొ యం
చనిమిషపతి చింతించెన్
మనమున నయ్యెడ ముహూర్తమాత్రము పిదపన్. 67

క. ఈశ్వరతేజోదగ్ధము
వైశ్వానరతనువు హస్తవారిజమునఁ దా
నాశ్వాసింపుచుఁ దడవి సు
రేశ్వరుఁ డయ్యనలుతోడ నిట్లని పలికెన్. 68

క. స్వాహోక్తిని నిర్జరుల స్వ
ధాహంతోక్తులఁ బితృనరతతులఁ దనిపె దీ
వ్రాహవ్యవాహ నిరతము
నాహుతులఁ దదేకముఖమునవై నెగడుటచేన్. 69

క. హోతలు నీయందును సం
ప్రీతిని హవ్యముల వేల్చి వృజన మెడలి స్వ
ర్గాతతభోగము లొందుదు
రేత త్త్రిదివాప్తి కీవ హేతువు గాదే. 70

క. తపసులు నీపై మంత్ర
ప్రపూతహవ్యంబు వేల్చి పరమతపస్సి
ద్ధిపవిత్రు లగుచు నుందురు
తపఃప్రభుఁడ వీవ కావె ధర్మప్రవణా. 71

క. తరణికి వాలుత మిడుదు వతఁడు
గురియుం బర్జన్యుఁ డగుచుఁ గూరుం దానన్

ధర నన్నము దానఁ బ్రజో
త్కర మెసఁగుం గావునన్ జగత్పితవు గదే. 72

క. భూతాంతశ్చరుఁడవు నీ
చేతన భూతములు వ్రేడమె జీవితభూతుం
డై తనరెదు జగమున కసు
దాతవు నై యొప్పుచుండెదవు నీ వనఘా. 73

క. సకలజగంబులకును నీ
వొకరుఁడవ తలంచి చూడ నుపకారివి నీ
కకలంక చెల్లుఁ గాకి
ట్టికార్యములు పరుల కెటు ఘటింపంగ నగున్. 74

క. విపులార్థసాధకుం డీ
సుపర్వులకు నీ వొకఁడవ చూవె మహాత్మా
యుపకారవ్రతపరునకు
విపత్తియును శ్లాఘ్య యగుచు వెల్గొందుఁ గదే. 75

క. మును భాగీరథి సంతు
ష్టిని బొందె మదీయభక్తిచే నందు నిమ
జ్జనము సలుపు మాశుభద
ర్శన యుష్మదుదీర్ణతాపశాంతి యొనర్చున్. 76

క. కావున జాలము సేయక
నీవు త్వరం జనుము తద్ధునీతటమున కై
యావశ్యకకార్యంబులు
వేవేగమ చేత సిద్ధివిభవాస్పదమా. 77

క. హరజలమయమూర్తియ యా
సురనిమ్నగ దర్పకారి శుక్రమును సుదు
ర్ధరమును నీవలనం గాని
భరియించుం దత్స్రవంతి పావనచరితా. 78

క. అని యిట్లు పలికి బలసూ

దనుఁ డూరక యున్న యంత దహనుం డయ్యిం
ద్రుని వీడ్కొని యచోటు విడిచి
చనియెఁ సత్వరము గాఁగ స్వర్వాహినికిన్. 79

క. ఈవిధమునఁ జనిచని య
ప్పావకుఁ డధ్వంబుఁ గడచి పావని యగుస్వ
శ్శైవలినిన శేషక్లే
శావలిసంహారిణిం బ్రియంబునఁ జేరెన్. 80

క. స్వర్వాప్త్యధిరోహిణి దు
ర్భగతరకల్మిషసమూహభంజని సపవ
ర్గరమాధిదేవతను సం
సరణసముద్భూతదుఃఖసంహారణకరిన్. 81

క. నిటలాక్షశిరఃప్రోజ్జ్వల
జటానివాసిని మహాఘచయనాశిని ను
త్కటధర్మధారిణినిఁ బ్రా
కటసాగరవంశమోక్షకారిణి ననఘున్. 82

క. వైకుంఠపదాబ్జజ సజ
లోకాంగత స్నాతకలుష లుంఠాకను సు
శ్లోకఝరీత్రితయపవి
త్రీకృతలోకత్రితయుని విపథత్రుటినిన్. 83

క. చేరినయయ్యనలుని నా
సారాపగ యర్ఘ్యసిద్ధిఁ జలుపంగ మహో
దారోత్థితవీచీకర
సారసములఁ జేరఁ జీరుచాడ్పున నొప్పెన్. 84

క. ప్రాంచద్గతి గములై యెలుఁ
గించుచు మదకలితవృత్తిఁ గ్రీడించెడు రా
యంచలరొదమిష వెతఁ దొలఁ
గించి శుభముఁ గూర్తు నని శిఖిని నది పలికెన్. 85

దుర్వహపరితాపభరముఁ దోడన పొందెన్. 92

క. ప్రళయాగ్నిజ్వాలలచే
బలె మఱుఁగుచుఁ బొంగి పొరలఁ బడుత త్తటినీ
సలిలంబుల నిలుపోపక
జలజంతువు లెల్ల వెడలె సంత ప్తము లై. 93

క. సప్తార్చిరింద్రియేంద్రియ
త ప్తంబులఁ దీక్ష్ణముల నధార్యంబుల సం
లుప్తాఖిలజలచరముల
న ప్తతులం జిమ్మికొనుచు నయ్యేఱుండెన్. 94

క. అ త్తఱి నొయ్యనఁ గించిదు
దా త్తగతిం దూర్పుదెసను దరణి వొడను ప
ట్కృ త్తిక లేఁగిరి యాదివి
ప త్తటినికి మాఘమందు జలకము లాడన్. 95

క. లోలసితాభ్రంకషక
ల్లోలంబులచేత నమరలోకమునకు స్నా
నాలోకాచమనాదుల
కాలం బని తెలుపుభంగిఁ గ్రాలెడుదానిన్. 96

క. జలకము లాడినసఘానీం
ద్రులబలికర్మోచితములు దూర్వాక్షతసం
కలితములు నగును మోత్కర
ములఁ బ్రబ్బినయొడ్లకలిమిఁ బొలిచెడుదానిన్. 97

క. బ్రహ్మధ్యానైకపరులు
బ్రహ్మాసనగతులు యోగపట్టనిబంధుల్
బ్రహ్మవిదులు యోగివరులు
బ్రహ్మణ్యులు బలసి కొలువ రాజిలుదానిన్. 98

క. బొటవ్రేలన్ నిలిచి నభ
పటమునఁ జరియించుచుండు తపసుఁ గనుచు ను

త్కటభక్తి బ్రహ్మజపలం
పటమగు బ్రహ్మర్షితతిని భాసిలుదానిన్. 99

క. గంగను షట్కృత్తికలు త
గంగను గని సంతసంబు గాంచిరి తోడ్తో
రంగన్ముద మై యమరత
రంగిణిఁ గనునెవనిమనము రాగిల కుండున్. 100

క. ఏకల్లోలవతీమణి
శ్రీకంఠుఁడు ప్రీతిఁ దాల్చె శీర్షమున యదా
లోకనము పుణ్యదం బ
య్యాకాశాపగను జూచి యతులశ్రద్ధన్. 101

క. శ్రీపతిపదాబ్జజకు నత
పాపాపహ కతులమోక్షపదదాత్రికి ది
వ్యాపగ కెరఁగిరి వినయం
బేపారఁగఁ దలలు వాంచి కృత్తిక లంతన్. 102

క. బత్తియు శ్రద్ధయుఁ బెనఁగొన
నత్తరుణులు మఱియుఁ బొగడి రపవర్గపుసం
పత్తికిని బూఁటకాఁపయి
యుత్తమసంప్రాప్య యగుచు నొప్పెడుగంగన్. 103

క. మోక్షసతీసంగమదూ
త్యక్షమతద్విమలజలములందును నాలో
లాక్షులు జలకంబాడిరి
ప్రక్షాళితదేహ లై తపస్విను లంతన్. 104

క. పరిపక్వభాగ్యములచే
దొరకొనునద్దానియందుఁ దోయజముఖు ల
క్కరణి మునిఁగి తలఁచిరి తముఁ
జరితార్థలు గాఁగ నెలమి స్వాంతంబులలోన్ 105

క. గంగాస్నానమునఁ బిదప

గంగాధరుసఫలమైన ఘనవీర్యం బ
య్యంగనలపావనము లగు
నంగంబుల సంక్రమించె నాసమయమునన్. 106

క. స్ఫురదనలాత్మకమై దు
ర్ధర మగునైశేంద్రియంబు ధరియించి కడుం
బరితప్తలైరి విషసా
గరమధ్యము నందు మునుఁగుకరణిం దరుణుల్. 107

క. భరియింపరానిదానిఁ
ధరియింపం జాల కాసుతనులు వెడలి రా
తురలై లో జ్వాలదనలము
ధరియించినవారపోలెఁ దన్నదివలనన్. 108

క. సురనిమ్నగ విడిచినయా
హరునిమహామోఘతేజ మాతుణమ కృశో
దరులకృశోదరములలోఁ
దిరముగ గర్భత్వ మొందె దీప్తం బగుచున్. 109

క. చతుర లగుట నయ్యాది గ
ర్భత నొందె నటంచుఁ దెలిసి భరణాతుమలై
పతిభయమున సిగ్గున నా
సతు లత్తఱిఁ బొంది రధికసంతాపంబున్. 110

క. పదపడి శరవణమున న
మ్మదవతులు భయంబుతోడ మందాతుముతోఁ
దదుదారగర్భజాతము
వదలి చనిరి యపుడ నిజనివాసంబులకున్. 111

ఉ. ఈగతిఁ గృత్తికల్ విడువ నిందుకళాసుకుమారమై నభో
భాగము మ్రింగికొంచు శతభానులపై నెదురొడ్డునై జతే
జోగణ మొప్ప షడ్వదనసుందరమై వెలుఁ గొందె గర్భమ
చ్చి గరువంపురూపమున శూలిపయిం గలస్పర్ధచే బలెన్.

క. పడపడి సురేంద్రముఖదివి
షదు లతివస్రు లయి వేడఁ జయ్యన సుమనో
నది మూర్త యై సుధాసం
పద నిండినచన్నుఁగుడిపె బాలున కెలమిన్. 113

క. బాలుఁడు నానదిచన్నుల
పా లానుచు క్షణములోనఁ బరివర్ధితుఁడై
లాలిత మగునాకరూ ప
క్యాలంబునఁ బొందెఁ గృత్తికాసేవితుఁడై. 114

క. సానందబాష్ప లగుగం
గానలకృత్తికల కంత నట దివ్యండో
నానందనుఁ జేకొనుటకుఁ
గా నొండొరువులకు దిటవు గలదా దమ్యోన్. 115

క. ఇచ్చ మెయిం గ్రీడింపఁగ
నచ్చో నగతనయతో మనోతిరయత్వం
బచ్చుపడ విమానముపై
వచ్చుచు నచ్చోటు కృత్తివాసుఁడు చేరెన్. 116

క. నైసర్గికవత్సలతం
జేసి నెలమి నిగుడ నశ్రుసిక్తాననులై
యాసతియు హరుఁడు గని రు
ద్భాసిల్లెడుషడ్డినములబాలు షడాస్యున్. 117

క. శివ యత్తటి శివున కనియె
నెవఁడొకో యాదివ్యకాయుఁ డేధన్యతనూ
భవుఁడొకో వీనిజనని భా
గ్యవతీజనతాగ్రగణ్య యది యెవ్వతెయో. 118

క. ఇదె గంగ వీఁడె యనలుం
డిదిగో కృత్తికలపట్క మే లొకో కలహిం
చెద రీకొడుకు మకీయుఁడు

మదీయుఁడు మదీయుఁ డంచు మది వెఱ గొందన్. 119
క. పరమేశ వీరిలో నె
వ్వరిముద్దులకుఱ్ఱఁ డీభువనతిలకము ని
ర్జరగంధర్వాసురఫణ
ధరసిద్ధులయందు నొకనితనయుఁడొ చెపుమా. 120
క. అని వేడ్క గౌరి వలుకఁగ
విని చిఱునగ వంకురింప వృషభధ్వజుఁ డి
ట్లనియె మహానందోదయ
జనకవచఃప్రవణుఁ డగుచు శైలజతోడన్. 121
క. సుందరి వీరజనని నీ
నందనుఁ డీత్రిభువనైకనందనుఁ డమరా
నందకరు నిట్టిసుతుఁ గన
నెందును వేఱొకలతాంగి కెట్టులు పొసఁగున్. 122
క. భూవినుతసుగుణపాత్రం
బీవీరునిపుట్టునకు సమిద్ధనిదానం
బీవ నిజంబిది రత్నము
భావిని రత్నాకరమునఁ బనుపడు టరుదే. 123
క. దీనికతన్ విను మవహిత
వైనేము న్నగ్ని నిడినయాతేజముఁ గం
గానదిఁ గలసె నటఁ గృత
స్నానలు కృత్తికలయందు సంక్రమ మొందెన్. 124
క. తరువాత గర్భ మయినన్
శరవణమున విడిచి వారు చని రచటఁ జరా
చరభూతప్రచయోత్సవ
కరుఁడై యాశిశువు పుట్టెఁ గంజదళాక్షీ. 125
క. ఈజగతీప్రియదర్శను
చే జగతిం బుత్రపతులు సిగ్గువడఁగ వి

భ్రాజిల్లితి బాగేల త
నూజుం దొడఁ జేర్చికొను మనోహరగాత్రి. 126

క. అనఁ ద్రిజగన్మాత గిరిజ
తను వెలమిం బొంగ ఖచరతతి చేతులు ఫా
లినిఁ జేర్చి మ్రొక్క సుతుఁ గొన
మనంబు త్వరవెట్ట నిజవిమానము డిగ్గెన్. 127

క. హుతవహగంగాకృత్తిక
లతిభక్తిన్ మోడ్పుచేతు లమర నెరఁగ నా
సతి గొనక సుతునిఁ బొందె నె
వతె పుత్రోత్సవముదమున వసమఱ కుంకున్. 128

క. ఆనందాశ్రులు గ్రమ్మఁగ
నానందనుఁ జూడఁ జాలదయ్యె క్షణము మే
నానందన చే నంటి మ
హానందసుఖాంతరముల నందెం బిదపన్. 129

క. వెలుఁగును నెలమియు నెడఁదఁ
గిలికొనఁ బ్రమదాశ్రుజలము గెరలువృషువ న
త్తెఱవ మనోవాత్సల్యము
వెలుఁగఁగ నపు డెట్టకేనిఁ బ్రియసుతుఁ జూచెన్. 130

క. తనయుని క్షణంబు గనుఁగొని
యనిమేషేక్షణసహస్ర మందఁ దలఁచె న
వ్వనితామణి యెవ్వనిమది
తనియు సుతముఖార్వలోకతాత్పర్యమునన్. 131

క. వందారుదివిషదభయా
నందద ముగుకరయుగమున నవతనురాకా
చందిరసుందరనందను
నందుకొని భవాని యంకమందుం జేర్చెన్. 132

క. ఆనగజ యిట్టు లమృతని

ధానంబుం జేర్చుగతిఁ బ్రసిధనవీరుం డా
సూను నిజాంకతలంబునఁ
దా నిడి పుత్త్రిణులలోనఁ దద్దయుఁ బొలిచెన్. 133

క. ఎలమిని వాత్సల్యంబున
పెలుచం బ్రమదాశ్రువృష్టి వెల్లు గురియ న
మ్మలపట్టిచన్నుమిట్టల
జలజలఁ బ్రవహించె క్షీరనిర్ఝరు లవ్వేళన్. 134

క. ఇచ్చమెయిఁ గృత్తికలును వి
యచ్చరనిమ్నగయు సారె కలరుచుఁ గనఁగా
నచ్చో లోకజనని యగు
నచ్చేడియ స్తన్య మాషడాస్యుఁడు ద్రావెన్. 135

క. లలితైకనాళభవష
డ్జలరుహరమ నవఘళించు షణ్ముఖునెమ్మో
ముల నపు డుమ ప్రమదాస్రం
బులఁ దడిసిననిజముఖాబ్జమున ముద్దాడెన్. 136

క. బంగరుఁదీవియ ఫలమును
గంగాశైవలిని వికచకమలముఁ బూర్వా
శాంగన శశిఁ గూడి తనరు
భంగి సుతుం గూడి యపుడు పార్వతి పొలిచెన్. 137

క. పదపడి ప్రీతిని నొసఁగెడు
మదనహరుని చేయి నూఁది మనమారఁగ నా
సుదతి సుతు నెత్తికొని స
మ్మదమునఁ జద లంటునిజవిమానము నెక్కెన్. 138

క. మృడుఁ డపు డెలమి మెయి గగు
ర్పొదువఁగ గిరిజతోడవలనఁ బుత్త్రుఁ దిగిచె నా
మృడుతోడవలనఁ దిగిచె న
ప్పడఁతి కొడుకు నతఁడుఁ దిగిచెఁ బదపడి ప్రేమన్. 139

క. నేత్రానందకరుని నా
పుత్త్రుఁ బవిత్త్రుని వహించి భూమీధరరా
ట్పుత్త్రి తనుఁ గవుఁగిలింపఁ ద్రి
నేత్రుఁ డచ్చోటు విడిచి తనదు నెలవున కరిగెన్. 140

క: తుంగోజ్జ్వలరజితాచల
శృంగవిరాజన్నిశాంతసీమకుఁ జని యా
గంగాధరుఁ డుత్సవముఁ ద
గంగం గావింపఁ బ్రమథగణములఁ బనిచెన్. 141

క. మెండుగ సంతస మెడఁదల
నిండి తొలఁకి యాడఁ బ్రమథనిచయం బపు డ
క్కొండలదొరమనుమనిజని
పండుగఁ గావింపఁ గడఁగెఁ బరమప్రీతిన్. 142

క. పటికపుమేడల దివిష
ద్విటపినవప్రసవలసిత విస్ఫురితరుచి
స్ఫుటితాభ్రకనకతోరణ
పటలంబులఁ గట్టి రంతఁ బ్రమథగణంబుల్. 148

క. ఒక్కట గణములు సఱవఁగ
ఢక్కాధమధమరవము గడల్కొని పఱచెన్
దిక్కులకుఁ దదధిపతులకు
నక్కడియుత్సవముఁ దెలుప నరిగెనో యనన్. 144

క. ఆధరమున రహిఁ వచ్చి ర
సాధరపతికూఁతుచేత సత్కృత లగువి
ద్యాధరగంధర్వకిసల
యాధరలమనోజ్ఞగీతికారవ మెసఁగెన్. 145

క. మాత లపుడు శుభవస్తూ
పేతకరాంబురుహ లై సమిద్ధాక్షతదూ
ర్వాతతి నాదల నిడి గా

రీతనయుం దొడలఁ జేర్చిరి ప్రియం బెసఁగన్. 146

క. లలితాంక్యాలింగోర్ధ్వక
ములమంద్రమనోజ్ఞనాదములు సెలఁగ మరు
ల్లలనామణు లాడిరి యు
జ్జ్వలభావసువృత్తగీతసంధులు పొసఁగన్. 147

క. తెమ్మెరలు వీచె సౌఖ్యక
రమ్ముగ నిర్మలత దిశలు రాజిల్లె విధూ
మమ్మయి యనలము మండె జ
లమ్ములు నింగియును నిర్మలము లై వెలసెన్. 148

క. దుందుభిమృదంగశంఖా
మందస్వనగర్జితములు పులసె విహాయో
స్పందసువిమానజలద
బృందలసద్విశదకుసుమవృష్టియుఁ గురిసెన్. 149

క. ఈరీతిని హాయిచేసిన
గౌరీతనయోత్సవము జగత్త్రయిని ముదా
పూరితను జేసె నత్తఱిఁ
దారకదనుజేంద్రులక్ష్మి తద్దయు వడఁకెన్. 150

క. పిశప విచిత్రప్రమదా
స్పదబాలక్రీడఁ దేలుషణ్ముఖుని సుమా
నుదనహారులు గని యెలమిం
బొదలిరి సుతుబాలలీల మోహం బిడదే. 151

క. గిరిజాగిరిశు లపు డజా
తరదనముల సుతుషడ్వదనముల సుమనో
హరములఁ జేరం దిగుచుచు
వరుసఁ ముద్దిడిరి గాఢవాత్సల్యమునన్. 152

క. నడ నెడ నెడఁ దప్పటడుగు
లిడుచుఁ బడుచుఁ గడఁగి లేచు నెడ వడఁకుచు నే

ర్పడ కడరెడుతనమురి వెపు
నడకలఁ గొడు కెలమిఁ గూర్చె నగజేశులకున్. 153

క. ఇలువెలుపల నాడి రజః
కలుషితతను వొప్ప నంకగతుఁడై నగుమో
ములముద్దు లొలుకుతొక్కుం
బలుకులఁ బలికందులం గొమరుఁ డలరించున్. 154

క. దుర్దమలీల హరబలీ
వర్దవిషాణములఁ గొను భవానీమృగరా
ణ్మర్దనముం బొనరించుఁ గ
పర్దికొడుకు భృంగిసిగను బట్టి కదల్చున్. 155

క. ముక్కంటిపృథూరుతలం
బెక్కి యొకటి మూఁడు తొమ్మిదే డైనను దగ
నిక్కి గళోరగరదముల
లెక్కించుఁ గుమారుఁడు బాలలీలాపరుఁడై. 156

క. నీలగళగళాలోలక
పాలస్రగ్వదనరదనపంక్తిని ముక్తా
పాళీశంకితహృదయుం
డై లాగుం గార్తికేయుఁ డతిరభసమునన్. 157

క. గంగాధరోత్తమాంగత
రంగిణీరంగత్తరంగరాజిఁ దడిపి త
త్సంగజజాడ్యము వోఁ జేయు
గాంగేయుఁడు నిటలదృక్శిఖాతతిఁ గాఁచున్. 158

క. పంచశరహరుం డించుక
వంచినకంఠంబుతోన వంగెడు జడలన్
మించువిధంబున మించున
మంచచ్చంద్రకళ నక్కుమారుం డంటున్. 159

క. ఈలీలఁ గొడుకు శైశవ

కేళిని నోలాడుచుండ-గిరిజేశులు త
ల్లీలాలోకవినోద
శ్రీలోలత నెఱుఁగరైరి-రేయుం బవలున్. 160

ఉ. ఊఱట లేక యిట్లు వివి-ధోజ్జ్వలబాల్యవిచేష్టితంబులం
దీఱమిఁ గల్గి పేరెలమిఁ-దేలుచు నొక్కట నద్భుతంబుగా
నాఱవనాఁడు ప్రాప్తనవ-యౌవనుఁడై బహుశాస్త్రవిస్మృతిన్
మీఱి మహాస్త్రవిద్యకలి-మిన్ గడిదేఱెఁ గుమారుఁడంతయున్.

శా. హింసాలాలసరాక్షసాధమమహా-హీంద్రాన్వవాయప్రవి
ధ్వంసాపాదనచండతుండభయకృ-త్తార్క్ష్యాయితాజిహ్వగా
హంసేందూజ్జ్వలవీక్షణా భువనస-మ్యగ్రక్షణైకక్షణా
సంసారాంబుధిమగ్నలోకతరణీ-సద్భక్తచింతామణీ. 162

క. అగ్నిసదృక్తేజ భవ్యో
ద్విగ్నజనశరణ్యానామ-ధేయ చరణాసం
లగ్నాత్మమనోనిలయా
భుగ్నభ్రుకుటినిరస్త-పూర్వసుపర్వా. 163

మాలినీ. విశదవిసృతకీర్తీ-వేదజాలాగ్రవర్తీ
ప్రశమితవినతార్తీ-పావనానందమూర్తీ
దశరథనృపపుత్రా-దానవధ్వాంతమిత్రా
కుశలకరచరిత్రా-క్షోణిజాతాకళత్రా. 164

గద్యము. ఇది శ్రీమద్వేంకటస్వామిరాట్పౌత్ర తమ్మయరాట్క
వీంద్రపుత్ర విబుధవిధేయ వేంకటసూర్యప్రసాదరాయప్రణీ
తంబైన నిర్వచనకుమారసంభవమహాకావ్యంబు నందుఁ
జతుర్థాశ్వాసము.

---



శ్రీ

రామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# నిర్వచనకుమారసంభవము

## పంచమాశ్వాసము.



గృహిణీగేహాదుర్గో
భాగ మహాభాగలభ్య పదయుగసేవా
యోగా తల్పాయితఫణి
భోగా రిపుభీమధామ భూమారామా. 1

తే. అవధరింపుము పిదపఁ గ్రూరామరారి
పీడితుం డయి జేజేలఁ గూడి వజ్రి
యంధకారినిఁ జేరంగ నరుగుదెంచె
దప్పిమై మబ్బుఁ జేరుచాతకము వోలె. 2

క. సుత్రాముఁ డట్లు సురద
స్యుత్రాసఖిలాభ్రపదవి నొదుగుచు హిమవ
త్పుత్రీశపదన్యాసప
విత్రధరిత్రీధరమును వెసఁ బ్రాపించెన్. 3

క. అందు జలధరాత్మక మగు
స్యందనమును సూతదత్తహస్తుఁ డగుచు సం
క్రందనుఁడు డిగ్గి శివునెల
వెందె నపుడు గ్రీష్మతుషితుఁ డుదకంబు బలెన్. 4

క. అట నిటు నటుఁ దిరుగుచు హరి

పటికపుగోడలను నీడ వాఱఁగ మే నో
క్కటి యయ్యుఁ బెక్కు దోఁపఁగ
నిటలాక్షుగృహాంగణావనీస్థలిఁ జేరెన్. 5

క. చంచన్మణిరుచిరూషిత
కాంచనదండప్రచండకరుఁడై యుద్దీ
పించెడునంది నిలుచుసౌ
ధాంచద్ద్వారమును బిదప హరిహయుఁ డొందెన్. 6

క. నంది యపుడు మన్ననలఁ బు
రందరు సంతుష్టుఁ జేసి రాగంబునఁ గ
తుం దనవేత్ర మునిచి చని
యిందుధరున కింద్రురాక యెఱుఁగం జెప్పెన్. 7

క. బొమసన్న జగత్పతి యగు
నుమాపతి యనుజ్ఞ నంది యొంది యపుడ తా
నుమనస్సహితుం డగున
య్యమరేశుఁ బ్రవేశపెట్టె హరుసదనంబున్. 8

క. నానాస్వరూపసంకలి
తానేకగణాన్వితుఁ డయి యచ్చట బహుర
త్నానూనసభాస్థలి నా
సీనుం డై యున్నశివుని జిష్ణుఁడు సూచెన్. 9

క. హరిఫణిఫణారత్న
స్ఫారమయూఖోల్లసత్కపర్దుం డగుచుం
గైరికముఖధాతుమయసు
మేరుపుశృంగంబుమాడ్కి మించెడువానిన్. 10

క. రంగదభంగోత్తుంగత
రంగ యగుచు నురువులం ధరాధరజ నిజో
త్సంగస్థ నగుగతిం దగు
గంగఁ గపర్దమునఁ దాల్చి క్రాలెడువానిన్. 11

క. శిరమున సురనదితరఁగలఁ
గరము ప్రతిఫలించి పెక్కుగాఁ దోఁచుశశిం
ధరియించి హిమసితాంశు
స్ఫురణము నలుదెసల నెసఁగఁ బొలిచెడు వానిన్. 12

క. కాలాగ్నికల్ప మురురుచి
జాలాధఃకృతరవీందుచక్షువు విలస
త్ఫాలస్థము దగ్ధస్మర
మాలోచన మెసక మెసఁగ నలరెడువానిన్. 13

క. లలితానర్ఘ్యమణివ్రజ
విలసద్ద్యుతులం గరంబు వెలుఁగుశ్రవణకుం
డలముల నెపమున నినుఁడుం
జలివెల్గుం గొలువఁగా నెసంగెడువానిన్. 14

క. ఎలమిం దాల్చినగౌరీ
గళవిస్ఫురితేంద్రనీలకంఠిక యో నా
నలరారునీలకంఠో
ల్లలితమహాదీప్తి మైఁ జెలంగెడువానిన్. 15

క. కాలార్దితజంతుచితా
ధూళిసితాంగుఁ డయి దంతితోల్గప్పి మహా
కాలాభ్రాచ్ఛాదిత మా
ప్రాలేయాచలముమాడ్కి భ్రాజిలువానిన్. 16

క. కేలం బ్రాజాపత్యక
పాలము రాజిల్ల సురవిపక్షకరోటీ
మాలాలంకృతుఁ డగుచుఁ ద్రి
శూలము ధరియించి కలయఁ జూచెడువానిన్. 17

క. తలఁ గలజాబిలియమృతపుఁ
గళుకులఁ జైతన్య మొలయఁగాఁ బ్రాఁబలుకుల్
వలికెడుప్రాఁతనలువపును

కలపేరు గళమున వ్రేలఁగఁ గాఁ దగువానిన్. 18

క. కనకలతాప్రభఁ దెగడుచుఁ
దనతోడను వసించి యున్న ధరవరసుత చే
తను జంచలచేత శర
ద్ఘనఖండము వెలుఁగుపగిదిఁ దనరెడువానిన్. 19

క. అంధకహార మసురకుసుమ
గంధీనై ధవ్యకరణకారణము మహా
సింధురదనుజక్రధనధు
రంధరము పినాక మూని రాజిలువానిన్. 20

క. భాసురరత్నఖచితసిం
హాసనమునఁ గూరుచుండి హస్తధృతజ్యో
త్స్నాసితచామరగణసము
పాసితుఁడై దీప్తులడర భాసిలువానిన్. 21

క. ఘోరాస్త్రశస్త్రవిద్యా
సారాభ్యసనంబుఁ జలుప సహవిస్మయులై
పారిషదులు గనఁ దనరుకు
మారుఁ గుమారుఁ గనుదగ్ధమారుణ్ ధీరున్. 22

క. గౌరీనారీరమణుశ
చీరమణుఁడు సూచి యుబ్బ చేతోవిగళ
త్సారుం డయ్యె నెవఁడు తే
జోరాశులఁ గలఁక లేక చూడఁగ నోపున్. 23

క. విరిసిననెత్తమ్మికొలఁకు
సిరిఁ దెగడెడువేయికనుల శివునిఁ గనుచు మై
గరుపాఱ నయ్యమరపతి
విరుల వఱలుకన్నెమావివిధమున నొప్పెన్. 24

క. ఈకరణిన్ వేకన్నుల
నాకేశుం డీశుఁ గని కృతార్థుం డైత

త్ప్రకటవైరూప్యంబుఁ బ్రి
యాకోపకరంబుఁ గాఁగ § నాత్మఁ దలంచెన్. 25

క. గౌరీశుచెంత మెలఁగుకు
మారు మహామేరుధీరు § మహితాస్త్రాభ్యా
సారూఢచిత్తుఁ గని యా
స్వారాజపు డెద వహించె § శత్రుజయాశన్. 26

క. సుత్రాముఁడు త్వత్పదశత
పత్రములకు మ్రొక్కి వేడ్కె § పడి వేచెఁ గృపా
పాత్రముగఁ జేయుచూడ్కిఁ ద్రి
నేత్ర పఱపు మీసహస్ర § నేత్రునిమీఁదన్. 27

క. అని యిట్లు నంది కరా
వినిహితమణిఖచితహేమ § వేత్రుం డగుచున్
మునుమున్న కృపాపాత్రం
బ నగుదు నని విన్నవించెఁ § బ్రమథాధిపుతోన్. 28

క. సురగణసంసేవ్యుం డగు
హరిహయుఁ డై త్రైలోక్యసేవ్యుఁ § డయ్యెం దుకళా
ధరుఁడు ప్రసాదించె సుధా
కిరదాలోకనముచే న § కించిత్ప్రీతిన్. 29

క. నిర్గళితముకుటకల్పక
వర్గం బగుమస్తకంబు § వాంచి వినీతిన్
స్వర్గౌకోవంద్యుం డా
భర్గునకుఁ ద్రిలోకవంద్య § పదునకు మ్రొక్కెన్. 30

క. సర్వజగద్వంద్యుం డగు
శర్వునిపదపద్మములకుఁ § జాఁగి యెఱఁగి యు
గ్గీర్వాణగణాధీశుఁ డ
పూర్వకృతార్థత్వ మొంది § పూతుండయ్యెన్. 31

క. గణనీయచరణపీఠాం

గణనీరంధ్రాత్తముకుటకాంతిచయమునై
గణములముందఱ నిర్జర
గణములు గడు భక్తి మ్రొక్కెఁ గఱకంఠునకున్. 32

క. ఆసమయంబునఁ బశుపతి
శాసనగణసముపనీతజాంబూనదది
వ్యాసనమున వసియించి సు
నాసీరుం డలరె నిజమనఃకంజమునన్. 33

క. మఱియు మహేశునిచూడ్కుల
జఱునగవుల మన్ననలను జెంది యలరి య
క్కఱకంఠుకనుల కగపడు
తెఱఁగునఁ గూర్చుండి రఖిలదేవత లంతన్. 34

క. చేతులు మోడ్చి యసురపరి
భూతు లగుట నెమ్మొగములు పొలు పఱి దైన్యా
న్వీతు లయి తన్నుఁ గనుపురు
హూతముఖామరులఁ జూడ నుగ్రుఁడు పలికెన్. 35

క. ఓహో సురలారా శౌ
ర్యాహీనులు భీషణాస్త్రు లగుమీ మొగముల్
నీహారగ్రస్తాబ్జవి
భాహైన్యము నొందె నేమి పాటిలె నొక్కో. 36

క. సురవర్యులార సుమహ
త్తరసుకృతుల యయ్యు స్వఃపదము వాసితి రే
చిరకాలభుక్త మగుమీ
యురురాజ్యవిభూతి వాయకుండును గాతన్. 37

క. మహనీయం బగుదైవత
గృహము విడిచి మనుజు లట్లు గిరికాననసం
పిహిత మగుమహీస్థలిపై
మహాపురుషులార యేల మలఁగెదరో కటా. 38

క. నిరుపమ మత్యంతమనో
హర మై దేదీప్యమాన మగుతత్పురమం
దిరము నెవనిచేఁ బాసిరి
దురితంబునఁ బుణ్యరాశిఁ దొలఁగెడుమాడ్కిన్. 39

క. ఆర్యవరులార యుష్మ
ద్ధైర్య మెవం డడఁచె నో నిదాఘప్రోద్య
త్సూర్యోష్మలత యగాధా
హార్యజలాశయజలంబు నడఁచువిధమునన్. 40

క. పాకారిపురస్సరు లై
యీకరణిన్ మీరు రాక కేమికతం బో
లోకత్రయజిత్వరశౌ
ర్యాకరతారకుని వైర మందిరె చెపుఁడా. 41

క. ఆరక్కసుచేసినన్య
క్కార ముడుప నాకుఁ దక్కఁ గా దొరులకు న
వ్వారిదము దక్క విపినద
వారంభము నుడుపఁ గలవె యన్యము లెందున్. 42

క. అని యిందుధరుఁడు వలుకఁగ
విని యింద్రప్రముఖు లైనవిబుధులప్రమదో
జ్జనితాశ్రుతరంగితముఖ
వనరుహములయందుఁ గ్రొత్తవన్నె యెసంగెన్. 43

క. తరువాత గిరీశునివా
గ్వారామమున సమయ మబ్బ వృత్రహుఁ డనియోన్
గిరిశునితో విభుసమయం
బరసి పలుకుపలుకు సిద్ధి నలవడఁ జేయున్. 44

క. కరము తమోహార మవిన
శ్వర మగుజ్ఞానప్రదీపసంపద నీకుం

జరగినది -జరగుచున్నది
జరగెడునది గోచరంబ । సర్వజ్ఞ శివా. 45

క. విస్మయకరదోర్బలసుర
ఘస్మరతారకుఁడు దివము । గైకొని మము వీ
తస్మయులఁ జేసి తఱుముట
హాస్మరహర నీకుఁ దెలియ।నట్టిదె చెపుమా. 46

క. వనజాసనువరగర్వం
బున నసుర జగజ్జిగీష।బుద్ధిఁ బొడముదున్
ననుఁ దొట్టి నిర్జరుల నె
ల్లను దృణకల్పముగ నెదఁ ద।లంచుచు నుండున్. 47

క. మును మాసన్నుతుల నలరి
వనజభవుఁడు వలికె నాహ।వంబునఁ బురజి
త్తనయుఁడు సేనాపతి యై
దనుజునిఁ దారకునిఁ జంపుఁ । దథ్యం బనుచున్. 48

క. పదపడి యింతదనుక నీ
త్రిదశులు తద్దనుజకృతప।రిభావార్తిన్
హృదయ మడల వానిపనుపు
నెదఁ గైకొని చేయు చుండి।రే మనువాఁడన్. 49

క. వేసవివేఁడిమి నెంతయు
వాసిచెడినయోషధులకు । వారిదముబలెన్
మాసేనానిగ మాకున్
నీసుతు దయచేసి వేగ । నియమింపు హరా. 50

క. శూలధర భవత్తనయుం
డాలమునకుఁ గడఁగి మాకు । నగ్రేసరుఁ డై
త్రైలోక్యహృదయశూలను
నాలేఖద్విషు వధించి । యులమట వాపున్. 51

క. ఘోరాజిని నీకొమరుఁడు

క్రూరాస్త్రంబులను దనుజకోటిశిరంబుల్
ధారుణిఁ గూల్పఁగఁ దద్వని
తారోదన మెసఁగుఁ గాత దశదిశలందున్. 52

క. భావజహర నీసుతుఁడు ర
ణావనికిం బలిగ నమ్మహాసురుఁ దునుమన్
దేవగణంబులు సురబం
దీవేణీమోక్షణంబు నెఱపుం గాతన్. 53

క. అని సురనాథుఁడు వలుకఁగ
విని యీశుఁడు దైత్యదుర్వివేకంబునకుం
గనలి సుపర్వులయందలి
యనుకంపన్ మఱియు నిట్టులని వాక్రుచ్చెన్. 54

క. అనిమిషులారా మీరలు
వినుఁడీ నాభాషితంబు వేగమ యస్మ
త్తనయాదులతోడుత మీ
పనిపొంటెఁ గడంగి వంత వాపెదఁ జుండీ. 55

క. యతచిత్తుఁ డైననే మును
క్షితిధరజపరిగ్రహంబు సేయుట గిరిజా
సుతుఁ డైనవీరుచే నా
దితిజాధముఁ డాహవమునఁ దెగు నని కాదే. 56

క. కానఁ గుమారుని మీరలు
సేనానాయకునిఁ జేసి శీఘ్రంబుగ న
ద్దానవుఁ జంపుఁడు నాకసు
ఖానుభవం బందుఁ గాత హరి సామరుఁ డై. 57

క. అని యానతిచ్చి పశుపతి
తనయు మహాసాంపరాయతత్పరచిత్తుం
గనుఁగొని యుద్ధంబున న
య్యనిమిషరిపునిఁ దునుము మని యాజ్ఞాపించెన్. 58

క. ఆరుద్రునిపలుకు విని కు
మారుండు వినీతి నమ్రమస్తకుఁడై య
గ్గౌరీశుపనుపు సేకొని
ధారుణిఁ బితృభక్తుల కిది ధర్మువు గాదే. 59

క. త్రైలోక్యనాథుఁ డగునా
శూలి వనుపఁ గలని కడరు సుతుఁ గని యలరెఁ
శైలాత్మజ సుతుదురమున
హాళికి నేవీరమాత యలరక యుండున్. 60

క. సురరిపుతరుణీకజ్జల
హరు జగదభయప్రదాత హరుసుతుఁ గని ని
ర్జరు లెల్ల నలరి రభిమత
పరిపూర్తి నెవండు ముదముఁ బడయక యుండున్. 61

క. పదపడి ప్రస్థానమునకు
నొదవెడువేషంబుఁ దాల్చి యుగ్రుకొడుకు తోఁ
ద్రిదశులు రాఁ దల సోఁకఁగ
మదనహరుని పదములకు నమస్కృతి సేసెన్. 62

క. హరుఁ డడుగుల కెరఁగు కొడుకు
శిరమును మూర్కొనుచు వత్స శీఘ్రంబుగ ని
ర్జరరిపు దురమునఁ బొరిగొని
హరిరాజ్యము నిలుపు మయ్య యని దీవించెన్. 63

క. వినతశిరస్కుఁ డయి గుహుఁడు
జననిపదాబ్జముల కపుడు చాగి యెరఁగ న
వ్వనిత ముదశ్రుసలిలవృ
ష్టిని సుతు సైన్యేశతాభిషిక్తుని జేసెన్. 64

క. తనయుశిరము మూర్కొని తొడ
నునిచి కవుఁగలించి యప్పు డుమ వలికెం ద
ద్దనుజుఁ దునిమి వీరసువును

ననుఁ జరితార్థగ నొనర్చు నాయన యనుచున్. 65

క. గౌరీశుల వీడ్కొని దే
వారివిపత్కారణుఁడు మహాసమరక్రీ
డారంభరతుం డైనను
మారుఁ డపుడు వెడలెఁ ద్రిదశమందిరమునకున్. 66

క. ఇంద్రాద్యమరులును సుమా
చంద్రకళాధరుల కెరఁగి సమ్మదమున ని
స్తంద్రపరాక్రముఁ డైనగి
రీంద్రునిదౌహిత్రుతోడ నేఁగిరి చదలన్. 67

క. ఇక్కరణిఁ ద్రిదశు లెల్లరు
నొక్కుమ్మడి దేహకాంతు లొప్ప వెడలుదుఱ
రిక్కతెరువు దివసమునను
జుక్కలతోఁ గూడుకొనిన సొబగు వహించెన్. 68

క. సౌరగణమునడుమ నిజశ
రీరద్యుతు లెసఁగఁ గా గిరీశాత్మజుఁ డొ
ప్పారె విహాయస్స్థలి గ్రహ
తారాగణమధ్యమున సుధాకరుమాడ్కిన్. 69

క. గోత్రపతిసుతాత్మజుతో
సుత్రామప్రముఖు లైన సురలోకము న
క్షత్రపథము నొక్కగడియ
మాత్రఁ గడచి చేరె నపు డమరలోకంబున్. 70

క. సురవైరిపరాక్రమమునఁ
జిరదృష్టం బైనదివముఁ జేరియు దానిం
జొర నేర కయ్యఖిలని
ర్జరు లయ్యెడ మసలి రధికసాధ్వసపరు లై. 71

క. మును నీ వరుగుము నే మును
చన నీ వే చనుము నేను జన నని యూరీ

తిని భీతి వంతు లాడుచు
ననిమిషపురి కేఁగ రైరి యనిమిషు లంతన్. 72

క. నాకసమాలోకమునకు
నాకౌకశ్శత్రుభయమునం బోవక య
ప్పాకారిప్రముఖసురలు
శ్రీకంఠసుతాస్య మందుఁ జేర్చిరి చూడ్కుల్. 73

క. అంతట ఘోరాహవదు
ర్దాంతుఁ డగుకుమారుఁ డసుర రాఁ డాయె నటం
చెంతయుఁ జింతిలుచు శచీ
కాంతముఖామరుల కనియె గారవ మెసఁగన్. 74

క. సురలార భయంపడకుఁడు
త్వరఁగా దివమునకుఁ బోవుదము రండు సము
ద్ధురబలుఁ డగునా తారక
సురశత్రువు నచట మనకుఁ జూడఁగ వచ్చున్. 75

క. ఏవానిభుజాదండము
దేవపురీలక్ష్మి నెఱులఁ దివియఁ గడఁగు నా
దేవారిరక్తపానముఁ
గావించెడు నట మదీయఖరమార్గణముల్. 76

క. మహితప్రభావతేజో
సహా యీూనాశక్తి నాకసంపదఁ గొను న
య్యహితుసకుండలమస్తము
మహిఁ గూలిచి మీకుఁ గడుఁ బ్రమదముం గూర్చున్. 77

క. అని యిట్లు పలికి తారక
దనుజుఁ దునుమఁ గడఁగుమృడునితనయునిపలుకుల్
విని యత్తఱి సస్మితముఖ
వనరుహ మై యలరె నమరవర్గం బెల్లన్. 78

క. పరమామోదము మె మె

గరుపాఱఁగ వేయికనులుఁ గడు వికసిల్లన్
హరసుతుఁ జేరి మిథోంబర
పరివర్తన మాచరించె బలరిపుఁ డంతన్. 79

క. అఖిలజగత్కర్త చతు
ర్ముఖుఁ డచటికిఁ జని ముదశ్రుపూర్ణములఁ జతు
ర్ముఖముల నెలమిని నాష
ణ్ముఖునాఱుమొగములఁ దిగిచి ముద్దిడె నంతన్. 80

క. ఆస్వార్జటిసుతుఁ గని వి
ద్యాధరగంధర్వసిద్ధతతు లపుడు మహా
యోధనమున తారకదను
జాధము వధియింపు వీర యని నుతియించెన్. 81

క. హరనందను నారదముఖ
సురమునిసంఘుంబు పిదప స్తుతియించి పర
స్పరకనకాంబరవల్కల
పరివర్తన మాచరించెఁ బరమప్రీతిన్. 82

క. త్రిదశులు శక్తిధరుం డగు
మదనాంతకసుతుని ప్రాపుమై నిర్భయులై
కదలిరి దివికిం గానకు
మదయూధపశక్తి నేఁగుమదకరులగతిన్. 83

క. జలకేళీలాలసనుర
లలనాప్రత్యూళితాంగలాక్షాదిరసా
విలపాటలజలపూరో
జ్జ్వలసురధుని నపుడు త్రిదశసంఘము సేరెన్. 84

క. వారివిహారనిరతది
గ్వారణకరహతతరంగవాఃపూరములం
దీరధరారుహాసురవను
ధారుహములపాదు లెల్లఁ దడివెడుదానిన్. 85

క. కేళీలాలస లగుసుర
బాలికలు కడుఁ మనోజ్ఞ। భంగిఁ గనకపుఁ
వాలుకఁ బ్రోవిడి తీర్చువి
శాలోజ్జ్వలవేదికల నె।సంగెడుదానిన్. 86

క. తమ్ముల తావి కెనయు భ్రమ
రమ్ములఝంకృతులఁ బసిఁడి।రాయంచలరా
వమ్ముల విరిసినతమ్ముల
కమ్మనిపుప్పొడులఁ గరము। గ్రాలెడుదానిన్. 87

క. తనుఁ గనుఁగొను కౌతుకమునఁ
జనుదెంచిన యచ్చరలల।సత్ప్రతిబింబా
ళిని ఘనతరంగములఁ జే
కొని చూచుజనముల కెలమిఁ। గూర్చెడుదానిన్. 88

క. చిరకాలదృష్ట యగునా
సురదీర్ఘికఁ జూచి యలరి। సురనాథుఁడు సా
దరముగ నయ్యైచోటులు
హరసూనున కపుడు సూపె। నగ్రేసరుఁడై. 89

క. సర్వామరసేవితుఁడై
శర్వాత్మజుఁ డచట నిలిచి। సంప్రీతినిఁ ద
త్పూర్వాలోకిత యగునా
స్స్వర్వాహినిఁ గాంచి మిగుల। సంతస మందెన్. 90

క. చేరం జని మఱియును నా
గౌరీసూనుఁడు కిరీట।ఘటితాంజలి యై
సౌరతరంగిణికి నమ
స్కారముఁ గావించె సురల। సన్నుతు లెసఁగన్. 91

క. ఫుల్లాంబుజములఁ గదలిచి
కల్లోలాలింగనంబుఁ। గావించి మరు
త్కల్లోలిని తెమ్మెర ల

ల్లల్లన చనుదెంచి గుహునియలపు దలంగెన్. 92

క. బృందారకశైవలినీ
సందర్శన మటులు సలిపి శంభుకొడుకు సం
క్రందనుఁడు త్రోవ సూపఁగ
నందనవని కరిగి భగ్ననగములఁ జూచెన్. 93

క. ఈరాజదుపవనం బా
తారకుచేఁ జెడియె ననుచుఁ దలఁచి మహాకో
పారుణలోచనుఁ డై గౌ
రీరమణీసుతుఁడు దుర్నిరీక్ష్యుం డయ్యెన్. 94

క. దుర్గమవిమానమార్గన్
స్వర్గపురిన్ విశ్వసార ధ్వస్తోపవనీ
వర్గన్ నిరస్తసౌధం
దుర్గాప్రియసూనుఁ డపు డెదురఁ బొడగాంచెన్. 95

క. వైరిపరిభూత దీనా
కారన్ శోభావిహీనఁ గ్రతుభుజ్నగరిన్
నారి ననాథం బోలెఁ గు
మారుఁడు పొడగని దయార్ద్రమానసుఁ డయ్యెన్. 96

క. భీకరచేష్టితుఁ డగునా
రాకాసిపనులకుఁ గనలి రణతత్పరుఁ డై
యాకార్తికేయుఁ డప్పుడు
నాకంబుం జొచ్చె సురగణంబులు గొలువన్. 97

క. దైతేయదంతదంతా
ఘాతక్షుణ్ణములు భుజగకంచుకజాలా
స్వీతస్ఫాటికహర్మ్యము
లాతం డప్పురినిఁ గాంచి యడలెన్ మఱియున్. 98

ఉ. బంగరుతమ్ములం దొఱఁగి పాడఱు దాని మహోగ్రదైత్యమా
తంగమదావిలోదక విదారితరత్నవితర్ది హైమచ

క్రౌంగవిరావసూన్యఁ దృణ§కాష్ఠసమావృత దీర్ఘికాలి న
య్యంగజవైరిసూతి గని § యప్పురిదుర్దశ కాత్మఁ జింతిలెన్.

క. అంత హరి గుహునిఁ దద్గజ
దంతక్షతహైమకుడ్య§తలము విలోల
త్తంతువ్రజవిగళన్మణి
సంతతి యగువైజయంత§సౌధముఁ జేర్చెన్. 100

క. హరిహయుఁడు తెరువు సూపఁగ
సురలు గొలిచి రా గుహుండు § సురుచిరమణిరు
గ్విరహిత యగునారోహణ
సరణిని నామేడపైకిఁ § జయ్యన నెక్కెన్. 101

క. మందారతోరణంబుల
నంద మయి సురాంగనాఢ్య § మై సురమునిరా
డ్బృందకృతస్వస్త్యయనము
నందినయాలోనఁ జొచ్చె § హరసుతుఁ డంతన్. 102

క. పిదప నుమాసూనుఁడు లే
ఖదనుజకులవృద్ధుఁ డైన§కశ్యపమౌనిం
గదియం జని వలగొని త
త్పదములకు మ్రొక్కె పశ్వో§దనములు సోఁకన్. 103

క. వినమితశిరస్కుఁ డై య
య్యనలాత్మునిసుతుఁడు పిదప § నదితికి దివిష
జ్జననికిఁ ద్రిజగద్వంద్యకు
వినతిం గావించె భక్తి § వెల్లివిరియఁగన్. 104

క. సురమాతయుఁ గశ్యపుఁడును
హరసూనునిఁ గాంచి మిగుల § నలరుచు దీవిం
చిరి యుగ్రవీర్యుఁ దారకుఁ
బొరిగొని యాలమున జయముఁ § బొందు మటంచున్.

క. తనుఁ జూడ వచ్చి దైవత

జననిదరిని నున్న యమర । సతులం జేరం
జని మ్రొక్కి నాసతులు శివ
తనయుని దీవించి రధిక । తాత్పర్యమునన్. 106

క. ఈశునికొమరుఁడు పిదప సు
రేశుకళత్ర మగుశచికి । నెరఁగెఁ బ్రియముమై
నాశఫరాయతనయనయు
నాశీర్వాదమున నతని । నభినందించెన్. 107

క. అత్తఱిఁ దనుఁ గన వచ్చిన
కృత్తికలం దల్లులను గి । రీశజుఁడు ముదా
యత్తమతిఁ జేరఁగాఁ జని
బత్తిని మ్రొక్కెను దదీయ । పాదంబులకున్. 108

క. ద్యోనాయకముఖదహనము
ఖానీకము ప్రమదవికసి । తానన మై యీ
శానప్రియసూనుని సుర
సేనావిభుతాభిషిక్తుఁ । జేసెం బిదపన్. 109

క. సురసైనాపత్యరమా
భరితు ఘనపరాక్రమాఢ్యు । భవుసుతు సకలా
మరులును గని వగపు దలఁగి
యరివిజయాశను వహించి । యలరిరి యంతన్. 110

క. సమరోత్సుకుఁడు జిగీషుఁడు
కుమారుఁ డపుడు పురికొల్ప । ఘోరాజిని న
య్యమరులు దనుజుఁ దునుము యు
ద్ధమునకు సన్నద్ధులైరి । తత్సమయమునన్. 111

క. హరసూతి సమీరమనో
తిరయము దుర్వార మగుచుఁ । దేజరిలువిజి
త్వర మను తేరెక్కి ధను
ర్ధరుఁడై వలకేల శక్తిఁ । దాలిచి వెడలెన్. 112

క. తుచ్ఛారివిపత్కారణ
మచ్ఛస్వశ్రీవిపత్తి § హర మై ముక్తా
గుచ్ఛముల నొప్పుతపనీ
యచ్ఛత్త్రం బొకఁడు పట్టె § హరసుతుమీఁదన్. 113

క. శారదశశభృత్కరసుష
మారాజద్వ్యజనవీజ్య § మానుం డగున
గ్గౌరికొడుకు సురకిన్నర
చారణతతి మధురభణితి § సన్నుతిసేసెన్. 114

క. యాత్రోచితవేష మెసఁగ
గోత్రగరుచ్ఛిదిఁ బవినిఁ § గొని హరమహీభృ
న్మిత్రాభ్రమువల్లభుపై
వృత్రహుఁ డపు డెక్కి గుహుని § వెనుకొని వెడలెన్. 115

క. చండక్రోధంబునఁ గడు
మండుచు గిరిశృంగసమస § మదమేషారూ
ఢుం డై మహనీయాస్త్రక
రుం డగు చపు డగ్ని గదలె § రుద్రజువెనుకన్. 116

క. హరినీలాద్రినిభకళే
బర మెసఁగఁగఁ గొమ్ముల ఘన § పంక్తిఁ గలఁచుకా
సర మెక్కి దండముం గొని
హరసూనునివజ్జ నడచె § నంతకుఁ డంతన్. 117

క. తారకుఁ బొరిగొనెడుతలఁపు
మై రోషం బెడఁదఁ బొడమ § మదభరితప్రే
తారూఢుం డై యత్తఱి
నైరృతి నడతెంచె గిరిశ § నందను మ్రోలన్. 118

క. పాశధరుఁడు నవఘననీ
కాశం బగుమొసలి నెక్కి § కలనికిని మహా
పాశముఁ గేలం బూని మ

హేశాత్మజుదండఁ బొలిచె హేలాగతులన్. 119

క. దిక్కులును రిక్కతెరువును
నొక్కుమ్మడిఁ గడవఁ గడఁగు నురుహరిణముపై
నెక్కి యనిలుఁ డాజికి న
మ్ముక్కంటితనూజుతోడ ముదమునఁ గదలెన్. 120

క. నరవాహనుండు ద్విపదను
హార యగుగదఁ గేలఁ దాల్చి యపుడు మహాసం
గరకేళీలోలుం డగు
హరపుత్త్రునిఁ గూడి వెడలె నాలంబునకున్. 121

క. ఘోరాహింపినద్ధజటా
ధారులును ద్రిశూలధరులు ధరరాట్పులితో
తౌరూఢులు నై రుద్రులు
గౌరీసుతుఁ గలసి చనిరి కయ్యంబునకున్. 122

క. తక్కంగలసురలును బెం
పెక్కినవిజవాహనముల నెక్కి రణార్థం
బక్కజకంఠునికొమరుని
ప్రక్కఁ బొలిచి రతులమోదరంజితముఖులై. 123

చ. హరిదధినాథులున్ సురలు నాగతిఁ గొల్వ సువర్ణకేతునుం
దర లసమానచామర ఘనాఘనతుల్యశతాంగనాదబం
ధుర గజఘంటికారవమనోహర శస్త్రరుచిచ్ఛటావృతాం
బర యగుదేవవాహినిఁ గుమారుఁడు దానడిపించెఁ బోరికిన్.

క. ఆలోలామరసేనా
కోలాహలములు విలోలగురుకేతువుల
వ్వేళ రసాగగనదిశా
జాలమ్ముల దళముకొనియె సమ్యగ్భంగిన్. 125

క. రక్కసిమూకలు బెగ్గిల
దిక్కులు ప్రతిరావములను దీటుకొనంగా

రిక్కతెరువు ఘూర్ణిల్లఁగ
ఢక్కానినదము మహోద్భటంబుగఁ జెలఁగెన్. 126

క. పృతనాధూళుల నిండిన
ఖతలము మథితాబ్ధిరవముఁ గలఁచుచు ననురీ
తతిగర్భముల డులుచుత
త్ప్రతిరవముల మొత్తపెట్టుపగిదిం దోఁచెన్. 127

క. అరదంబుల నలఁగి తురగ
ఖురములఁ బెల్లడరి ద్విరదకోటులచెవులం
బెరసి పడగల నెగసి బం
గరుమల పై ధూళి చదలఁ గ్రమముగఁ బర్వెన్. 128

క. రారాజద్రథ్యావళిఖు
రారూఢోత్పతదుపత్యకాప్తాపదధా
త్రీరజము మఱియు ముఖరస
మీరణముల నలుదెసలును మెండుగ నిండెన్. 129

క. పరి మరుదాహతినిఁ బొరిం
బొరి మీఁదం గ్రింద వెనుక ముందు నెగయు బం
గరుకెంధూళులు నవభా
స్కరుకాంతిని నవలఁ ద్రోచి కరము వెలింగెన్. 130

క. నలుదెసలఁ జదలఁ బొదలెడు
బలధూతసువర్ణరజము ప్రబలె నకాలో
జ్జ్వలసాంధ్యారక్తిమపిం
గల మగుజలముక్కదంబకముచందమునన్. 131

క. తళుకుఁబసిఁడి నేలల గజ
ములు స్వప్రతిబింబములను బొడగాంచి రసా
తలనముపాగతకరు లని
తలఁచి కనలి దంతములను ధరణిం బొడుచున్. 132

క. సిందూరరజఃపింజర

మందగమనసుందరోగ్ర క్రమ త్తకరుల కా
బృందారకగిరిభూముల
యందుఁ బ్రతిఫలించునొడళు లగపడ కుండెన్. 133

క. ఆహవతత్పర మై కో
లాహలముల గుహ లులియఁ జెలంగుచు దివిష
ద్వాహిని యాక్రైవడి హై
మాహార్యము డిగ్గె నతిరయంబున నంతన్. 134

క. మేరుగుహాశయసింహకి
శోరములు శతాంగనినదశోభితగజఘుం
టారవబృంహితములచేఁ
గూరుకు విడకుండెఁ గండక్రొవ్వకతమునన్. 135

క. భయదదరీప్రతినినదో
దయభేరీరవమిళద్రథధ్వని నాలిం
చియుఁ బండుట మృగరాజా
హ్వాయము వెలసె నాహరులకు నన్వర్థం బై. 136

క. మలతాలు బీఁటవెట్టఁగఁ
జెలఁగెడుసురబలమునులివు చెవి సోఁక మహా
బలమును మృగరాజత్వము
గలిమిఁ సింగములు మదముఁ గడుఁ బ్రాపించెన్. 137

క సురవాహినీభయంబున
హరిణంబులు వాఱిపోయె నతిదూరముగా
దరుల వెలలి హేలాగతి
హరులు నిలిచె నిర్భయముగ నయ్యెడలన్. 138

క. నాతులతోడుత నెంతయుఁ
గౌతుకమున స్వర్జనంబు గనుఁగొన సౌవ
ర్ణాతతమేరుప్రాంతర
సాతలముం దత్సుపర్వసైన్యము వుండెన్. 139

క. పసిఁడిమలచెంతఁ బొడమెడు
నసితహరితపీతలోహితార్జునవర్ణో
ల్లసితముల ధాతురజముల
నెసఁగెం గంధర్వపురిరహిం జద లంతన్. 140

క. చెవు లవియఁగఁ బొంగెడున
ర్ణవముక్రియం జెలఁగి త్రిభువనములఁ గలఁచు దే
వవరూథినీవిఘట్టన
భవనిర్ఘోషంబు దెసలు పగులఁగ నిగిడెన్. 141

క. కరిబృంహితముల భీకర
హరిహేషల వీరభటమహార్భటుల సము
ద్ధురతరశతాంగ మేదుర
విరావములఁ బటహరవము వినరా దయ్యెన్. 142

క. తారకునినిజాంతఃపుర
నారీకచకుచవిలోచనముల గజపతా
కారథహయముల సమరచ
మూరజ మత్తతిని సాంద్రముగ వ్యాపించెన్. 143

క. భూయస్థగితద్యుమణిమ
హీయఃపృతనారజోభ్ర మీక్షించి వడిఁ
రాయంచలు మానసమున
కై యరిగెఁ నెమ్ములాడె నభ్రభ్రాంతిన్. 144

క. కాలాంబుదనిభసేనా
ధూళి దళముకొనుచుఁ జదలఁ ఉలఁకింపఁగ హై
మాలోలత్కేతువుల
వ్వేళఁ దటిన్మండలముల విధమున నొప్పెన్. 145

క. పరిధూళి నిండురోదో
తరముం బొడఁగని జనంబు దర్కించెఁ దదు
ద్ధురరజ మిలఁ బొడమి చదల

నెరసెనో యటఁ బొడమి పుడమి నెరసెనో యనుచున్.

క. పొందుగ సూదుల భేదిం
పం దగినరజంబు కన్నుఁ బ్రామ జనులకుం
గ్రిందును మీఁదును వెనుకయు
ముందును బ్రక్కలును నొక్క పోలిక దోఁచెన్. 14

క. దిక్కరులమదం బింకఁగ
నొక్కట రథనేమినినద ముల్లసిలఁ మహా
ఢక్కాదివాద్యరవములఁ
బిక్కటిలి నభస్థలంబు పెల్లుగ మ్రోసెన్. 14

క. పుడమి సురసేన పట్టక
యడలుగదురఁ గొంత ప్రాయె నాకసమున క
య్యెడ రాపిడిని బడల్పడి
చెడి విచ్చలవిడినిఁ గాందిశీకం బయ్యెన్. 14

క. తుంగతురంగమహేష ల
భంగురమాతంగసంఘపటుబృంహితముల్
రంగద్రథప్రథిధ్వని
సంగతి వడఁకించె సకలజగతీతలమున్. 15

క. ఏనుంగులగర్జల ఘుం
టానాదంబుల మహోద్భటు మగుమహావీ
రానీకంబులసింహ
ధ్వానంబున దెసలు కలఁగి తల్లడపడియెన్. 15

క. భూరిద్విపదానపయో
ధారల నదు లుబ్బి తురగదారితభూధూ
ళీరాజిని నతిపంకిల
లై రథముల గట్టినేల యగు నొకమాత్రన్. 1

క. మెరకలు పల్లము లయ్యెఁ
మెరకలు నయి పల్లములును మించెను ధూళిం

గరిహారిరథముల రెయొరపిడి
ధరాతల మపుడ సమీాకృతం బై యొప్పెన్. 153

క. నలుదెసలు చదలు ప్రతిరవ
ముల నీనఁగ శైలసంఘములు కడు ప్రీలం
జలనిధులు పొంగి పొరలుచుఁ
గలఁగఁగ భేరీధ్వనులు జగంబులఁ గలఁచెన్. 154

క. కరువలి నిటునటుఁ గదలుచు
హరిదంతరములఁ దగంగ నలముకొనుధ్వజో
త్కరము వరకింకిణీకము
గురుధూళీజలధిఁ బడి యగోచర మయ్యెన్. 155

క. భైరవఘంటారవఘీం
కారవరానేకపప్రకరములు తద్బృం
దారకవరూథినిని ఘ
క్కారవముల మాటువెట్టె నానమయమునన్. 156

క. బలరవముఃఖురలను రజ
స్వలలను ధ్వస్తాంబరల దిశలఁ గాంచి యినుం
డలఘుతరరజస్తిమిరం
బులచే నంతర్హితత్వమును బ్రాపించెన్. 157

క. సైనికులు రజఃపూర్ణది
శానారిని నాక్రమింపఁ జదలు నిహతభే
రీనాదజంబులఁ బ్రతి
ధ్వానముల సమత్సరంబువలె గర్జిల్లెన్. 158

క. గాలిం దూలినగురుతర
శైలము లన నింగి ద్విరదసమితి చెలఁగె న
భ్రాలిబలెం దేరు లమరె
నీలీలఁ సంకులముగ నెసఁగెఁ సేనల్. 159

క. పరిమజ్జద్భూభృన్ని

ర్జరసేన వియద్ధరాంతరాళమున మహో
గ్రరవభరిత మై బలవద
సురలోకలయోద్భటాబ్ధిచొప్పనఁ జెలఁగెన్. 160

ఉ. కారణకార్యరూప శరఖండితరావణముఖ్యదైత్యలో
కా రణకోవిదా దివిజకార్యధురంధర భక్తతత్పరా
సారసనేత్ర మానిజనసన్నుతిపాత్ర సముల్లసత్కృపా
సారసమీక్షణా నయవిచారవిచక్షణ దివ్యలక్షణా. 161

క. అవ్యక్తా యక్షయ్య భ
వవ్యాధినిహంత విబుధవందిత మాదృ
క్కావ్యపవర్గాప్తికరణ
భవ్యగుణగణాభిరామ పావననామా. 162

మాలిని. ధరణిదుహితృసక్తా ధర్మమార్గప్రయోక్తా
పరయువతివిరక్తా భవ్యసత్కీర్తియుక్తా
దురితనిచయహర్తా తోషితామర్త్యభర్తా
పరమపదవిహర్తా భక్తలోకోపకర్తా. 163

గద్యము. ఇది శ్రీమద్వేంకటస్వామిరాయపౌత్ర తమ్మయరాట్కవీం
ద్రపుత్ర విబుధవిధేయ వేంకటసూర్యప్రసాదరాయ ప్రణీతం
బైన నిర్వచనకుమారసంభవమహాకావ్యంబునందుఁ బంచ
మాశ్వాసము.





శ్రీ

రామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# నిర్వచనకుమారసంభవము

## షష్ఠాశ్వాసము.

—⟡—



కరణాకిరణాకరుణా
లోకరణాపటిష్ఠదుష్టలుంటాకధను
ర్జైత్రకరణన మహిజాత్మవ
శీకరణచణా గుణైకసీమా రామా. 1

తే. అవధరింపుము పిదప సేనాధినాథు
హరసుతుని నగ్రసరుఁ జేసి హరి ససైన్యుఁ
డై వెడలె నాలమునకని యసురపురిని
నెడఁగ వడఁకించునానుడికెవ్వడమె నంత. 2

క. జైత్రుఁడు సేనాపతి హర
పుత్రుఁడు జిత్వరదనుజరిపుచమూయుతుఁ డై
శత్రులపై దండెత్తుట
శ్రోత్రములం బడఁగ నడలఁ జొచ్చిరి యసురుల్. 3

క. అంతట దైత్యులు తారకు
పొంత కరిగి యెఱిఁగి హస్తములు మోడిచి మా
ధాంతకసుతుఁ డాజికి జం

భ్రాంతకుతో రాకఁ దెలిపి రతిభీతి మెయిన్. 4

క. తారకుఁ డద్దానిఁ విని
స్వారా జాజినిఁ ద్రిలోకవైజైత్రుని నన్నే
సారిఁ గెలువ లే దిప్పుడు
పోర గుహునిబలిమి గెలుచుఁ జూ యని నగియెన్. 5

క. క్రోధమునఁ బిదప విస్ఫురి
తాధరుఁ డై దైత్యపతి మహాంధమతుల దు
స్సాధుల సైన్యపతుల నా
యోధనసన్నద్ధు లగుచు నుండం బనిచెన్. 6

క. పనుపఁ జమూపతు లస్త్రము
లను గొని నత రాజసంకులం బయి తగుత
ద్ఘనతర సౌధాంగణ మం
దున నిలిచిరి తత్క్షణంబ దోర్దర్పమునన్. 7

క. తారకుఁ డవ్వేళం బఱె
హారులు సూపంగఁ గనెఁ గృతానతుల మహా
ధీరుల వీరుల ఘనదో
స్సారుల రణదుర్జయుల స్వసైన్యాధిపులన్. 8

క. పదపడి శోషితదిక్కరి
మదజలనేమిస్వనం బమరబలభయదం
బుదధిమహీభృదవార్య
స్యద మగురథ మెక్కి దనుజుఁ డాజికి వెడలెన్. 9

క. ప్రళయాంబుధిగతి నులియుచుఁ
జలితధ్వజముల నినాంశుచయములఁ జోర నీ
కలఘురజంబులఁ దపను ది
శలఁ గప్పుచు నసుర వెనుక సైన్యము నడచెన్. 10

క. సురసేన కెదురునసురే
శ్వరుసేనం బొడముభూరిజము పొందెను ది

క్కరిదంతములఁ దెలుపు మద
భరితదిగిభకుంభములను బంకత్వంబున్. 11

క. ధరణీధరగుహాస్ఫోటన
కరతదసురసైన్యభేరికాస్వనముల సా
గరములు పొంగి పొరలె ని
ర్జరవాహిని తత్క్షణంబ సంక్షోభించెన్. 12

క. దుర్జయదానవసైనిక
గర్జానినదములఁ బొంగు ఖతరంగిణివి
స్ఫూర్జత్కమలోర్మితతులు
నిర్జరపురమందిరముల నెరసెం బిదపన్. 13

క. యానాభిముఖుం డగున
ద్దానవపతియెదుర నశుభద మగుశకునసం
తానము తదీయమరణా
ఖ్యానధురీణ మయి తోచె నతిభయదముగన్. 14

క. రక్షోగణమాంసములం
భక్షించెద మింతలోన మన మని యెలమిం
బక్షితతు లాడె నమరవి
పక్షులసేనపయి నాతపము సొర కుండన్. 15

క. గొడుగులఁ బడఁగల విఱుచుచు
బుడమిరజము జనులనయనములఁ గప్పఁగఁ బె
ల్లడరిచి కరిరథహయములఁ
గడుఁ దూల్చుచు నసురసేనఁ గాడ్పు సెలంగెన్. 16

క. సద్యోభిన్నాంజనలసి
తద్యుతులు భయంకరములు దర్వీకరముల్
ప్రోద్యద్విషాగ్నిఁ గ్రక్కుచు
మాద్యద్గతి నడచె మార్గమధ్యము నందున్. 17

క. సురశత్రుం డగు తారకు

మరణముఁ దెలుపఁగ నినుఁడు స మత్సరుబలె భీ
కరదర్వీకరభీషణ
పరివేషముఁ దాల్చె నపుడు భయదాకృతి యై. 18

క. రక్కసులనల్ల దురమున
నక్కఱమైఁ ద్రావ వచ్చు నను వేడుక నా
నక్కలు భాస్కరుఁ జూచుచు
నొక్కట గుమిఁ గూడి కూసె నుద్భటభంగిన్. 19

క. పట్టపగలు జలజల మని
నెట్టన పఱిఁ దొరఁగుబుఱు నిచయముఁ గనుడుం
గట్టెఁడియసురకుఁ గాలము
తుట్టతుదయ యంచు నెడఁ దోఁచె జనులకున్. 20

క. కడు నడరెడువీప్తుల నలు
గడలును నింగియును వెలుఁగ ఘనములు వెలిగా
నెడఁద వగిలించునులివునఁ
బిడుగులు గగనంబు నుండి వెల్లుగఁ దొరఁగెన్. 21

క. మండెడునిప్పులు మాంసపుఁ
గండలు నల్లయును బెల్లుగాఁ గురిసె దిశా
మండలి ఖరగళరుచులఁ
మెండుకొనురజస్సమృద్ధి మెయిఁ గడు మాసెన్. 22

క. గిరిశృంగము లగల దిశాం
బరముల నిండుకొని చెవులఁ బగులుచుచు రుషో
ద్ధురయమరాడ్గజాభీ
కర మగునిర్ఘాతరవము కడు వడి నడరెన్. 23

క. శరనిధిఁ గలఁచుచు శైలని
కరముల భేదించుధరణి కంపమునఁ బత
త్తురగము స్ఖలదిభము మిథః
పరిరబ్ధజనంబు నయ్యెఁ బరబల మంతన్. 24

క. మిట్టిల నెత్తుచు రవిపైఁ
గట్టినయీరాక్షణము లమరఁ గగ్ణంబులకున్
బెట్టిదముగ నత్తారకు
కట్టెదురం గూడి యఱచెఁ గాలేయకముల్. 25

క. పరిణామభయదముల న
య్యరిష్టములఁ దోనకనియు నాదైత్యకులే
శ్వరుఁడు ప్రయాణమువలనన్
మరలఁడ దైవోపహతి నమర్షోద్ధురుఁ డై. 26

క. మతిమంతు లిడుమ యగు నను
మతి వారించినను నయ్యమరరిపువరుఁ డు
ద్ధతి ముందు నడచె సజ్జన
హితోపదేశంబు ఖలులయెడ వమ్ము గదా. 27

క. సుడిగాలితాఁకునన్ వడిఁ
బుడమిం బడునసురకనకపుంగోడు గపు డ
య్యెడ మృత్యుపారణార్థం
బిడుహాటకపాత్ర మనఁగ నెంతయు నొప్పెన్. 28

క. భావిశిరశ్ఛేదనముం
భావించి తదమరవైరివహాళి గళస్మ
క్తావళి బాష్పంబుల శో
కావిల మై యేడ్చు చుండె ననన నొప్పారెన్. 29

క. అనుచరులు సారె వారిం
చినను గ్రహియించుకోర్కెచే బలె నట గృ
ధ్రనివహ మాడెం దితిజే
శునిమౌళిఁ దదీయమరణసూచక మగుచున్. 30

క. కాలాంజనసజ్యోతి వి
శాలఫణామణిగభస్తిసంవాంతవిషా
భీలమహాఘూత్కృతి యగు

కాలాహిని దనుజుపడగఁ గాంచిరి జనముల్. 31

క. స్ఫురదనలము దైత్యరథాం
తరమున డబ్బా ఱెసఁగి రథహయశ్రుతిచా
మరకేశశరశరాసన
శరధుల దహియించె నపుడు చండతరంబై. 32

క. ఏవంవిధబహుదుశ్శకు
నావలి దోఁచినను నతిమదాంధుఁ డగుట నా
దేవారి మగుడ కున్న న
భోవీథిని దివిజవాణి బోరనఁ జెలఁగెన్. 33

క. ఓరి మదాంధా తారక
స్వారాణ్ముఖదివిజవీరసహితుం డగుగా
రీరమణీపతిసుతుతోఁ
బోరికి నూల్కొనఁగఁ బోకు భుజగర్వమునన్. 34

క. షడహోవయస్కుఁ డగుహరు
కొడుకు కాజికి వచ్చె నసురకోటులచేతం
జెడఁ డతఁడు తమంబుల హరి
వడువున నీ కేల రిత్తవైరము మూర్ఖా. 35

క. ప్రాంచత్కూటంబుల ది
క్సంచయమును నింగి నలము క్రౌంచాద్రిని భే
దించెఁ వాల్యమ్మునఁ దదు
దంచితబలు నాజి నెదురఁ దలమే నీకున్. 36

చ. వెరవున నీశునొద్ద విలువిద్యను నేరిచి రాజకోటిఁ దా
నిరువదియొక్కసారి వధియించి తదస్రకృతాభిషేకుఁ డై
పరఁగెడురాముఁ డేఘనునిబాహుబలంబున కోహటించు నా
దారజగదేకవీరు రణదోహలి నూర్కొనె దేల దుర్మదా.

క. త్వర విడువు మదము రణత
త్పరుఁ డగుగుహుకీర్తిపాలఁ బడకుము వానిన్

శరణము వేఁడుము నీ క
క్కరుణాంబుధి బ్రతుకుత్రోవఁ గలిగించు ఖలా. 38
క. అని వినఁబడుపలుకులు విని
కనలి దనుజవిభుఁడు ముజ్జగముల వణఁకఁ జే
సినవాఁడ యయ్యుఁ దాఁ గం
పన మొంది సభంబుఁ జూచి పలికెం బెలుచన్. 39
క. వ్యోమచరామరు లారా
భీమాత్మజుపక్షు మొంది పృథుగర్వము మై
నే మని ప్రేలెదరు మదీ
యామేయశరార్తి నక్కటా మఱచితిరే. 40
క. వనమున నిశి మృగములలా
గునఁ గార్తిక మందుఁ గ్రొవ్వుకుక్కలచందం
బున నఱచెద రేలా ష
డ్డినములబాలకునిబలిమి దేవత లారా. 41
క. ధరఁ దస్కరుఁ గూడునత
స్కరుబలె మిముఁ గూడి గుహుఁడు కటకట పొందున్
మరణముఁ గావున మును మిముఁ
బొంగొని యాపైఁ దదభవపుత్త్రు వధింతున్. 42
క. అని పెలుచం బలుకుచు నిజ
ఘనని స్త్రింశంబు వెఱికి కవియుచు నన్యో
న్యనిపీడితజానువు లై
కనుకని దూరముగఁ బఱచెఁ గ్రతుభుగ్గణముల్. 43
క. పదపడి దనుజుఁడు గర్వో
న్మదుఁడై వికట మగునవ్వు నగి యసి చెంతం
బదిలముగ నునిచి మఘవు నె
యిద సారథి రథముఁ బోవ నిమ్మని పనిచెన్. 44
క. సురవైరినియంత మనో

తిరయంబుగఁ దేరు నడప ( దెసల నతిభీ
కర మగుసురసేనాసా
గరముం దక్షిణము చేరె ( గర్వోద్ధతిమై. 45

క. ముందు సుపర్వవరూథిని
క్రందు విలోకించి సమర ( కౌతుకలీలా
స్పందితుఁ డై తారకుఁ డా
నందజపులకావలీస ( నాథుం డయ్యెన్. 46

క. మానసవేగు లయినసుమ
నోనాథచమూచరులు వి ( నూతనరణలీ
లానూనరభసమున యో
ధానీకము నపుడు గొల్చి ( రాహవమునకున్. 47

క. పేరెలుఁగెసఁగఁగఁ దమతమ
పేరులు చే యెత్తి నుడివి ( పృథుదైత్యచమూ
చారులు నిర్జరసేనా
వారాశిం గదిసి ర ( ప్రవార్యోద్ధతిమై. 48

క. సురలు పురోసురసేనా
శరనిధిఁ గని వెఱచి రథిక ( సంక్షోభమునన్
హరసుతుకనుఁగొనలన యిమి
డిగి రణదుర్ధర్షు లగుక ( డిఁదిముగ నెల్లన్. 49

క. హరసుతుఁ డరిక్షుభితని
ర్జరవాహిని నపుడు సుప్ర ( సాదసుధాసం
భరితేక్షణములఁ గనుఁగొని
దురమునకై నూలుకొలిపె ( దుర్జయలీలన్. 50

క. ఘనశక్తిధరునిఁ గనుఁగొని
జనితోత్సాహు లయి సురలు ( శక్రాదులు దా
రని నేన నేన గెలిచెద
నని కడఁగిరి పీరునండ ( యుల వెసఁగుఁ గదా. 51

క. సురభటు లాసురభటులు
ద్ధురగతి నాయుధము లెత్తి దురమున జయముం
బొరయఁగఁ గోరుచును బర
స్పరముం దలపడిరి వందిసన్నుతు లెసఁగన్. 52

ఉ. వేల నతిక్రమించి యని వేలయముం బొనరింపఁ బేర్చి ది
గ్జాలము లాక్రమించి లయకాలసముద్భట మై సురాసురా
భీలచమూదధిద్వయము భీకరరావ నజాండమున్ మహా
శైలతటీవిఘట్టనవిశంకట మై పగిలించె నత్తఱిన్. 53

క. భీకరశస్త్రాస్త్రంబులఁ
జేకొని యొండొంటిఁ దాఁకి చెండాడెడున
స్తోకాసురసేనకును ది
వౌకస్సేనకును ఘోరయుద్ధం బయ్యెన్. 54

క. తురగస్థుఁడు తురగస్థితు
ద్విరదసమారోహకుండు ద్విరదస్థితుఁ గా
ల్వురు కాల్వుర రథి రథినిన్
దురముం బొనరింపఁ గా నెదుర్కొని రంతన్. 55

క. పోరన్ ధీరత్వంబున
వైరి నెదుర్కొనెడువీరవర్యునకున్ సొం
పారెడువీరాంకంబులఁ
బేరుల వివరించు వందిబృందం బాజిన్. 56

క. భూరిపరాక్రమముల నౌ
రౌరా యని పొగడుమాగధాళిమునుమునన్
వీరు లెడ దవుల మగలెన
మారన్ మసలుదురు సంప్రహర్షోత్సుకులై. 57

క. అత్తఱి సంగరకుతుకా
యత్తు లగుచు మేనఁ బులకలలరారఁగ వీ
రోత్తము లుఱిఱి కొండొరువుల

కత్తళములు సించికొనిరి గర్వోద్ధతులై. 58

క. ఆలోన మహోజ్జ్వలకర
వాలచ్ఛితకవచసంభవదుపరివిలుఠ
త్తూలంబుల గగనదిశా
జాలంబులు ధవళకాంతిసంపద నెసఁగెన్. 59

క. నెత్తుటఁ గడుఁ దోఁగి సుమ
ద్యత్తరణిమరీచికాసమంచితరుచులై
యత్తఱి శూరులు త్రిప్పెడు
కత్తులతళతళలు మెఱుపుగమి నటు ద్రోచెన్. 60

క. భూరిక్రోధంబున సము
దారపరాక్రములు భటులు దాఁకి పఱపుదు
ర్వారశరపరంపరలు మ
హోరగములపగిదిఁ జదల నొక్కట నలమెన్. 61

క. ధానుష్కమహాశుగసం
తానంబు మిథోవపుర్విదారణదీప్తం
బై నల్లసోఁకెఱుంగక
వే నిగుడుచు దవ్వులన్ భువిన్ వెసఁ దూఱెన్. 62

క. ఆలము సేఁత కలరునా
భీలమహాయోధచయము పెల్లేసినబా
ణాళి తొలుదొల్తఁ గరులం
గూలిచి యామీఁదఁ బాము కూలున్ నేలన్. 63

క. భీమాటోపాసలకీ
లామాలాప్రోజ్జ్వలత్కీలంబచయంబుల్
వ్యోమముఁ గప్పఁగఁ బశ్య
దైవ్యమానికసంఘ మపుడు వైళను పఱచెన్. 64

క. హరివిక్రములైనధను
ర్ధరులశరావళుల విదళితంబై వెత వి

ష్కారకోలాహలముల నం
బర మెంతయు మొత్తువెట్టుపగిదిం జెలఁగెన్. 65

క. క్షోణి వడఁకఁ జెవి సోఁకఁగ
బాణాసనగుణముఁ దిగిచి భటు లేయుస్ఫుర
ద్బాణావలి వడి నిగిడెన్
శోణితముం గ్రోలఁ దివురుచుం జనుమాడ్కిన్. 66

క. ఉఱి కొండొరువులపై మగ
లొఱ వెఱికి కృపాణపాళి నొగి జళిపింపన్
మెఱుఁగుల నెపంబుమై న
త్తఱి నాఖడ్గములు నగువిధంబునఁ జెలఁగెన్. 67

క. నెత్తుటను దొప్పదోఁగుచుఁ
గత్తులు వీరాళిపాణికంజాతములన్
నృత్తము సేయుచు ఘనవి
ద్యుత్తతులన్ నగె రజోఘనోగ్రరణమునన్. 68

క. అంత రణార్థికరోద్యత
కుంతంబులు దీప్యమానఘోరాకృతిఁ గ
ల్పాంతసముద్భటుఁడై నక్ర
తాంతుమహాజిహ్వికలక్రియం దనరారెన్. 69

క. చక్రములఁ బ్రస్ఫురద్రుచి
చక్రంబులఁ దరణిబింబసంకాశములం
జక్రధరులు నిర్వక్రప
రాక్రమమున వైవ నంబరము నవి గప్పెన్. 70

క. ముందఱ వీరాగ్రణులు వ
డిం దఱుముచు నార్పుడుం గడింపకలంకం
గొందఱు మూర్ఛం జెందిరి
గొందఱు ధరణీతలమునఁ గూలిరి తోడ్తోన్. 71

క. నిలు నిలు నినుఁ గూల్చెద నని

వెలుచఁ దోడరువైరిఁ గాంచి ప్రియ మొందుమహా
కలహాగతుఁ డొకఁడు తనకో
ల్తల కోర్వక పఱవఁ గడు నెదం దురపిల్లెన్. 72

క. కొందఱు బహువీరులతోఁ
గ్రందునఁ బోరాడి యొందుకడకు నరుగుచుఁ
ముం దెదురుకొనినయాభట
లం దలపడి రందు రణకళాలాలసులై. 73

క. పులకాంచితబాహు లయి భ
టులు కొందఱు పోరుటకుఁ గడుఁ వడిఁ దమ్ముం
దలపడఁ దివిరెడువీరులఁ
గలహామహోద్ధతుల నెదురఁ గని యలరి రెదన్. 74

క. సమదద్విపకుంభము ల
స్త్రములఁ బగుల ముత్తియములు ధరఁ బడి యొసఁగెన్
సమరక్షోణీకేదా
రమున నిహితకీర్తిబీజరాజిం బోలెన్. 75

క. వీరులగర్జాధ్వనులను
వారణములు మావటీంద్రు వారించిన దు
ర్వారము లై యంకుశములఁ
జీరికిఁ గొనకపుడు పఱచఁ జెల్లాచెద రై. 76

క. బాణంబులఁ బై యోధుల
ప్రాణంబులు వ్రూవ నొచ్చి పస చెడి సమర
క్షోణిని నేనికమూఁకలు
శోణితనిమ్నగలలోను సొచ్చి మునింగెన్. 77

క. ధీరు లగురథికముఖ్యు ల
పారాస్త్రచ్ఛదుల డిందుపడ రథములు హుం
కారంబులతోడ శరా
సారంబులఁ గురిసి రపుడు శత్రులమీఁదన్. 78

క. కరవాలంబులచేతఁ
శిరములు దెగ ఘోటకములు క్షితి నొఱగుచు వి
స్ఫురితాసివిదారిత మై
యరిసంతతి నేలఁ గూల నాపైఁ గూలున్. 79

క. ఘోరాస్త్రనికృత్తము లగు
వీరాగ్రేసరులతలలు వెస డొల్లుచు న
చ్ఛో రదనపీడితోష్ఠము
లై రుషఁ బరుగిడును శాత్రవాభిముఖముగన్. 80

క. స్ఫురదర్ధచంద్రవిడళిత
వరయోధశిరశ్చయము లవనిఁ బడ కుండం
జరణములఁ దన్నికొని యుం
బరమున నవ్వేళ డేగపోఁజులు పఱచెన్. 81

క. ఉఱక పదాతులు సాదులు
తఱిమి పయిం బడెడుకరులదంతంబులపై
కుఱికి తదారోహకులను
నఱికి పడం ద్రోచి రవుతు నానాగతులన్. 82

క. శూలాదికవివిధాయుధ
జాలముల నిషాదివితతి సావం గజముల్
కాలానిలలోలము లగు
శైలంబులు వ్రాలెఁ దిరిగి సమరక్షోణిన్. 83

క. కరులం డీకొల్పుచు నొం
డొరులం దలకడచి వీరు లుగ్రోద్ధతి ను
ద్ధురశస్త్రాస్త్రంబుల సం
గరకేళిం గొనిరి శత్రుగణములయసువుల్. 84

క. ఆఁకరముల నొం డొంటిం
దాఁకుకరులదంతఘట్టనంబులచేతన్
వీఁకం బొడమెడునవలము

కాఁకలు రిపునిహతవైరిగణము దహించెన్. 85

క. తుండాలంబులు కనలునఁ
దొండంబులు సాఁచి దివియఁ దొడరఁ బదాతుల్
చండోద్ధతి నయ్యేనిక
తండంబులఁ గూల్చి రుగ్రతరఖడ్గములన్. 86

క. ద్విరదంబులు యోధుల నం
బరమునకుం దొండములను బట్టి విసర న్వాః
పురి కరిగెం జీవంబులు
ధర కొఱగెఁ గళేబరములు తత్సమయమునన్. 87

క. పాండురధారాలసదసి
ఖండితములఁ జేసి కరులకరములు పుడమిన్
మెండుగఁ గప్పియు వీరులు
నిండుముదం బంద రైరి నెమ్మనములలోన్. 88

క. మాతంగంబులు దివికిఁ బ
దాతులఁ జేతులను బట్టి దండడి వైవం
బ్రీత లగుచు స్వారములు
చేతోముద మొదవ వారిఁ జేకొని రంతన్. 89

క. తురగముల నెక్కి ధనువుల
ధరియించి చెలంగుయోధతతి శరదళిత
ద్విరదారోహులు మూర్ఛం
బొరయఁ దెలిసి రాక కెదురు పొడగనుచుండున్. 90

క. కడుఁ గనలునఁ దనుఁ బొదువం
గడఁగెడు నేనుంగుకరము కరవాలమునం
బొడి సేసి పదాతి యొకఁడు
వడిఁ దద్దంతములపై క వారణ నుఱికెన్. 91

క. ఎదిరిబలములోనికి నడిఁ
గదియం జని ఖడ్గధారఁ గరిదంతములన్

మొద లంట నఱికి మఱియొక
పదాతి రయ మార మరలె బలగర్వమునన్. 92

క. కోపన మగునొకయిభ మా
టోపంబునఁ బట్టె నొకభటుఁడు వడినిఁ గృపా
ణాపగతప్రాణము గా
నాపద్విపం గూల్చి పొల్చె నతులితతనుఁ డై. 93

క. తురగస్థుఁ డొకఁడు ప్రతిబల
తురగస్థితు నురము వగులఁ దోమరహతులం
బొరిగొని యెడఁ దత్ప్రిసా
ద్ధురఘాత నెఱుంగఁ డయ్యెఁ దుష్టాత్ముం డై. 94

క. హరిపృష్ఠపృథ్వాసనుఁ డై
కరమునఁ బ్రాసంబు గ్రాలఁగా నొకవీరుం
డరిహతుఁ డయ్యు సజీవుని
కరణిఁ ఘోటకముతోడఁ గలనం దిరిగెన్. 95

క. పగవారిశస్త్రములచే
విగతాసుం డైనసాది వీక్షించి కడుం
వగ నొకయాజానేయము
మొగ మశ్రులఁ దోఁగ విడిచి పోవక యుండెన్. 96

క. శితభల్లంబునఁ దన్నుం
బ్రతిపక్షుఁడు నొవ్వ నేయ బల మఱి సమర
క్షితిఁ బడు చొకసాది యసిఁ
మృతి నొందింపంగ వైరిమీఁదికి నుఱికెన్. 97

క. భీకరశస్త్రమిథోహతు
లై కడు వడి హయుల డిగ్గి యటఁ బోరిరి శౌ
ర్యాకరు లిద్వురు మగలు క
చాకచిగ భుజాభుజిగ రుషాహూషితు లై. 98

క. బాణం బులరథులు రథుల

ప్రాణంబులు గొనఁగ వారు ◊ పాణితలములం
బాణాసనము లెసఁగ స
ప్రాణులక్రియఁ దోఁచి రపుడు ◊ రణరంగమునన్. 99

క. రథి నిజశరమూర్ఛితు నొక
రథికోత్తముఁ డేయు టుడిగి ◊ రణకాంక్ష సమి
త్పృథివిం దేఱువఱకుఁ ద
ద్రథముసమీపమునఁ దనదు◊రథమున్ నిలిపెన్. 100

క. ఇరువురు రథికోత్తము లొం
డొరువులతోఁ బోరి పోరి ◊ యసువులు వెడల స్వః
పురి కరిగి యచట నొకయ
చ్చరన వలచి యుగ్రభంగిఁ ◊ జల్పిరి రణమున్. 101

క. చండార్ధచంద్రబాణవి
ఖండితశీర్షు లగురథులు ◊ ఖచరు లయి ధరా
మండలమున నాడునిజో
ద్దండకబంధములఁ గనిరి ◊ తత్సమయమునన్. 102

క. శోణితపంకిలసమర
క్షోణిం బైశాచగణము ◊ సొక్కుచుఁ బాడన్
రాణన్ బహువిధతూర్య
శ్రేణు లులియ నట్టు లెల్ల ◊ నృత్యం బాడెన్. 103

హరిణీవృత్తము.

సురదనుజసేనల్ క్రందై యిట్లు ◊ స్రుక్కక పోరఁగా
గరిఘటలు మున్గం బో రక్తాప◊గాతతి నంత దై
త్యరమణుఁడు రక్తాక్షుం డై వచ్చి ◊ తాఁకె దిగీశులన్
స్ఫురితవికటభ్రూభంగోగ్రుండు ◊ పోరెడు వేడుకన్. 104

వసంతతిలకవృత్తము.

ఆరాక్షసాధము మ◊హారణకౌతుకాఢ్యున్
ధీరుం దురాత్ముఁ గని ◊ దిక్పతిరాజి తాఁకెం

ఘోరతర మహోద్ధతిని భూరితరోగ్రబాణా
సారాంధకారితదిశాగగనంబు గాఁగన్. 10

వనమయూరవృత్తము.

అత్తఱి సురారి నగి యాసురలపై ను
ద్వృత్తి శరజాలముల నేసె వడి నంభో
భృత్తు జలధారలను బెల్లుగ మహాభూ
భృత్తతిపయిం గురియుచేర్మి దలపింపన్. 106

చంద్రరేఖావృత్తము.

ఇంద్రాద్యాశాధిపోన్ముక్తేషువ్రజంబుల్ స్ఫురన్ని
స్తంద్రాదిత్యారిబాణాసారంబు వేగం బెలర్పం
గం ద్రుంచెం దత్సమిద్రంగం బందు మాద్యద్విహంగా
ధీంద్రౌఘంబుల్ మహోగ్రాహిస్తోమముం దున్ము మాడ్కిన్.

ప్రియకాంతావృత్తము.

నలుదెసలం గప్పుచు నిజనామాంకములం బ్ర
జ్వలితశితాగ్రంబులఁ దగుచండద్విశిఖాళిక్
జ్వలనుఁడు ఘాసంబుబలె నవారోద్ధతి రక్షః
కులపతి మాపెం దదమరఘోరాశుగపాళిన్. 108

కుమావృత్తము.

పదపడి యతికోపంబుమై దైత్యుఁడు
న్మదుఁడయి శరసంతాన మేయఁగ భయ
ప్రదవిషధరరూపంబుఁ బ్రాపించి యా
త్రిదశగణము బంధించె నాబాణముల్. 109

అశ్వగతివృత్తము.

అసురనాయకుచే సురగాశుగబద్ధము లై
యాసురసంఘము లత్తఱినాజిని నిల్వక ని
శ్వాససమాకులతన్ నిజవక్త్రము లొప్పఱ గౌ
రీసుతుఁ జేరెను శౌర్యధురీణు విపత్తిహరున్. 110

నర్కుటవృత్తము.

హారసుతుచూడ్కి చేతన తదాశుగబంధవిప
ద్భర మడఁగంగఁ బొంగు ప్రమదంబునఁ దేలి సురే
శ్వరముఖదేవతాగణము సన్నుతి చేయుచు నా
స్మరహరపుత్త్రునిం గదిసి సల్పెను సేవనముల్. 111

మేఘవిస్ఫూర్జితవృత్తము.

స్ఫురత్కోపోద్దీప్తుం డయి తదసురేశుండనుఁ డా సూతుతో ని
ర్జరేశాద్యాదిత్యుల్ హారసుతనిరీక్షావినిర్ముక్తులై రీ
సురాలిం జేరంగా వలదు శశిభృత్సూనుపై కింకఁ దేరుం
ద్వరంబో నిమ్మా వానిఁ దునిమెద భూతంబు లామోద మొందన్.

మానినీవృత్తము.

తారకుఁ డీగతి ఁ బంచినయంతరథంబును దోలుడు నయ్యది దు
ర్వారసమీరపరిక్షుభితక్షయవారిధరారవమేదుర మై
దారితసర్వవిపక్షచమూపిశితక్షతజాస్థివసారసవి [సఁగెన్.
స్ఫారభయంకరచంక్రమణక్రమచక్రయుగం బయి యొప్పె

కుసుమితలతావేల్లితవృత్తము.

కల్పాంతానల్పశ్వసనహతసంఘట్టనాలోలభూభృ
త్కల్పం బై హాహారవకృదమరోగ్రస్వనం బై నక్రౌర్యా
కల్పక్రవ్యాదీశ్వరుని రథముం గాంచి నోర్లెండ నార్త
వేల్పుల్ సంక్షుబ్ధాత్ములగుచు మహోద్వేగముం బొందరంతన్.

చంపకకేసరివృత్తము.

దనుజుండు సంక్షుభితదైవతసైన్యము సూచుచుం
గనదుగ్రబాహుధృతకార్ముకదండమహోగ్రుఁ డై
యనలాక్షుసూనుని మహాహవకేళివిలోలుపా
త్మునిఁ జేరి యాఘనునితో నిటు పల్కెఁ బ్రమత్తుఁ డై. 115

శార్దూలవిక్రీడితవృత్తము.

ఓరోరీ హరతాపసేంద్రసుత బాహాద్వృత్తి నామీఁద నా

యౌరా చాలును జాలు నింక విడు దేవాధీశకార్యాశ నీ
ఘోరాస్త్రంబులు నీకు నేల చెపుమా కుత్సా తలంపన్ వృథా
భారం బింతియ బాల్యపేశలభవద్భాస్వద్భుజాపాలికిన్. 116

మత్తకోకిలవృత్తము.

అక్కటా గిరిజాగిరీశులకాత్మజుండ వెకండ వీ
వుక్కునన్ ననుఁ దాఁకి మృత్యువునొంద నేమిటి కాలముం
దక్కఁ బొమ్ము కడున్ నటిం దలిదంష్ట్రు లంకతలంబుపై
నెక్కనిం గని యూరడిల్లఁగ నీవుఁ బొందెదు మోదమున్.

పంచచామరము.

స్మరారిపుత్ర తెన్న మానసంబునం దలంచి యీ
సురేశవిద్విషుం దెగంగఁ జూచు టొప్పు వేగ యీ
దురాత్ముఁ డక్కటా యగాధతోయరాశిలోన తా
తరిం బలెన్ వడిన్ మునుంగుఁ దాను ముంచు నిన్నునున్.

మదనదర్పణవృత్తము.

అంగజహరసూతి దైత్యువాక్య మప్డు విన్నతో
డం గడు వడఁకాడుకోపమోష్ఠ మొప్పఁ గాఁ గనుల్
చెంగలువలపోలికం దనర్చి యొజ్జవాఱి వి
ల్లుం గనుచు స్వశక్తిఁ జూచి పల్కె నాసురారితోన్. 119

గజవిలసితవృత్తము.

గర్వము నొంది ప్రేలెదవు బెడిద మయినయా
దుర్వచనంబు నీకెతులువ తగు నిఁకను నీ
దోర్విభవంబు సూతుఁ దొడరుము గొను శరముల్
మూర్విని వింటఁ గూర్పుము వనము సడఁతు ననిలోన్. 120

మంజుభాషిణీవృత్తము.

అన నక్కుమారు నమరారి వల్కె దం
తనిపీడితోష్ఠుఁ డయి దారుణక్రుధన్

ఘన మహాభుజాబలముగల్గె నేని నీ
వనిలో మదీయవిశిఖాగ్ని సైఁచుమా. 121

సుగంధివృత్తము.

అంచు వైరిదుర్నిరీక్ష్యమైనవింట నారి సం
ధించి తారకాసురుండుదీటుగొల్పె నమ్ములం
జంచదుగ్రసర్పతుల్యచాప మెత్తి యుద్ధతిన్
మంచుకొండమన్మఁడుగ్రమార్గణాళిఁ బూనఁగన్. 122

శాలినీవృత్తము.

ఆకర్ణాంతాకృష్టమహాదైత్యువింటన్
భీకృద్బాణౌఘంబుపెల్లుప్పతిల్లెన్
లోకంబుల్ భీతిల్లిలోఁగం బ్రభాపూ
ర్ణాకాశాశేషాశమై యుగ్రభంగిన్. 123

ఇంద్రవజ్రవృత్తము.

రక్షోధనుర్ముక్తశరంబులన్
న్యక్షోభ గాఁ జీఁకటియావరించెం
జక్షుర్నిరోధం బయిసౌరసేనా
ధ్యక్షుండు గానంబడఁడయ్యె నచ్చోన్. 124

తోటకవృత్తము.

అని నారిని నాశ్రవణాంతము గాఁ
గొని యేయుశివాత్మజుఘోరధను
ర్జనితోగ్రవిజిత్వరసాయకముల్
దనుజేశ్వరుబాణములం దునిమెన్. 125

దోదకవృత్తము.

సౌరచమూభయసంజనకం బౌ
తారకబాణవితాన మడంగం
గౌరిసుతుం డురుకాంతియుతుం డై
సూరునిపోలికఁజూడఁగ నొప్పెన్. 126

భుజంగప్రయాతవృత్తము.

మహాతేజుఁడై యుక్కుమారుండనిం దు
స్సహాస్ఫూర్తి దీపింపసైఁపంగ లేక
మ్మహాదైత్యుఁ డత్యుగ్రమాయాపరుండై
మహేశాత్మజుం బిట్టు మార్కొంగఁ గడంగెన్. 127

స్రగ్విణీవృత్తము.

మంటఁ బోల్వీని సామాన్యశస్త్రాళి మా
ర్కొంటప వమ్మాచు సక్రోధుఁడై యాజగ
త్కంటకుం డప్డు వీఁకన్ సమీరాస్త్రమున్
వింట సంధించెఁ బృథ్వీప్రకంపంబు గాన్. 128

ద్రుతవిలంబితవృత్తము.

అటు లతం డనిలాస్త్రముఁ బూన ది
క్తటములన్ లయకాలము నా రజః
పటలి రేఁగి విభాకరుఁ గప్ప నొ
క్కటఁ జెలంగెను గాడ్పు మహార్భటిన్. 129

జలధరవృత్తము.

ఆతత దేవవాహిని మహానిలని
ర్ధూతసితాతపత్త్రములు తోయధర
స్ఫీతరజోంబరస్థలినిఁ బెల్లగసెన్
శ్వేతగరుత్కదంబముల వియ్యములై. 130

తోదకవృత్తము.

కరువలిచేఁ బడగల్ కడు నుగ్గై
ధరఁ బడ కభ్రపథంబున నాడెన్
స్ఫురితసితాంబరశోభ లెసంగన్
సురధునివీచులసొంపు దలిర్పన్. 131

స్వాగతవృత్తము.

గాలిఁ దూలి వడిగా సురసేనన్

నేలపైఁ బడె ననేకపపంక్తుల్
శైలభేదికులిశక్షతి నేలం
గూలుభూమిధరకోటికి నీడై. 132

మేదినీవృత్తము.

రథములు గుఱ్ఱముల్ ద్విరదరాజసంతతుల్ సా
రథితతు లంబరంబున స్ఫురత్సమీరవేగో
న్మథితము లై సుపర్వపృతనాలయంబు గాఁగం
బృథివినిఁ బెల్లు గా నొఱగి బిట్టు తూలి కూలెన్. 133

ప్రియంవదావృత్తము.

గురుసమీరహతి ఘోరశస్త్రముల్
దొరఁగి గుఱ్ఱములతోడ నష్టని
ర్జరులసైన్యమున సాదు లెల్లఁ ద్రె
ళ్లిరి మహాస్త్రహతి శేకయే మహిన్. 134

పద్మకవృత్తము.

గళితశస్త్రు లయి నిర్జరకాంతునిసేనఁ బ
ద్గులు మహారవము మీఱఁగ ఘోరమరుచ్చల
ద్దళము లట్లు కడుఁ దూలుచు దండడి గా వియ
త్తలమునుండి భువిఁ ద్రెళ్ళిరి తత్పవనాహతిన్. 135

మణిమాలావృత్తము.

ఈరీతినిఁ బద్దై త్యైశాస్త్రకృతం బౌ
సారధ్వజినీనాశంబుం గని తోడ్తో
స్వారాజ్యరమానిర్వాహోద్యతుఁ డౌమా
రారాతిసుతుం డుగ్రాస్త్రోద్ధతిఁ జూపెన్. 136

ప్రహర్షిణీవృత్తము.

అంతన్ వే తదనిల మాఱ దేవసేనా
సంతానం బనికి వెసం గడంగెఁ దద్దు.

ర్ధాంతప్రోద్ధతిఁ గని తారకుండు క్రుద్ధ
స్వాంతుం డై వడిగ మహానలాస్త్ర మేసెన్. 137

తే. గీ. ప్రావృషేణ్యాబ్దరుచి నొక్క ప్రక్కఁ ద్రోచి
విస్ఫుటేందీవరచ్ఛాయ వెన్క కొత్తి
బుగులుకొని యప్పు డేచి క్రొంబొగలగుంపు
రోదసిం బర్వెఁ జక్షుర్నిరోధకముగ. 138

ప్రభాతవృత్తము.

నలుదెసలం గడునల్లనై నచీఁక
ట్లలమఁగఁ గ్రొంబొగ లాకసంబునన్ మ
బ్బులఁ బురుడింపఁగఁ బొంద నెంచె రాయం
చలు వడి మానససారసాకరంబున్. 139

ప్రమితాక్షరవృత్తము.

సురసేన భీమ మగుచుం బ్రళయో
ద్ధురబర్హి నాఁ బొడమి తోడన వ
హ్ని రగుల్కొనెన్ శిఖల నేచి దిశాం
బరముల్ పిశంగరుచి భాసిలఁ గాన్. 140

చంద్రవర్త్మవృత్తము.

అమ్మహానల ముదగ్రశిఖల వ్యా
మమ్మునం జెలఁగ మబ్బులగతి ధూ
మమ్ము లొప్ప నడుమం దనరెఁ జదల్
గ్రొమ్మెఱుంగుగుమిఁ గూడుకొనెనో నాన్. 141

కుసుమవిచిత్రవృత్తము.

స్ఫురదనలార్తిం బొడము వెలిన్ ఖే
చరతతు లాకాశమునను బొలిన్
సురపతిసేనల్ సుడివడుచున్ శం
కరసుతుఁ జేరంగఁ జనె నలంతన్. 142

నవనందినీవృత్తము.

ఇటు లగ్గి నొచ్చినసర్వరీశ్వరుపరిం ధూ
ర్జటిసూతి గన్గొని రుషాకలుషితుం డై
స్ఫుటహాసచంద్రికల మోము దనరంగా
నట వారుణాస్త్రము శరాసమునఁ గూర్చెన్. 143

సుకేసరవృత్తము.

అలఘుతరాంధకారనిభ మై చెలంగుచుం
బ్రళయజభీమధూమములభాతి నేచి గ
ర్జల గిరికూటముల్ వగిలి రాలి కూల మ
బ్బులగమి యమ్మహాస్త్రమునఁ బుట్టె నత్తఱిన్. 144

మనోజ్ఞవృత్తము.

నభమున ఘోరగభీరనాదము పింగ
ప్రభలు దిశావలి యందుఁ బర్వ లయోగ్రకా
లభయదజిహ్వలు నాఁ జెలంగి లసత్తటి
ప్రభ లతిమేచకమేఘరాజిని రాజిలెన్. 145

మణిభూషణవృత్తము.

ఘోరఘోషము లెసంగఁగఁ గ్రొమ్మెఱుఁగుల్ విభా
స్వైరదిక్కులఁ గడున్ మిఱుమిట్లు గొనం గనుల్
నీర ముట్టిపడఁగా నతినీలరుచిచ్ఛటా
స్ఫారవారివహమాల నభంబున భాసిలెన్. 146

ఉపేంద్రవజ్రవృత్తము.

హరిన్నభోవ్యాప్తము లై శ్రప్రోదు
ర్భరోగ్రగర్జాధ్వనిఁ బర్వ ధారా
ధరంబు లంతం దదుదగ్రసంయు
ద్ధరిత్రి వర్షించె నుగారభంగిన్. 147

శ్యేనీవృత్తము.

తారఘోషభీతదైత్యమైతముగ

పూరితాభ్రమూచుఁ బొల్పెసంగున
వార్వరుణాస్త్రజాతవారివాహదు
ర్వారవృష్టిచేత నవహ్ని రూపఱెన్. 148

పృథ్వి తము.

సురారి యపు డుగ్రకోపుఁ డగుచున్ మహాభీకర
క్షురప్రములఁ గార్ముకంబు చెవి సోఁకఁగా లాగి యా
స్మరారిసుతుమీఁద నేసె బలశౌర్యముల్ మీఱ ని
ర్జరేశ్వరుని సేన సాధ్వసభరంబునం బాఱఁగన్. 149

అలసగతివృత్తము.

హరతనయుఁడుం బటుశరాసనముతోడన్
శరముల మహాసురపృషత్కములఁ ద్రుంచెన్
సరగున యమాదులను సంయుగము మహాసం
సరణవిషయంబులను జక్కడచుమాడ్కిన్. 150

రథోద్ధతవృత్తము.

భ్రూలతాస్ఫురణమోము భీమమై
క్రాలఁ దేరు డిగి గాఢరోషుఁడై
వాలుఁ గేలఁ గొని వచ్చి తాఁకె నా
శూలిసూతి దనుసూనుఁ డత్తఱిన్. 151

కలితాంతవృత్తము.

ఈరీతినిఁ బైఁబడు నింద్రరిపుఁ
గారిప్రియసూనుఁడు గాంచి యుగాం
తోరుజ్వలనాకృతి నొప్పుచు దు
ర్వారం బగుశక్తిని వైచె నడిన్. 152

మాలినీవృత్తము.

సురనయనజహర్షాశ్రుప్రపూరంబుతో నా
సురనయనజశోకాశ్రుప్రపూరంబుతో ని

స్ఫురదురుకిరణాళీ పూర్ణదిగ్వ్యోమ మై యా
శరుహృదిఁ బడియెం దచ్ఛక్తి రౌద్రప్రయుక్తిన్. 153

భూనుతవృత్తము.

అంతఁ బ్రాణములు వోవ రణావనిపైఁ గ
ల్పాంతమారుతధుతాద్రిక్రియం బడు రక్షః
కాంతునిం గగురుపాటెసఁగం గని యాజం
భాంతకాదిసురసంఘము హర్షము నొందెన్. 154

వంశస్థవృత్తము.

ధరాధ్రిరాజాకృతి ధాత్రిఁ గూలుత
త్సురారివ్రేఁ గొందునధోవ్రజత్స్ఫుర
ద్ధరిత్రి మోర్చెన్ వినతస్ఫుటాళి నా
సరీసృపాధీశుఁడు సప్రయత్నుఁడై. 155

ఇంద్రవజ్రవృత్తము.

మందాకినీశీకరమంజుగంధలు
బ్ధేందిందిరాళీముఖరేష్టగంధ మా
మందారవర్షంబు కుమారుపై నభం
బం దుండి వర్షించె సుఖాస్పదంబుగన్. 156

సుందరీవృత్తము.

భూరిముదంబున దేహముల్ పెరుఁగన్ ముఖాం
భోరుహపాళినిఁ గ్రొత్తపొల్పు చెలంగఁ గాఁ
దారకశాత్రవుశూరతం గొనియాడె నా
స్వారమణాదికదేవసంఘము లయ్యెడన్. 157

ఉత్సాహవృత్తము.

శ్రీసుమాస్త్రవైరిసుతుఁ డశేషలోకశల్య మా
నాసురారి నటులు దురమునందుఁ ద్రుంప వైభవో
ల్లాస మెసఁగ నాకరాజ్యలక్ష్మినిన్ వరించి య
వ్వాసవుండు సెలఁగె దివిజవందితాంఘ్రియుగ్ముఁడై. 158

శా. దేవా కొండొక నాక చేకొనుము త్వద్దివ్యత్కటాక్షేక్షణ
ప్రవిఖ్యాతకవిత్వవైభవము నీ కర్పించితిం దీనికిం
నీ వే మిచ్చెదు మాఱు పెద్దపదవుల్ నేఁ గోర నీమాత్ర నా
కీవే త్వత్పదభక్తి భక్తసులభా పృథ్వీసుతానాయకా. 159

శా. విద్వత్సన్నుతవామలూరుజవచోవిఖ్యాతచారిత్ర పూ
తాద్వైతాధ్వగతాధ్వనీనజనబోధ్యస్వీయయాథార్థ్య భా
స్వద్విద్యాప్రవణాంతరంగ కరుణాసంపద్యుతాపాంగ గా
ఘోద్విగ్నాభయదక్షుదక్షిణకరా యుద్యత్ప్రభావాకరా. 160

క. సోహమ్ముఖవాక్యజ్ఞని
రీహాత్మాలోకనప్రహృష్యద్బుధసం
దోహావనదీక్షా వై
దేహీకుచకుంకుమాంకదృఢతరవక్షా. 161

మాలిని. కమలభవముఖాద్యా గాఢభక్తిప్రసాద్యా
సమధికగుణహృద్యా సర్వవిద్యానవద్యా
ప్రముదితవిధిసోమా భానువంశాబ్ధిసోమా
సమదరిపువిరామా సర్వలోకాభిరామా. 162

గద్యము.

ఇది శ్రీమద్వేంకటస్వామిరాట్పౌత్ర తమ్మయరాట్కవీంద్రపుత్ర
విబుధవిధేయ వేంకటసూర్యప్రసాదరాయ ప్రణీతం
బైననిర్వచనకుమారసంభవమహాకావ్యంబు
నందు షష్ఠాశ్వాసము.

సంపూర్ణము.



# శుద్ధపత్రము.

| పుటసంఖ్య | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 4 | నిగుడ్చె | నిగిడ్చె |
| 5 | 25 | క్షమియయించు | క్షమియించు |
| 8 | 4 | బుట్టు ఽ కృతికృత్యత | బుట్టుకృత ఽ కృత్యత |
| 9 | 15 | నిహాగ్రము | నిగ్రహము |
| ,, | 16 | బాతు | బాఁతు |
| 10 | 28 | క్షెమంకర | క్షేమంకర |
| 13 | ,, | నవభాగము | సవభాగము |
| 15 | 27 | దీపకు | దీవకు |
| 17 | 8 | ఽ మవ్వపుస్నెట్టు | మవ్వ ఽ పుస్నెట్టు |
| ,, | 25 | విడిసన్ | నిడిసన్ |
| 22 | 12 | వీవ | నీవ |
| 23 | 6 | గుమి ఽ చందమునన్ | ఽ గుమిచందమునన్ |
| 25 | 2 | బో లెఁజెఱుప | బోలిచెఱుప |
| 29 | 10 | మించి ఽ సకల | ఽ మించిసకల |
| ,, | 21 | చికురభ్రూ | చికురాభ్రూ |
| 33 | 16 | నిగుడ్చె | నిగిడ్చె |
| ,, | 28 | ఽ బరాఙ్ముఖంబు | బఽరాఙ్ముఖంబు |
| 34 | 17 | పుంబిక | పుంపిక |
| 35 | 22 | ఽ ములకుశక్య | ములకు ఽ శక్య |
| 36 | 4 | యాత్రఁ ఽ | ఽ యాత్రఁ |
| ,, | 10 | ఽ నున్నపుర | నున్న ఽ పుర |
| 37 | 4 | గ్రాచెడు | గ్రాఁచెడు |
| ,, | 13 | తే. మనసిజుహూతి | క..మనసిజుహూత |
| ,, | 24 | యనఁగదనరి | యనఁగఁదనరి |
| 38 | 21 | ఽ బ్రవేశపెట్టె | బ్ర ఽ వేశపెట్టె |
| 39 | 28 | ఽ మదికలఁక | మది ఽ కలఁక |
| 52 | 20 | మోవిపై | మోవి పైఁ |
| 53 | 3 | నటగూయు | నటఁగూయు |
| 56 | 9 | కర్మి | కర్మి |
| ,, | 17 | పూర్వాౖమా | పూర్వాశ్రమా |
| ,, | 20 | బాపఁడు | బాఁపఁడు |
| 63 | 13 | వించును | వించుచును |
| 65 | 1 | 64 | 65 |
| [illegible] | 21 | [illegible] | 164 |

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 7[illegible] | 8 | జాఱఁగఁ | జాఱఁగ |
| 82 | 7 | [illegible] | వేఱ కై చెప్పఁగ |
| .90 | 3 | [illegible] | ఁదీర్ప |
| ,, | 9 | యాశాన్య | యాశాస్య |
| 92 | 2 | వీఁడై | వీడై |
| 94 | 21 | గరుజిగురుల | గరుఁజిగురుల |
| 96 | 5 | యెలిఁగించు | యెలుఁగించు |
| 98 | ,, | తొాడ | తోడ |
| 99 | 16 | నడుగుట | నడఁగుట |
| 101 | 13 | శాఖ | శాఖి |
| 103 | 4 | కడక | కడఁక |
| 106 | 10 | ధరనుతా | ధరసుతా |
| 107 | 11 | వణకుచును | వణఁకుచును |
| ,, | 19 | సల్పఁ కై బోయె | సల్పు కై దుఁజనె |
| ,, | 23 | వేడికొనన్ | వేఁడికొనన్ |
| 110 | 12 | నెఱిసడ | నెఱిపడఁ |
| 111 | 15 | యల తి | యలరతి |
| 123 | 3 | వేడఁ | వేఁడఁ |
| 127 | 4 | గవుఁగలింప | గవుఁగిలింప |
| 130 | 20 | క్షొాణి | క్షోణి |
| 135 | 25 | జాగి | జాఁగి |
| 140 | 23 | చాగి | చాఁగి |
| 143 | 11 | మునతారక | మునఁదారక |
| 149 | 27 | మూాకలు | మూఁకలు |
| 150 | 15 | నలుదెసలును | నలుదెసలను |
| 152 | 23 | దులఁకింప | దులకింప |
| ,, | 27 | బొడఁగని | బొడగని |
| 158 | 22 | గ్రమ్మగ | గ్రమ్మఁగ |
| 159 | 12 | నెడదఁ కై దోచె | నెడఁదఁ కై దోఁచె |
| 160 | 7 | య్యారిష్ఠముల | య్యారిష్టముల |
| 162 | 2 | వేడుము | వేఁడుము |
| 165 | 7 | సుము | సము |
| 181 | 12 | మ్రోచెన్ | మోచెన్ |

